

# ఉపోద్ఘాతము.

## ప్రాచీనాంధ్రనాటకములు.

### ప్రతిజ్ఞాచాణక్యము చరిత్రాత్మకమగు నాటకము.

ఆంధ్రమునఁ బ్రప్రథమమున నాటకములు రచించిన మ. రా. రా. పరవస్తు వేంకటరంగనాథాచార్యులు, కొక్కొండ వేంకటరత్నపండితులు వావిలాల వాసుదేవశాస్త్రులు, ధర్మవరము కృష్ణమాచార్యులు, మున్నగు విపశ్చిద్వర్యులు, తామాంధ్రమున నూతనకావ్యనిర్మాణము నొనర్చుచుంటిమని తలంచుచుండిరి. గ్రంథపరిశోధనమున నా కాలమునందలి యాంధ్రులు, వెనుకఁబడియుండుటచే, ఆంధ్రనాటకనిర్మాణమును గూర్చిన వారి యభిప్రాయములు నింద్యములు కాకపోవచ్చును గాని, పరిశోధన విధానములు వివిధములుగ విస్తరిల్లుచుండిన నేఁడుకూడ ఆంగ్లవిద్యాంసులు నాటకరచన యాంధ్రమునఁ గడుంగడు నూతనమనియుఁ బ్రబంధనిర్మాణమునకై యెంతయో శ్రమపడిన పూర్వపుటాంధ్రులు, నాటకనిర్మాణమునకై యేల శ్రమపడరైరో యనియుఁ దమ యభిప్రాయములను విచ్చలవిడిగా వెదజల్లుచుండుట మిక్కిలి యాశ్చర్యకరమై యున్నది. పదునారవ శతాబ్దమునకు నంతయుండుండిన పింగళి సూరనార్యుఁడు, సుప్రసిద్ధమగు ప్రభావతీప్రద్యుమ్నమున నొకానొక నాటకసమాజమును (ఆకాలమున నీసమాజములకు "మేళము" లనిపేరు) గూర్చి వర్ణించుచు నిట్లు వ్రాసియున్నాఁడు:—

ఉ॥ ఆవనజాక్షినందనుఁడు ♦ నంతట నాందిఁదగంబఠించి యిం
పావహిలన్ బ్రరోచనయు ♦ నాముఖమందనరార, నొప్పుఁ బ్ర
స్తావనతో ముఖాదులగు ♦ సంధులు సాంగతఁ బెంపుమీఱ, గం
గావతరాదినాటకము ♦ లాడె ననేకము లద్భుతంబుగన్॥

సీ॥ ఆనాటకప్రయో ♦ గావసరముల భ
గీరథాద్యాకార ♦ ధారణమును
గంగాదినిమ్నగా ♦ గతియుఁ గైలాసాది
నగకల్పనమును, నా ♦ నావస్త్ర

పంచకంబును, బహు ♦ పక్షిమృగాది జం
తువిశేషరూప వ ♦ స్తులును, మఱియు,
నెచటికెయ్యాదియోగ్య ♦ మచటఁ దద్ద్రవ్యస్త
సృష్టిపన్నిదము వే ♦ సియును గృతక

గీ॥ మగుట నిశ్చయింపగలేక, ♦ యబ్రపడుచుఁ
జూచి, సామాజికులు తమ ♦ సొమ్ము లెల్ల
నొసఁగులుగ నైవ, నడపుచు, ♦ నొప్పమీఱ,
రుక్మిణీమతుండు, మాయాని ♦ రూఢి మెఱసి॥

ఈమేళములు సూత్రధారుఁడును, పారిపార్శ్వకుఁడును, విదూషకుఁడును "వారసీమంతినీవ్రాతము", ను, వైణిక, వైణవిక, మౌరజకజనాది నాట్య సామగ్రియును, గలిగి, యథోచితగతిఁ బయనంబులొనర్చి, నగరంబుల విడిసి విడిసి యతివిచిత్రంబులగు తమ యాటనేర్పులు నెఱపుచుండిరట! ఇట్టి మేళములకును, ఈకాలమునందలి సురభివారివంటి నాటకసమాజములకును గల భేదమేమి? కావున, 16 వ శతాబ్దమున నాంధ్రదేశమున నాటకసమాజములు గలవనుట సత్యము.

ఇఁక వీరాడుచుండిన నాటకములలోని భాష యాంధ్రమేనాయని ప్రశ్న. ఆంధ్రమేయని నాసమాధానము.

పింగళిసూరన్నకు ఇంచుమించుగా సమకాలికులును, కొంచెము తరువాతివారును అగు కవులచే రచింపఁబడిన ఆంధ్రనాటకములు పెక్కులు * తంజావూరిలోని లిఖిత పుస్తకాలయమున నిప్పుడు కన్పట్టుచున్నవి. ప్రాచీనాంధ్రనాటకములనుగూర్చి విపులమైన యొక వ్యాసము మున్ముందు వ్రాయఁబోవుచున్నాను. కావున నిప్పుడు స్థాలీపులాకముగామాత్రము వ్రాయుచున్నాను.

ఈగ్రంథాలయమున 68 కన్న నెక్కువగా ఆంధ్రనాటకములు కలవు. ఇవి యన్నియును, సాంఘిక, చారిత్రక, పౌరాణికవిషయికములై యున్నవి. మహారాజులు విద్వాంసులు, వేశ్యలు, నాటకకర్తలై యుండిరి. మధురవాణి, రంగాజి, కృష్ణాజి మొదలగు స్త్రీలు సుప్రసిద్ధనాటకములను రచించియుండిరి. అప్పటి నాటకములలో

---

* ఈ ప్రాచీననాటకములనుగూర్చి మాగురువుగారగు మ. రా. రా. రా. సా. గి. వెం. రామమూర్తిపంతులుగారు పరిశోధించి తమ పరిశోధనల వలనఁ దేలినవిషయముల నాకుపదేశించియున్నారు. నేను స్వయముగాఁ బరిశోధించి తెలిసికొన్న విషయములతో నవి పమ్మేళనమొనర్చి యీవ్యాసమున వ్రాసియున్నాను.

వల్లీకళ్యాణము, ప్రబోధచంద్రోదయము, రాధావంశీధరవిలాసము మొదలగునవి ప్రాముఖ్యము వహించియుండెను. ఆకాలమునందలి నాటకములలో సూత్రధారపారిపార్శ్వక నిర్ధూషకులుండుటచేతను, అంకవిభజనయుండుటచేతను యక్షగానములకన్న భిన్నములై నేటినాటకములకు దరిదాపుగానున్నవి.

పరిభావతీ పరిణయమ్మున వర్ణించిన నాటకములకును పైజెప్పిన నాటకములకును భేదములేకుండుటచేతను, అవి ఇంచుమించుగ సమకాలికములగుటచేతను, పదునారవశతాబ్దమున ఆంధ్రనాటకముల రచనయు, ప్రదర్శనములునుగూడ నాంధ్రదేశమున వ్యాపించియుండెననుట నిశ్చయము. కావున నాటకరచన ఆంధ్రమున నూతనముగాదు

## చరిత్రనాటకములు.

చారిత్రకవిషయములు నేడగ్రస్థానము వహించియున్నవి. * చరిత్రాత్మకములగు నవలలును, నాటకములును లెక్కకు మిక్కిలిగా నేడు వెలువడుచున్నవి. నేడు ఆంధ్రకవులు వ్రాయుచున్న చరిత్రాత్మకములగు నాటకములలోఁ బెక్కులు రసవంతములుగానే యున్నను వేంకటరాయశాస్త్రులుగారి ప్రతాపరుద్రీయమువంటి సర్వాంగ సుందరమైన నాటకము వేఱొకటి యుత్పత్తి కాలేదు. ప్రస్తావనలోనున్న యీప్రతిజ్ఞాచాణక్య మాలోపమును గొంతవఱకుఁ దీర్పఁగలదు. వంగభాషలో ద్విజేంద్రలాల్ రాయి యను మహాకవి రచించిన చంద్రగుప్తనాటకము ననుసరించి యుచితములైన మార్పులతో నాంధ్రమున నీనాటకమును గవి వ్రాసియున్నాఁడు. క్రీస్తుకు పూర్వము నాలుగవశతాబ్దమునందలి హిందూదేశపు పరిస్థితులనుగూర్చియు, అందును ముఖ్యముగా భారతీయులకును గ్రీకులకును, జరిగినయుద్ధములను గూర్చియు, మౌర్యసామ్రాజ్య నిర్మాణమును గూర్చియు, చాణక్యరాజనీతిని గూర్చియు,ఁ జక్కగా కవి చర్చించియున్నాఁడు కావున ఈ నాటకమునందలి కథ సులభముగా గ్రహించుటకై చారిత్రక విషయములు కొన్ని చర్చింపవలసియున్నవి.

---

* చరిత్రరచనయందు ప్రాచీనహైందవులు వెనుబడియుండిరని నేటి విమర్శకులు వ్రాయుచుండుట వింతలలో వింత. ప్రతాపవిజయము రాయవాచకము, తంజావూరి రాజులచరిత్ర, కృష్ణరాయవిజయము మున్నగు చరిత్రగ్రంథములు తెనుఁగులో నెన్నియో గలవు. ప్రాచీనాంధ్రనాటకములలో చారిత్రనాటకములును పెక్కుగలవు. కొన్నిటి నీక్రింద వ్రాయుచున్నాను.

శాహరాజవిలాసము — శేషాచలకవి
కల్యాణము — గిరిరాజకవి
విజయరాఘవ చంద్రికావిహారము, కల్యాణము — కోనేటిదీక్షితులు.
మన్నారుదాసవిలాసము — రంగాజమ్మ
రఘునాథాభ్యుదయము — విజయరాఘవరాయలు

# చరిత్రాంశములు.



క్రీస్తు పూర్వము నాలుగవశతాబ్దమున అలెగ్జాండరు దండయాత్రయు, మగధ రాజ్యముపై నవనందులయధికారమును ప్రధానములైయున్నవి. కావున ఆరెంటును ప్రత్యేకముగాఁ జర్చించుచున్నాను. ఈవిషయమునుగూర్చి శ్రీ స్వామి విద్యానందపరమహంస బి. ఏ. గారు విజ్ఞానచంద్రికాగ్రంథమాలలోఁ బ్రచురించిన "చంద్రగుప్త చక్రవర్తి" అను గ్రంథమునఁ గొంతవఱకు యుక్తియుక్తముగా వ్రాయఁబడియున్నది. కాని శ్రీ పరమహంసగారు వ్రాయకవిడిచినయంశములు పెక్కుగలవు. కావున, అందు వ్రాసినయంశములు సంకుచితములుగను, వ్రాయనియంశములు విపులములుగను జర్చించుచున్నాను.

మగధసామ్రాజ్యము భారతీయసామ్రాజ్యములలో మాత్రమే గాక ప్రాపంచిక సామ్రాజ్యములలోనుగూడ నుప్రసిద్ధస్థానము వహించియున్నది. మహాభారతకాలమున జరాసంధుఁడు చక్రవర్తులలో మేటియైయుండెను. అప్పటికే నగరనిర్మాణమునను, పరిపాలనవిధానమునను, మాగధు లగ్రస్థానము వహించియుండిరి. క్రీ. పూ. 7 వ శతాబ్దమునుండియును మగధరాజ్యమును శైశునాగులు పరిపాలించుచుండిరి. వీరిలో బింబిసారునికాలమున—ఆఱవశతాబ్దమున—బుద్ధుఁడును, మహావీరుఁడును దమతమమతములను స్థాపించిరి. నాలుగవశతాబ్దమున నీసామ్రాజ్యమును నవనందులుపరిపాలించుచుండిరి. వీరు బ్రాహ్మణులను, శూద్రులను ద్వేషించుచుండుటచే, బ్రాహ్మణులును, శూద్రులు నేకీభవించి నందవంశమును విధ్వంసముచేసి, మౌర్యరాజ్యమునుస్థాపించిరి. నవనందులుబ్రాహ్మణద్వేషముఁ గలవారయ్యును, బలవంతులగుట శత్రుభయంకరులై, హిందూదేశమునకుఁదూర్పుభాగమును పరిపాలించుచుండిరి. ఆకాలమున భారతవర్షమునకుఁ బశ్చిమభాగమున చిన్నచిన్నస్వతంత్రరాజులు చిన్నచిన్న స్వతంత్రరాజ్యములకు నధిపతులైయుండిరి. ఇది కనిపెట్టిహిందూదేశమంతయు నిర్జ్జియుండెననితలఁచి, దానిజయించిపాలించుటకై గ్రీకులరాజయిన అలెగ్జాండరు హిందూదేశముపై దాడివెడలెను. అలెగ్జాండరు గొప్పవీరుఁడని పాశ్చాత్యపండితులు వ్రాసియున్నారు. * అతిప్రాచీనకాలమున అసరేయ (అస్సీరియా) దేశాధీశ్వరియగు సెమిరామిస్(Semiramis—

* పాశ్చాత్యులదృష్టిని అలెగ్జాండరొక్కవీరుఁడయ్యును హిందూదేశమున నాతఁడు సంపూర్ణవిజయమునందలేదు. దీని గూర్చి ప్రాచీనగ్రీకుచరిత్రకారులు కొందఱు నిష్పక్ష

queen of the Assirians)హిందూదేశముపై దాడివెడలెను. అప్పుడు నలచక్రవర్తి తండ్రియగు వీరసేనుఁడు చక్రవర్తియై హిందూదేశమును బరిపాలించుచుండెను. వీరసేనుఁడు సెమిరామిస్‌ను పూర్ణముగా జయించి యామెను హిందూదేశమునుండి తరిమివేసి, ఆశరేయుల నౌకాదళమును యుద్ధసామగ్రిని దీసికొని, భారతీయులగౌరవమును గాపాడెను.

ఆపైఁ జాలకాలమువఱకును పాశ్చాత్యులు హిందూదేశముపై దాడివెడలలేదు. తరువాత క్రీ. పూ. 6 వ శతాబ్దమున "డెరయస్" అను పారసీకరాజు హిందూదేశముపై దండెత్తి సింధునదికిఁ బశ్చిమభాగమును జయించి పారసీకరాజ్యమునఁగలిపెను. * ఆకాలమున హిందూదేశము మిక్కిలి ఫలవంతమై ధనవంతమై యుండుటయే గాక హైందవులు మహావీరులయి యుండిరని పారశీకచరిత్రకారులు వ్రాసియుండిరి. భారతీయుల శరసంధాన నైపుణ్యమును గనిపెట్టి డెరయస్ కుమారుఁడగు గ్జెరిగిజిస్ Xerxes) అను పారశీకచక్రవర్తి భారతీయులను దనసైన్యమున విలుకాండ్రఁగాఁ జేర్చుకొని గ్రీసుదేశముపైఁ దాడివెడలి విజృంభించెను. భారతీయులు బాహుబలమున క్షీణించిరని యనుకొనుచున్న నేఁటికాలముననే పాశ్చాత్యకదనరంగమున శ్వేతముఖులపై భారతీయసైన్యములు విజృంభించి భారతీయులవీరత్వమును పాశ్చాత్యులకుఁ జవిజూపినవన రెండువేల యేనూరేండ్లక్రిందట భారతీయవీరులు పాశ్చాత్యకదనరంగమున విజృంభించి శ్వేతముఖులను చీకాకుపఱచుట వింతగాదుగదా ! సెమిరామిస్ డెరయసులనుగూర్చి విని యలెగ్జాండరు తాను వారికన్నమిన్నగాఁగోరి హిందూదేశముపై దండయాత్రచేసెను. సెమిరామిస్ డెరయసులు పాశ్చాత్యులయ్యును ఆసియాఖండమువారే ! కావున అలెగ్జాండరే భరతవర్షము జయింపఁదలఁచిన మొదటి శ్వేతముఖుఁడు.

---

పాతముగా వ్రాసినను, నేఁటియాంగ్లేయచరిత్రకారులు దానినిగప్పిపుచ్చి అలెగ్జాండరు పరాజయము ఆయిరోపాకంతకును పరాజయమనితలఁచి కాఁబోలు తప్పువ్రాతలు వ్రాసియున్నారు. కాని సత్యమిప్పుడిప్పుడు బయలుపడుచున్నది.

* పారశీకులదండయాత్రనుగూర్చిన ప్రసంగమంతయు భారతీయగ్రంథములలో నెక్కడను గన్పట్టదు. ప్రాచీనపారసీకగ్రంథములే యిందుకాధారములై యున్నవి కావున పారశీకులదండయాత్రలోని యాథార్థ్యమును కనిపెట్టుటకు భారతీయచరిత్రకారులకు కష్టమైయున్నది.

* అలికసుందరుఁడు అతిస్వల్పకాలములో సిరియా పరిషియా యీజిప్టు బాక్ట్రియా మున్నగు దేశములనుజయించి * హిందూదేశద్వారమునను తక్షశిలానగరమును ముట్టడించెను. తక్షశిలానగరమా కాలమున నొకచిన్నస్వతంత్ర రాజ్యమునకుఁ బ్రధానస్థానమైయుండెను. ఆదేశము మిక్కిలి ఫలవంతమైయుండెను. ప్రజలు శాంతవృత్తులవలంబించి సుఖజీవనమొనర్చుచుండిరి. తక్షశిలానగరము పెద్దవిద్యాపీఠమై పెక్కు దేశములనుండి విద్యార్థుల నాకర్షించుచుండెను. ఆదేశమును అంభీయను రాజుపాలించుచుండెను. (గ్రీకుచరిత్రకారులలోఁగొందఱు Taxiles అనియును కొందఱు Ambh అనియును వ్రాసిరి. Taxiles అనునది నగరనామమైనను పురుషనామముగా భ్రమింపఁబడెను. Ambhi అనునది ఆభీరశబ్దమునకు గ్రీకువికృతి కావచ్చును. ప్రాచీనకాలమున ఆభీరులు ఆప్రాంతములలో నేయుండిరి.) తనసైన్యమున మహావీరులుండియుండినను, సుఖజీవనము నేయుచుండిన ప్రజలకు యుద్ధమువలన సుఖభంగముకలుగుననియు విద్యలకు నాశనముకలుగుననియు, తలంచి అంభీ అలెగ్జాండరుతో సంధిచేసికొని, ఆతనికి కావలసినపదార్థముల నతనికిచ్చి. తనకుఁగావలసినది అలెగ్జాండరువద్దతీసికొని నిశ్చితుఁడైయుండెను. అలెగ్జాండరట్టినిశ్చింతనొందక వీరులతో నిండియుండిన హైందవ సైన్యమువలన గ్రీకులకెట్లయిన ముప్పువచ్చునని భయపడి దుర్మార్గుఁడై, రాత్రియందు నిదురించుచున్నప్పుడు హైందవసైన్యములపై హఠాత్తుగాఁబడి వారిలోఁజాలమందిని వధించెను.

(1) ఇదిమిక్కిలిదుర్మార్గమనియు, అలెగ్జాండరు కీర్తికిదికళంకము తెచ్చెననియుం గ్రీకుచరిత్రకారకుఁడొకఁడు వ్రాసియున్నాఁడు.

---

* అలెగ్జాండరు అనుపేరు హైందవశాసనములలో అలికసుందరుఁడని వ్రాసియున్నది. చూ ‹‹అలికసుందరో నామ... (అశోకుని శిలాశాసనము.) * అలెగ్జాండరువాటికిదేశములు బలహీనములైయుండుటచే, వానినిజయించినంతమాత్రమున అలెగ్జాండరు వీరుఁడని చెప్పుటకు వీలులేదు.

1 ఇట్టిదుష్కార్యము చేసిన వాఁడెట్టివీరుఁడో భారతీయు లూహింపఁజాలరు. కాని ఈవిషయమును నేఁటిపాశ్చాత్య చరిత్రకారకులు కప్పిపెట్టిరి.

(2) తక్షశిలానగరమునుండి అలెగ్జాండరు మల్లులదేశముపయికిఁబోయెను. ఈమల్లులుమహావీరులు. వీరితోజరిగినయుద్ధములో అలెగ్జాండరుకు గొప్ప గాయముతగిలెను. దానివలన అతఁడు మూర్ఛితుఁడై మృతప్రాయుఁడైపడిపోయెను. అతనియనుచరులతని దీసికొనిపోయి పరిణవైద్యము చేసిన నాతఁడెట్టకేలకు బ్రతికెను. అంతనతఁడు భయపడి యాదేశమునుండితప్పించుకొని చల్లచల్లగా (3) పౌరవుల రాజ్యమును ముట్టడించెను. పౌరవునితో ముఖాముఖిగాయుద్ధముచేయలేక కొంతసైన్యమును రాత్రిచీఁకటిలో నదిని దాటించి దొంగతనముగా పౌరవుని సైన్యముపై బడెను. నిద్రావస్థలోనున్న పౌరవుని సైన్యము వెంటనే తెలివి తెచ్చుకొని చేతనయినంతవఱకు యుద్ధముచేసి గ్రీకుసైన్యమును చీకాకుపఱచెను గాని దానిని గెలువలేకపోయెను. అయినను హైందవసైన్యమును గెలుచుట గ్రీకుసైన్యమునకుఁ జాలకష్టమయ్యెను. పౌరవునితో జరిగినయుద్ధము వలన గ్రీకులు ధైర్యహీనులయిరని గ్రీకుచరిత్రకారులు వ్రాసియున్నారు. ఈసమయముననే మగధరాజ్యమున కొన్నియల్లరులు సంభవించెను.

మహాపద్మనందుఁడు మహాబలవంతుఁడై మహాధనవంతుఁడై మహావైభవముతో మగధరాజ్యమును బాలించుచుండెను. అతనిసైన్యమున ఎనుబదివేల గుఱ్ఱములును రెండులక్షల కాల్బలమును, ఎనుబదివేల రథములును, ఆరువేల ఏనుఁగులును ఉండెనని గ్రీకుచరిత్రకారులు వ్రాసియున్నారు. అతని యనంతరమున అతని కుమారులగు నవనందులు రాజ్యమునకు వచ్చిరి. వీరు దుర్మార్గులై బ్రాహ్మణద్వేషమును, శూద్రద్వేషమును గలవారైయుండిరి. మహాపద్మునకు శూద్రస్త్రీయైన మురయందు చంద్రగుప్తుఁడను కుమారుఁడు జనించెను. ఇతఁడు రాజులకుచితమైన సుగుణసంపదగలవాఁడగుటచే రాజ్యమున నున్నతస్థానము వహింపఁదలఁచెను. కాని శూద్రులయందలి యగౌరవబుద్ధిచేతను, మురయందలి ద్వేషభావము చేతను, వారు చంద్రగుప్తుని దృణీకరించిరి. అభిమానియగుటచేఁ జంద్రగుప్తుఁడు నందరాజ్యవిధ్వంసముచేయఁదలఁచి, అలికసుందరుఁడు పరాక్రమశాలి యని వినియుండుటచే అతనిఁజేరి యతని సహాయము నపేక్షించెను. అలికసుందరుఁడు నందరాజ్యమునుగూర్చి ప్రసంగించి యాతని రాజ్యమునకుఁగల వైశాల్యమునుగూర్చియు సైన్యమునుగూర్చియు వాస్తవమైన సమాచారమును దెలిసికొనెను. అంత పెద్ద సామ్రా

---

2 ఈమల్లులకు గ్రీకుచరిత్రకారులు Mallians అనివ్రాసియుండగా విన్సెంటుస్మిత్ గారు మాళవులని అర్థముచేసిరిగాని అది వాస్తవముగాదు.

3 గ్రీకుచరిత్రకారులు Porus అనివ్రాసిరి. దానికి పురుషోత్తముఁడని తప్పుగా అర్థముచేయఁబడెను. వేదకాలములోఁగూడ పౌరవులీప్రాంతములోనే యుండిరి.

జ్యము హిందూదేశమునఁ దూర్పుభాగమునఁ గలదని తానదివఱకు వినియుండవచ్చును. అయినను సహజముగ పరాక్రమశాలియగుటచే నందరాజ్యముపై దండెత్తుటకుఁ దలఁచెను గాని యాతని సైన్యముమాత్రము ధైర్యహీనమైయుండెను. ఇరువదివేల కాల్బలములు రెండువేల గుఱ్ఱములును గల పౌరవుని జయించుటకే యెంతయో శ్రమ పడవలసివచ్చెను గదా! అంత సైన్యముగల మగధరాజ్యమును దామెట్లు జయింపఁగలుగుదుమని మాసిడోనియనులు (గ్రీకులు) భయపడి మేము ముందొక యడుగైనఁ బెట్టమని చెప్పి, తమ నాయకుని యాజ్ఞలను మీఱివేసిరి. అలికసుందరునకు తనసైన్యముపైఁ గోపమువచ్చి కొన్ని దినము లెవ్వరితోను మాటాడక, యలిగి, తన డేరాలో పండుకొనియుండెను. అప్పటికిని తనసైన్యము తనమాట వినలేదు. మీఁదుమిక్కిలి తన డేరాలోనికివచ్చి «బ్రదికియుండిన సుఖములు బడయవచ్చు, నాథా! మన రథమిఁక మరలనిమ్ము» అనువార్లు «స్వామీ, మా యాలుబిడ్డలఁ జూచుటకు మాకనుజ్ఞయిమ్ము. మాగధసైన్యాగ్నిలో మమ్ముఁ ద్రోయకుమని యాతనిపాదములపైఁబడి ప్రార్థించిరి. చేయునదిలేక యెట్టకేలకు అతఁడంగీకరించి తనసైన్యమును మరల్చెను. కాని తన దేశమును చేరకముందే బాబిలోన్ నగరమున మన్యజ్వరముచే నాతఁడు మృతినొందెను. ఆతఁడు మృతినొందిన వెంటనే యాతని రాజ్యమంతయు నాతని సేనాధిపతియగు సెల్యూకసు చేతిలోఁ బడెను. వెంటనే యాతఁడు రాజ్యమంతయు నాక్రమించి, తన యధీనమునకుఁ దెచ్చుకొని యభివృద్ధిచేసికొనుచుండెను.

అలెగ్జాండరువలన సహాయమునొందక చంద్రగుప్తుఁడు తిరిగి యింటికి వచ్చుచుండగాఁ ద్రోవలో నందులచేఁ బరిభవింపఁబడినవాఁడును, నందరాజ్యవిధ్వంసమొనర్పఁ బ్రతిజ్ఞ గైకొనినవాఁడును, బ్రాహ్మణుఁడునునగు చాణక్యుఁడాతనికిఁ గన్పడి, యుభయుల యుద్దేశము నొక్కటియగుటచే తన మంత్రబలమున నందరాజ్యవిధ్వంసమునకుఁ దాను తోడ్పడుదునని చంద్రగుప్తున కాతఁడు వరమిచ్చెను. సుప్రసిద్ధనీతిశాస్త్రకర్త యగు కౌటిల్యుఁడు తన నీతిశక్తిచే నలికసుందరునిచే నవమానితములైన హైందవ రాజ్యములను బోగుచేసి, వారి సహాయమున నందరాజ్యవిధ్వంసనమొనర్చి, మౌర్యరాజ్యమును స్థాపించి, తన ప్రతిజ్ఞను నెఱవేర్చుకొనెను. బ్రాహ్మణుని బుద్ధిబలమును, శూద్రుని బాహుబలమును గలసి నందరాజ్యవిధ్వంసనమొనర్చిన పిమ్మట చంద్రగుప్తుఁడు సికందరుపై క్రోధముఁ దీర్చుకొనఁ దలంచెను గాని, అప్పటికాతఁడు మృతినొందెను. ఇంతలోఁ గాకతాళన్యాయమున, విదేశీయులగు గ్రీకులను జయింపవలెనను సంకల్పము చంద్రగుప్తునకును, హిందూదేశమును పూర్ణముగా జయించి యలికసుందరునికన్న మిన్నయగుకీర్తి సంపాదింపవలెనను తలంపు సెల్యూకసునకును [illegible]

యుభయులకును యుద్ధమయ్యెను. ఆయుద్ధమునఁగూడ. చాణక్యుని నీతిశక్తిచే చంద్రగుప్తునికే జయమయ్యెను. అంతట గ్రీకురాజు గ్రీకులు జయించిన భారతవర్షభాగమును తన కూతుతోఁబాటు చంద్రగుప్తునకిచ్చి, రాయబారిగా మెగాస్తనీసును * నియమించి, కన్యాశుల్కముగా ఏనూరేనుఁగులను చంద్రగుప్తునివలన గ్రహించెను. తనపక్షమునఁ బనిచేయుచున్న యొక పార్వతీయ భూపాలుని కుమార్తెను తాను పెండ్లియాడఁదలఁచుకొని యుండఁగా, సెల్యూకను కుమార్తెనుగూడఁ బెండ్లియాడ వలసి వచ్చుటచే, భారతీయ భూపాలుర యాచారము ననుసరించి, చంద్రగుప్తుఁడు ఆయువతీమణుల నిర్వురనుగూడఁ బెండ్లియాడి, చాణక్యుని సహాయమున నిశ్చింతుఁడై రాజ్యపాలనము చేయుచుండెను.

ఈసందర్భమున అలెగ్జాండరునుగూర్చిన వాస్తవవిషయముల కొన్ని వ్రాసి శాఖాచంక్రమణ మొనర్చినందుకు పాఠకులు మన్నింతురుగాక.

అలెగ్జాండరునుగూర్చి నిష్పక్షపాతముగ వ్రాసిన ప్రాచీనగ్రీకుచరిత్రకారులలో ప్లూటార్కు అను నాతఁడు ముఖ్యుఁడు. ఈతఁడు వ్రాసిన వ్రాతలలోఁ గొన్నిటిని తారుమారుచేసి కొన్నిటిని విడిచియు, నేఁటిపాశ్చాత్యచరిత్రకారులు చరిత్రలువ్రాసి యున్నారు. భారతీయచరిత్రకారులు దీనిని గమనింపక, దొరలు చెప్పినదే వేదమని తలఁచి కాఁబోలు—వారిననుసరించియే వ్రాసినారు. చరిత్రపరిశోధనలలో స్వతంత్రస్థానము వహించిరని మనమనుకొన్న కె. వి. లక్ష్మణరావుగారుగూడ నిట్టి పొరపాటుచేసిరని చెప్పుటకు చింతగానున్నది. ప్లూటార్కుగ్రంథము లాంధ్రభాషలో లేకుండుట విచారముగానున్నది. కావున అంధ్రుల యుపయోగమునకై అందు కొన్ని వాక్యము లుదహరించుచున్నాను.

(1) ఆభీరుల సైన్యమునుగూర్చి:—

There was a certain number of soldiers of the Indians, the warlikest men of all that Country.........did great hurt unto Alexander in diverse places.

వీరు హిందువులలో గొప్పవారు. పెక్కుతావుల అలెగ్జాండరునకు బాధకలుగఁజేసిరి.

---

* మెగాస్తనీ సనుపదము మహాస్థానికుఁడను సంస్కృతపదమునకు సరిపోవుచున్నది. ప్రస్తుతచరిత్రకారులెట్లూహించినను, నేనుమాత్రము మెగాస్తనీసనునది యొకపురుషుని నామముకాదనియు, నొకయుద్యోగము పేరనియు నూహింతును.

2. Alexander having made peace with them in a city where they were kept in, when they came abroad upon surity of this place, which they had made, he met with them as they went their way, and put them all to the sword. There was but this only fault to blemish the honour of his noble deeds in all his wars.

ఆభీరుల సైన్యములుగల యొకనగరముతో సంధి చేసికొని, సంధి కారణమున, వారు నిరాయుధులై నిర్భయమున వెలికి రాగా, వారినందఱను జంపివేసెను. ధీరుఁడైన యలెగ్జాండరు చేసిన కార్యములలో నిది యొక్కటియే యాతనికి కళంకముఁ దెచ్చెను.

౩ మల్లులనుగూర్చి:—

In assailing the city of the Mallians (which they say are the warlikest men of all the Indians,) he was almost slain there.

* * * *

At the length he had a blow with a dart on his neck that so astonied him that he leaned against the wall looking upon his enemies. In the meantime, the Macedonians compassing him round about took him, and carried him into his tent half in a swoon, and was past knowledge. Where upon there ran a rumour straight in the camp that Alexander was dead. This notwithstanding, he over came the danger and escaped. * * *

Being very weak, he kept diet a long time to recover himself and never came out of his tent until he heard the Macedonian cry about his tent to see him.

హిందువులందఱిలో మల్లులు మిక్కిలి పరాక్రమవంతులని చెప్పుదురు. వీరిపట్టణము ముట్టడించినప్పుడు అలెగ్జాండరు మృతప్రాయుఁడయ్యెను. యుద్ధమున నాతనికి బాణమొకటి గుచ్చుకొనెను. దానివలన నాతఁడు నేలగూలి, శత్రువులవైపు చూచుచు నొకగోడకు జేరగిల్లియుండెను. ఇంతలో గ్రీకులాతనిచుట్టుముట్టి, జాలినొంది, మూర్ఛాస్థలో చైతన్యరహితుఁడైయున్న యాతని నతనిడేరాలోనికిఁ దీసికొనిపోయిరి.
అప్పుడు అలెగ్జాండరు మృతినొందెనను వార్త వ్యాపించెను.

కాని, యాతఁడెట్లో ఆ యపాయమునుండి తప్పించుకొని యందుండి పారిపోయెను. మిక్కిలి నీరసముగా నుండుటచే, తిరిగి యారోగ్యవంతుఁ డగువఱకును పథ్యముగా నుండి, డేరాలోనే నివసించుచు తనసైన్యము తన్నుఁ జూడవలెనని యేడ్చి మొఱ్ఱపెట్టువఱకు నాతఁడు డేరానుండి పైకిరాకుండెను.

పౌరవునిగూర్చి:—

This last battle against King Porus killed the Macedonian's hearts and made them say that they had no desire to go any further to conquer India. For, finding that they had such ado to overcome them, though they were but twenty thousand footmen and two thousand horse, they spake ill of Alexander when he went about to compell them to pass over Ganjes. * * * * * * * *

Alxander then offended with his men's refusal, kept close in his tent for certain days and lay upon the ground. * * * *

His soldiers came to the door of his tent crying and lamenting humbly beseaching him to lead back agin.

పౌరవునితో జరిగిన యుద్ధమువలన గ్రీకులగుండె బ్రద్దలయ్యెను. ఇఁక హిందూ దేశమున ముందొకయడుగైనఁ బెట్టుటకు వారికిష్టము లేకుండెను.

అంతతక్కువ సైన్యముగల పౌరవుని జయించుటకే యంతకష్టమయ్యెనుగదా పెద్దసైన్యముతోనున్న గంగాతీరమును జయించుటకు సాధ్యమెట్లగునని భయపడి, గంగాతీరమువైపు యుద్ధమునకుఁ బోండనినందుకు వారు అలెగ్జాండరును నిందించిరి.

* * * * * * * * * *

అలెగ్జాండరు తనసైన్యముపైనలిగి, కొన్నిరోజులు కదలక మెదలక డేరాలో పండుకొనెను.

* * * * * * * * * *

గ్రీకుసైన్యములు డేరావద్దకువచ్చి, తమ యింటికిఁ దమ్ముఁ దీసికొని పోవలసినదని యేడ్చుచు నతని బ్రతిమాలుకొనిరి. బ్రాహ్మణులను గూర్చి వ్రాయుచు:—

The grave philosophers and wise men of India did greatly trouble him also. For they reproved the Kings and princes of the Indians for that they yielded unto Alexander and procured the free cities to take arms against him.

హిందూదేశమునందలి తత్వశాస్త్రజ్ఞులు అలెగ్జాండరుకు చాలబాధనొసంగిరి. అతనికి లొంగిపోయిన రాజులను జీవాట్లుపెట్టి, అలగ్జాండరుపై తిరుగుబాటు చేయునట్లు వారినగరములవారిని ప్రోత్సాహపరచిరి.

హిందూదేశములో అలెగ్జాండరు చూపిన పరాక్రమముఁగూర్చి ప్రాచీనగ్రీకు చరిత్రకారుఁడు వ్రాసిన యీవాక్యములు చాలవా? ఆకాలమునందలి బ్రాహ్మణుల దేశభక్తిని, ఈకాలమునందలి బ్రాహ్మణుల దేశభక్తితో పోల్చిచూడుఁడు.

## నాటకరచన.

ఈనాటకకర్త యీచారిత్రక విషయములను చక్కగా గ్రహించి, యిందు వివరించి యున్నాఁడు. కావున నీనాటకము సహృదయులకు హృదయంగమమై యుండు ననుటకు సందేహము లేదు. ఇఁక నాటకమునందలి కొన్ని మంచివిషయములను చూపెదను.

1 నందులుచూపిన బ్రాహ్మణద్వేషము వలన చాణక్యునకు జనించిన కోపమును గవి యిట్లు వర్ణించియున్నాఁడు.

చం. హరిహృదయంబు దన్నినిట ♦ లాక్షు మనోతిశయంబడంచి, భీ
కరమగుక్షాత్రవంశకుజ ♦ కాండకఠోరకుఠారమై, ధరా
మరునకు గౌరవంబొసఁగి, ♦ మాన్యులకున్ భువిఁగల్పభూజమై
పరమపవిత్రమై వెలుఁగు ♦ బ్రాహ్మణతేజము సంస్మరించెదన్.

2 బ్రాహ్మణ విద్వేష ♦ పాపంబునంగాదె
వేయిచేతులవాని ♦ యాయువణఁగె;
బ్రాహ్మణవర్యుని ♦ వంచించుటంగాదె
వేయికన్నులవాని ♦ పెంపణంగె;
బ్రాహ్మణుఁ జేయవజ్ఞ ♦ గమియించుటం గాదె
రాజైన చంద్రుఁడు ♦ రహిఁదొలంగె
బ్రహ్మర్షివరులని ♦ ర్బంధించుటంగాదె
నహుషుండు సర్పజ ♦ న్మంబుఁ దాల్చె

గీ. జపతపోధ్యాన పరులౌట ♦ శాంతులౌట
బ్రాహ్మణప్రవరులు పర ♦ బ్రహ్మహితులు
రోగి కౌషధద్వేషంబు ♦ రూపుమాపు
బ్రాహ్మణద్వేషమట్టిదే ♦ పార్థివులకు.

ఈకోపమున జనించిన చాణక్యుని ప్రతిజ్ఞయెంతయుఁ బ్రశంసనీయము.

చం. కలుషితచిత్తులన్ ఖలుల ♦ క్షత్రియదుర్జనులన్ కుఠారధా
రలవధియించునా పరశు ♦ రాముని నీవు స్మరించునట్లు నీ
కులమును సంహరించి, నినుఁ ♦ గూల్చెద నీప్రాయంబుఁ జీల్చెదన్
కలియుగభార్గవుండని జ ♦ గంబునుతింపగఁగీర్తి గాంచెదన్.

గీ. నందులకు ఘోరవిలయంబ ♦ మందకోప
వహ్నిజనితధూమలతికా ♦ వలయమీశి
ఖావలయము నీహృదయార ♦ క్తమునఁగాని
సంస్కరింప, నిగ్రహింప, ని ♦ స్సంశయముగ.

3 నందుని పైఁగల ద్వేషమున బ్రాహ్మణులును, శూద్రులును, నేకీభవించుట యిట్లు చక్కగా చెప్పబడినది.—

సీ. బహుభాండములయందుఁ ♦ బరిఢవిల్లినయట్టి
మృత్పిండ మేకమై ♦ యొసఁగునట్లు
బహుభూషణములందు ♦ భాసిల్లుచున్నట్టి
బంగార మేకమై ♦ పరగునట్లు
బహుధేనువులయందుఁ ♦ బ్రభవించియున్నట్టి
క్షీర మేకంబయి ♦ చెలఁగునట్లు
బహు దేహములయందు ♦ బ్రజ్వలించుచునున్న
పరమాత్మ యేకమై ♦ వఱలునట్లు

గీ. మనమహోద్యమ మేకమై ♦ యనలమట్లు
శాత్రవుల బూదెసేయుని ♦ స్సంశయముగ
విప్రుడును శూద్రుఁడేకీభ ♦ వించిరేని
యీప్రభుత్వంబు నశియించు ♦ నేమిచింత

4 హెలేనా అంటియోకసులు ఏకగర్భజనితులు. అయినను ఆవిషయము విస్మృతమయ్యెను. కావున అంటియోకసు హెలేనాను బెండ్లియాడఁదలఁచి యామెను బ్రోత్సాహము చేసెను కాని యామె యంతరాత్మ యందుల కంగీకరింపలేదు. పిదప ఆ స్వప్నము తెలిసిన పై అంటియోకసు పరితపించెను. ఈవిషయ మీనాటకమునఁ జక్కగా వర్ణింపఁ బడినది.

ఆ టియోాకను మోహము హేలేనా నిరాకరించుట:—

మ. బలవంతుండు జయించి, దేహములను ♦ స్వాధించి దేహంబులన్

బలిమిన్ దుర్ధింపఁగవచ్చు, వారి హృద ♦ యస్వాతంత్ర్యమున్ బల్మినె

గెలువన్ జాలునె? నీవు నాయెడలలోఁ గెడెంచినన్ నామనో

బలమున్ నీవుజయింపఁజాలుదువె? సం ♦ భావింపుమీధర్మమున్.

5 చంద్రగుప్తునిపై ఛాయయును, హేలేనాయును, జూపిన మోహము పునరుక్తి లేకయు నైరర్థ్యములేకయుఁ జక్కఁగా వర్ణింపఁబడినది. అందును, హేలేనాను సెండ్లియాడి యామెతో సింహాసనమునఁ గూర్చుండిన తనమనోనాయకుఁడగు చంద్రగుప్తుని జూచినప్పుడె ఉత్తమస్త్రీయగు ఛాయహృదయమున జనించిన భావపరంపర యాకవి మిక్కిలి నేర్పుతో వివరించియున్నాఁడు.

హృదయమా, దుఃఖింపకుము—అబ్బా—అబ్బా— అసూయాపరిభావము— శరీరము వశమగుచున్నది—

మ. అనసూయన్ వహియించి, యోర్వఁగనుమా. ♦ యాఁకొంపిలోంగఁబుంన్

వనటంజెందగ నేల? తాల్మివలదే? పాదాబ్జముల్ తోటిలెన్

కనుదోయిల్ మితిమీఱి పొంగిపారలెల్ ♦ గన్నీరు మున్నీరుగా

మనమా, యీర్ష్యవహింప,బోలదునుమా ♦ మన్నించి శాంతింపుమా?

దైవికగుణ సంపత్తికిని, ఆసురగుణ సంపత్తికిని ఛాయహృదయమున జరిగినయుద్ధమిందు మిక్కిలి పరిశీలనీయము.

6 కాత్యాయనుని పాణినీయమునందలి వేదాంతమును గూర్చిన పిచ్చిహాస్యరసమును జక్కఁగా బోషించుచున్నది. "ఇష్టినాస్తిక భిక్షుకుని నేనెన్నఁడు జూచియుండలేదు. "తత్పురుషః సమానాధికరణపదః కర్మధారయః" అన్నట్టున్నది. అర్థమేమనఁగా

నీవు పాణినీయముఁజక్కఁగ బలించియుందువె.

భత్తు— లేదుబాబూ.

కాత్య—

(సాధునిశ్చలదాసు గారి విచారసాగరమున నచ్చటచ్చట పాణినీయ వ్యాకరణమునందలి వేదాంతమును గూర్చి ప్రసంగములుకలవు. అవి చదివినవారికి కాత్యాయనుని పిచ్చి స్వభావ సిద్ధముగాఁ గన్పట్టును.)

ఈనాటకము నిట్టిమనోహరములైన విషయములు పెక్కుగలవు. ఈనాటకమునందలి పాత్రరచన ప్రశంసార్హము గానున్నది. అందును పురుషపాత్రలలో చాణక్యుని యందును స్త్రీపాత్రలలో ఛాయయందును, మనోహరపాత్రరచనా నైపుణి కన్పట్టుచున్నది.

కాని నాటకరచనలో అవలంబింపవలసిన భావనుగూర్చి నాయభిప్రాయములు భిన్నములు గానున్నవి. కావున ఆవిషయమై యిప్పుడు వ్రాయఁదలఁచుకొనలేదు.

ఈకవికి వృత్తరచనలో మిక్కిలి నేర్పుగలదు. ఇంతకుముందే నేను చెప్పినరీతిగా—చంపకోత్పలములన్న శార్దూలమత్తేభములు ధారాశుద్ధిగలవై యుండును.

ఉ. నాకొక, డొకఁడైనఁబడు ♦ నాల్గుజగంబులు నాదుకోపమున్
గాకలమ్రగ్గవే? యుడుగణంబులు రాలవె? నేఁడుచూచెదం
గాక, యెవండునన్నునరి ♦ కట్టఁగఁజాలనె? నీదుఖడ్గమున్
గైకొని నే వధించెదను; ♦ గాకులు గ్రద్దలు సంతసింపఁగన్.

మ. వనభాగంబునఁ బంచమస్వరమునన్ ♦ వాసంతవేళన్ బికం
బనురక్తిన్ వహియించి పాడుఁదనలో ♦ నానందముప్పొంగఁగ; నె
వ్వనిమోదంబునకై మరుచ్చలితమై ♦ వల్లీదళంబాడుఁ? దా
ననుకూలించియొనర్చు కార్యమునఁదా ♦ నానందముంబొందెనున్.

ఇట్లు
మండపాక పార్వతీశ్వరశాస్త్రి.



# మనవి.

ఆంధ్రసోదరులకు. —

నేనింతకుఁ బూర్వము విజయ విజయము (లేక) కర్ణవిక్రమము. విచిత్ర వీరబొబ్బిలియను నామాంతరమునఁ బద్మనాయక విక్రమమునను రెండు నాటకముల విరచించి యాంధ్రలోకమున కొసంగితిని. నాయీ నాటకము లాంధ్రభాషాభిమానులచే మిక్కిలి కొనియాడఁబడుటంబట్టి మఱియొండు నాటకము విరచింపనుద్యుక్తుఁడనై యుండు సమయమున, బ్రహ్మశ్రీ ఆదిభట్ల తరిణయ్య సిద్ధాంతిగారు వంగభాషయందు విఖ్యాతికెక్కిన కవిచంద్రులు, ద్విజేంద్రలాల్ రాయగారి నాటకములు రసవంతములని నాకుఁదెలియఁజేసి, తన్నాటకములలోఁ బ్రసిద్ధికెక్కిన చంద్రగుప్త నామనాటకమును సంపూర్ణముగఁ బఠించి నాకుబోధించిరి. శ్రీయుతద్విజేంద్రలాల్ రాయగారి కథావస్తువిధానమునంతయు బ్రహ్మశ్రీ తరిణయ్య సిద్ధాంతిగారి వాఙ్ముఖమున, నాహృదయఫలకమునఁ జిత్రించికొని, వారి సంపూర్ణసాహాయ్యముననే, ప్రతిజ్ఞాచాణక్యమను పేరనీనాటకము మిక్కిలి శీఘ్రకాలములోనే విరచించితిని. నేనీ నాటకము సంపూర్తిగ విరచించి నాలుగుసంవత్సరముల పర్యంతము మిన్నకుంటిని. ఇట్లుండ, వేఁగుఁజుక్కమండలి కార్యదర్శి గారగు మ॥ రా॥ రా॥ దేవరాజు కృష్ణారావు పంతులుగారు తమ గ్రంథమండలియందుఁ బ్రకటింప నన్నొక నాటకముఁ గోరిరి. సిద్ధముగనున్న యీ నాటకమె వారికొసంగితిని. ఈ నాటకముఁ బఠించి, మిక్కిలి యానందించి, తమమండలియందుఁ బ్రకటింప నంగీకరించి నన్నెంతయు బహూకరించినందుకు శ్రీ దేవరాజు కృష్ణారావు పంతులుగారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. ఈ నాటకమున ముద్రింపఁబడిన యుపోద్ఘాతము బ్ర॥ శ్రీ॥ మండపాక పార్వతీశ్వరశాస్త్రి B. A. గారిచే విరచింపఁబడినది. ఈ నాటకము సాంగముగఁ బఠించి విపులముగ విమర్శించి యనేక నూతనాంశములతో విరచించినందులకు శ్రీ॥ శాస్త్రి గారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను — గురుతుల్యులును మదీయ ప్రాణమిత్రులునగు బ్ర॥ శ్రీ॥ తరిణయ్య సిద్ధాంతి గారికి ననేకవందనముల సమర్పించుచున్నాను — ఈ నాటకమునంగల మంచిచెడ్డల విమర్శించు స్వాతంత్ర్యముఁ బాఠకమహాశయులకొసంగి. యాంధ్రలోకము ప్రోత్సహించెనేని, శ్రీద్విజేంద్రలాల్ రాయగారి నాటకముల నాంధ్రభాషామతల్లికి సమర్పింప సంసిద్ధుఁడనని యిందు యూలముగ ధనికులగు నాంధ్రభాషాభిజ్ఞులకు విన్నవించుకొనుచున్నాను.

ఇట్లు విధేయుఁడు

భాగవతుల నృసింహశర్మ

గ్రంథకర్త.



శ్రీరామచంద్రాయనమః

# ప్రతిజ్ఞాచాణక్యము.

## నాంది.

ఉ. ధర్మము సర్వమానవుల దైవతమయ్యది నిర్వహించి, స
త్కర్మము లాచరింపుము; విఘాతమువచ్చినఁ గీడుమూడదీ
చర్మము మాంసపంకిలము శాశ్వత మాత్మకు నాశముండదీ
మర్మమెఱుంగుమంచు బుజుమార్గముఁ గ్రీడికిఁ జూపినట్టి రా
ణ్మర్మములంగలంచిన రమావిభుఁడోముత భారతీయులన్.

గీ॥ "శిష్టజనపరిత్రాణాయ దుష్టశిక్ష
ణాయ ధర్మసంస్థాపనార్థాయ సంభ
వామి ప్రతియుగమ్మ" ని నాఁడు పలికినట్టి
పార్థసారథికిన్ శత వందనములు.

ఉ. గాంధికి లోకసన్నుతయుగంధరమంత్రిసమానదివ్య ధీ
కంధికి, వాఙ్నిశాత శరకాండనిఖండిత శత్రురాష్ట్రని
గ్రంథికి, సంధివర్జితపరస్వరరంధికి, సర్వదేశసం
బంధికి భక్తిపూర్వకనమస్కృతులిచ్చెద నిష్టసిద్ధికిన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి తెరవైపుఁ జూచి

నటీ......(అనిపిల్చుచు.)

నటుఁడు—(ప్రవేశించి) ఏమి యాజ్ఞ?

సూత్ర—నీవు వచ్చితివేమి ?

నటుఁడు—ఎవరైననేమి? కాలయాపనకు.

సూత్ర—కాలయాపనకిది సమయముగాదు. చూచితివా ? పరిషజ్జనమును.

నటుఁడు—ఓహో! నేఁడెట్టిసుదినము. అందుకే నాకావులింతలు వచ్చుచున్నవి.

సూత్ర—అనఁగా ?

నటుఁడు—వింతలులేని యావులింతలుండవుగదా?

సూత్ర—అవును. నేఁడొక నూతననాటకముఁ బ్రయోగింపవలెను.

నటుఁడు—నూతననాటకమనఁగా నెట్టిది? పురాణగాథలంగలది యీపరిషజ్జనమున కింపుబెంపదా ?

సూత్ర—ఆకాలము గతించినది.

చం. పలుకులఁ జేనెలుట్టిపడు పద్యములున్న నుదారభావముల్
గలిగిన, సౌష్ఠవంబుగ న లంకృతులన్ గనునింపునింపినన్
విలసదనేక పాత్రల ప్రవేశమునం జవులూరఁజేసినన్
వలచిపఠింప రెందు మన వారు పురాణకథాప్రసంగమున్.

నటుఁడు—అవునవును. అట్లయిన నెట్టినాటకముఁ బ్రయోగింపవలెను?

సూత్ర—నిజదేశకథావిధానముంగల నూతననాటకమునంగాని యీసభ్యులానందింపరు.

నటుఁడు—ఆనాటకనామధేయము?

సూత్ర—చంద్రగుప్తనామాంతరముఁగల ప్రతిజ్ఞాచాణక్యము.

నటుఁడు—ఓహో! ఈచరిత్ర మెల్లరకుఁ జెఱకుపిప్పియైనది.

సూత్ర—ఇది యట్టిది గాదు. వంగభాషయందు ప్రసిద్ధికెక్కిన ద్విజేంద్రలాలురాయకవి విరచించిన చంద్రగుప్తనాటకమున కనురూపముగ నీరూపకము ప్రతిజ్ఞాచాణక్యము విరచింపఁబడినది—

గీ. అతివిచిత్రంబు వివిధర సాస్పదంబు
భావవిలసితంబతుల క థావిధాన
సంయుతంబు, మృదులశబ్ద సౌష్ఠవంబు
నవ్యకావ్యమీ చాణక్య నాటకంబు.

నటుఁడు—అట్లనా? మన యీ యాంధ్రకవింగూర్చి యెఱుంగుదువా?

సూత్ర—ఎఱుంగకేమి ?

సీ. ఇరువదియొనిమిది యేండ్ల ప్రాయమువాఁడు
ద్రావిడకులజుండు బ్రాహ్మణుండు
భాగవతులవంశ వారాశిచంద్రుండు
నరసింహమంగఁద నర్చకాఁడు
సూర్యనారాయణ సూరమాంబా తనూ
జాతుండు, పండిత జనసఖుండు
సంస్కృతాంధ్ర సమాన సాహిత్యవిభవుండు
కవితారసో ల్లాసకాముకుండు

గీ. విజయ విజయబొబ్బిలివీర విక్రమాది
నాటకంబుల సుప్రబం ధములను, శత
కముల, నవలలవ్రాసిన కవివరుండు
కాళికాపురాణగ్రంథ కారకుండు.

నటుఁడు — ఈపలుకులకే పరిషజ్జనమానందించునా? నాటక ప్రయోగమున మన నేరుపు, కవికూరుపు, వ్యక్తమగును.

సూత్ర—మంచిది. నీప్రతత్ప్రయత్నమున నుందుము.

నటుఁడు—నీముఖవిలాసముఁజూచి నాటకము జయప్రదముగ నుండునని నిశ్చయింపవచ్చును.

సూత్ర—చంద్రగుప్తునకు సెకందరుభవిష్యద్వాక్యముఁ జెప్పినట్లు పల్కితివి. నీవాక్య మమోఘమగుఁగాక. (అని పరిషజ్జనముఁ జూచి)

సీ. కతకజక్షోద సంకలితమై స్వచ్ఛమౌ
సలిలముంబోలును స్వాంతమునను
కర్ణకఠోరంబు గా నుంతయున్ సతిఁ
గావింపకుండఁగఁ గలవణంచి
కళలచేవికసిల్లు జ్ఞానచంద్రికల న
జ్ఞానతమోవినాశనముఁ జేసి
మంచిచెడ్డలనేర్పరించునిరూఢిచే
హంసలచాతురి ననుకరించి

గీ. అమలభావంబున శరత్తు ననుసరించి
నృహారికృతిరచనాచమత్కృతికిన్నెన
నాటకముఁ జూడనలయు నానంద మొందఁ
వలయు నాంధ్రదేశీయ విద్వాంసులార.

నటుఁడు—బావా! బాగుగాఁ జెప్పితివి.

సూత్ర—మనకిఁక విళంబమునకు వేళలేదు. రమ్ము—

(ఇరువురు నిష్క్రమింతురు.)



శ్రీరామచంద్రాయనమః

# ప్రతిజ్ఞాచాణక్యము.

ప్రథమాంకము:—ప్రథమదృశ్యము.

స్థానము:—సింధునదతటము. కాలము:—సంధ్య.

(యవనసేనాసన్నివేశసమీపమున, సెకందరు, సెల్యూకసు, నస్తమించుచున్నసూర్యునిఁ జూచుచుఁ బ్రవేశించుచుందురు. హెలేన సెల్యూకసు పార్శ్వమున నిల్చియుండును.)

సెకందరు—నీవనినది నిశ్చయము. ఈ దేశము విచిత్రముగనున్నది. దినకాలమునందు ప్రచండమార్తాండుని యెండలు గాఢనీలాకాశముఁ గాల్చుచుండును. రాత్రికాలమున సుధాకరుఁడు, స్నిగ్ధజ్యోత్స్నాప్రవాహమున లోకము జలకమాడఁ జేయుచుండును. మఱియుఁ దామసీనిశీథములయందు నగణ్యములగు నక్షత్రములు ఆకసమును కాంతివంతముగఁ జేయుచున్నవి. చూడ సొంపుగనుండదా? ప్రావృట్కాలమునఁ గృష్ణమేఘమండలము దైత్యసంఘమువలెఁ భీకరగర్జనధ్వనులతో గగనరంగమున నాట్యమాడుచుండును. ఆశ్చర్యమాశ్చర్యము. అభ్రభేదియై ధవళతుషారమాళియై, హిమాద్రి స్థైర్యముఁ జూపుచున్నది. విశాలములగు సీనదీనదములుద్వేగమున నెట్లు బరుగులిడుచున్నవో పరికింపుము—.

సెల్యూ—సత్యము. సత్యము. సార్వభౌమా!

సెకం—చూచితివా? ఒకచోఁ దాళవనములు గర్వించినట్లుఁ దలలెత్తి మెట్లునిల్చియున్నవో? ఒకచాయ, విశాలవటవృక్షములు స్నిగ్ధచ్ఛాయల నలుగడల వ్యాపింపఁజేయుచున్నవి. ఒక కేళీవ మత్త మాతంగములు జంగమపర్వతంబులవలె విడంబించుచు, మందమంద గతులఁ బ్రకటించుచున్నవి. ఒకఘోర మహాభుజంగములు హింసాపరుల వక్రగతులఁ జూపుచున్నవి. ఒకతావున నుత్తుంగశృంగకురంగములు మార్గ్యమును వెల్లడిజేయుచు, నిర్జనవనాంతరమున శూన్యదృష్టులఁ జూచుచున్నవి మఱియు నీఖండమును, సౌమ్యాకారదీర్ఘ కాంతిఁగల యొకజాతి పరిపాలించుచున్నది. ఈజాతి ముఖమున శైశవసారళ్యము, దేహమున వజ్రశక్తియుఁ, జక్షువుల సూర్యదీప్తియు, వక్షస్స్థలమున నమోఘసాహసము విరాజిల్లుచున్నది. విక్రమాక్రమమునఁ దమ్ము జయింపఁగలవారిఁగాంచి యానందించుఁగాని, యించుకంతయు ద్వేషింపదు. పౌరవుని నేను బంధింమనప్పు డాతని పలుకుల నీవు విని యుండవా?

సెల్యూ—ఆపలుకులెట్టివి సార్వభౌమా?

సెకం—నేనతనిఁజూచి, నావలన నీకుఁ గావలసిన దేమని నేను ప్రశ్నింపగా నాతఁడు:—

చం. గెలుపు తొలంగెనంచు మది • గ్రించుఁదనంబిసుమంత లేక, యా
దలఁబయికెత్తి తీపికొలి • తళ్కుగురొత్తఁగఁజూచి పిన్నన
వ్వొలయగ క్షత్రియోత్తమున • కొప్పగు గౌరవమిచ్చుగింతు, నీ
వలన లభించుఁగాకయని • నత్కు విముగ్ధ గభీరధ్వోరణిన్.

నేనీవాక్యమునకుఁ జమత్కృతుఁడనై "యీజాతియంతయు నిట్టిభావముఁ గలిగియుండు"నని మనంబునందలంచి తత్క్షణమే పౌరవుని కాతని రాజ్య మొసంగితిని.

సెల్యూ—ఉదారభావులకిది వింతగాదు.

సెకం—ఆతనిఁ జూచినంత నపూర్వమగు నుల్లాసము నాకుద యించెను. సామ్రాజ్యము స్థాపించు కోరికతో నే నీఖండమునకురా లేదు. దిగ్విజయకీర్తి స్తంభము జగతి నెలకొల్ప నే తెంచితిని.

సెల్యూ—సార్వభౌమా! అట్లయిన దిగ్విజయము సంపూర్తిఁ జేయకుండఁ బోనుద్యమింప నేల?

సెకం—నా యాశయమమోఘముఁ జేయుటకు నూతన సైన్య ము గావలసియున్నది. సేనాధిపతీ! ఎంతటి యాశ్చర్యము. మాసడను రాజ్యమునుండి వచ్చునపుడు మదీయసేనాపదాఘాతములకుఁ దృణ ములంబోలి మార్గమునంగల జనపదంబు లణఁగినవిగదా? ఘుంఘుం మారుతముఁబోలు చమూసమూహముచే, నేను శత్రుసేనాసంఘము ను ధూమరాశిం జేసితిఁగదా? ఆసియాఖండార్ధభాగము, మాసడను సామ్రాజ్యవిజయవాహినీవీరపదభరమునకుఁ గంపింపదా? నియతి వలె దుర్వారమై, హత్యవలె కరాళమై, దుర్భిక్షమువలె నిష్ఠురమై, ప రాక్రమించు మదీయప్రతాపము, శత్రురాజ హృదయ రక్తసిక్తమగు విజయశకటము నధిరోహించి యాసియాఖండార్ధభాగోపరివక్షస్స లమునుండి దాడివెడలెంగదా? అయిననేమి? అణగిడినయంతఁ బిడుగు వడినవడుపున, బాల్యారంభమున నే, శతమ్రిసదీరముచ, నిమహావీరుని చే నాప్రతాపఖడ్గము మొద్దువోయెంగదా? అదియట్లుండె; తక్షశిలానగ రమునంగల యంభీభూపాలునియెడ, సంశయాత్ముండనై యర్ధరాత్రి మున నేఁ గావించిన, ఘోరకార్యమునకు, నామనం బెంతయుఁ బరితపిం, చుచున్నది. అనంతరము, తన్నగరమును వీడి వెడలి, మల్లులతోఁ బోరాడి

జీవచ్ఛవంబనై, బ్రదికివచ్చితి. నీవెఱుంగవా? మిక్కిలి మనసే నాసమూహము విరక్తిఁజెంది, హిందూదేశమనిన భయమొందుచు న్నది—నాయాజ్ఞ ధిక్కరించినది. ఇంతియకాక, మగధరాజ్యము మి క్కిలి బలవంతమైనదని తెలియవచ్చినది.

(అనంతరము, చంద్రగుప్తునితో నాంటియోకస్. ప్రవేశించును.)

సెకం—అంటియోకస్! విశేషమేమి? (చంద్రగుప్తునిఁజూచి) ఈతఁడెవఁడు?

ఆంటి—ఇతఁడొక చారుఁడని తలంచెదను.

సెకం—చారుఁడా? సమాచారమేమి?

ఆంటి—ఇతఁడు మన శిబిరపార్శ్వమునఁ గూర్చుండి, సుష్క తాళపత్రమున నేమియో వ్రాయుచుండఁ జూచితిని, నేనుసమీపించి పరిశోధించితిఁగాని నాకేమియుఁ దెలియకుండెను. అందుచే సార్వభౌ ముని సన్నిధానమున కీతనిఁ దెచ్చితిని.

సెకం—యువకా! నీవు వ్రాయుచున్న యంశమేమి? సత్య ముఁ జెప్పవలెను.

చంద్ర—సత్యమునే పలికెద. రాజాధిరాజా! భరతఖండము సత్యదేవతకుఁ బుట్టినిల్లు.

సెకం.—(సెల్యూకసుఁజూచి, యనంతరము చంద్రగుప్తునితో) మంచిది. నీవువ్రాసినయంశముఁ దెలియఁజేసి, నీదేశగౌరవము నిలుపు కొనుము.

చంద్ర—విశేషమేమియు లేదు. నేను సార్వభౌమునిశిక్షయు వ్యూహములఁ బన్నువిధానము, యుద్ధసన్నాహ ప్రక్రియ, రణయా త్రామార్గము, మాసకాలమునుండియు గమనించుచుంటి.

సెకం—ఎవనిశిక్షచే నేర్చుకొనుచుంటివి?

చంద్ర—(సెల్యూకసుఁజూపుచు) ఈసేనాధిపతివలన,

సెకం——సెల్యూకస్ ! ఇదిసత్యమా?

సెల్యూ——సత్యము సార్వభౌమా !

సెకం——(చంద్రగుప్తునితో) అనంతరము?

చంద్ర——సార్వభౌముని సేనాసమూహ మీస్థలమునుండి మగిడిపోవుననివిని, నే నేర్చిన విషయమంతయు నీపత్రమున వ్రాయుచుంటిని.

సెకం——వ్రాయుటలో నీయభిప్రాయ మేమి?

చంద్ర——సెకందరు చక్రవర్తితోఁ బోరాడుతలంపునఁ గాదు.

సెకం——అట్లయిన?

చంద్ర——సార్వభౌమా ! నేను మగధదేశరాజ పుత్త్రుఁడను; చంద్రగుప్త నామధేయుఁడను. మదీయజనకుఁడు మహాపద్మనందుఁడు. నాతమ్ముఁడగు నందుఁడు సింహాసనమాక్రమించి నన్ను వెడలించెను. ప్రతిక్రియకుఁ బ్రయత్నించుచుంటిని.

సెకం——మంచిది. అనంతరము?

చంద్ర——సార్వభౌముని యద్భుతవిజయవార్త నావీనులఁబడెను. మఱియు నాసియాఖండార్ధభాగ మతనిచమూసమూహముచే విచలితమయ్యెననియు, నదనదీపర్వతంబుల నతిక్రమించి యతని పరాక్రమము వ్యాపించెననియు, నార్యకులరవియగు పౌరవుని జయించెననియు వింటిని. మహావీరశిఖామణియగు, పౌరవుని జయింపఁజాలిన, యద్భుతపరాక్రమక్రమము నెఱుంగఁగోరి, యీసేనాధిపతివలన రణశిక్షాప్రక్రియ నభ్యసించుచుంటిని. అపహృతమైన నారాజ్యము నుద్ధరింపవలయుననియే నాముఖ్యాభిప్రాయము.

సెకం——(సెల్యూకసుఁ జూచును,)

సెల్యూ——నేనిట్లెఱుంగను. యువకుని యాకృతియు వాగ్ధోరణి

యు నాకు సంతసము గొలిపెను. నేనెఱింగిన యంశములఁ దెలియ జేసితి. విశ్వాసఘాతుకుఁడగునని యెఱుంగను.

ఆంటి—(కఠినముగ) విశ్వాసఘాతుకుఁడెవఁడు?

సెల్యూ—ఈయువకుఁడు.

ఆంటి—అసత్యము. నిశ్చయముగ నీవే విశ్వాసఘాతుకుఁడవు

సెల్యూ—ఆంటియోకస్! నాసా్రియము నీవు విచారింపకుఁ డినను, నాపదవినైన నెఱుంగుదువా?

ఆంటి—ఎఱుంగ కేమి? నీవు సేనాధిపతివయ్యు సార్వభౌముని విశ్వాసమునకు భంగము గల్పించితివి.

సెల్యూ—ఆంటియోకస్! (కోపముతో ఖడ్గమొఱనుండి గైకొనును.)

ఆంటి—(చేనున్న ఖడ్గము సెల్యూకసుశిరమును లక్షించివిసరును.)

చంద్ర—(తనఖడ్గముతో, నాఖడ్గమును నివారించును.)

ఆంటి—(చంద్రగుప్తునిపైఁ బడఁబోవును.)

సెకం—ఆంటియోకస్! తాళుము. తాళుము.

ఆంటి—(లజ్జచేఁదలవంచుకొనును.)

సెకం—ఈయాద్ధత్యమునకు నీవు, సామ్రాజ్యమునుండి వెడలింపఁబడితివి. సామాన్యసైనికున కింతటి యౌద్ధత్యమా? ఆశ్చర్యమున మ్రానుపడి నీసాహసకృత్యమును జూచుచుంటిని. నీవింతటి మూర్ఖుఁడవని కలనైన భావించియుండను. శీఘ్రముగ నీదేశమునుండి వెడలుము.

ఆంటి—(లజ్జించుచు నిష్క్రమించును.)

సెకం—సెల్యూకస్! నీయందు దోషమంత లేదు. భావికాలము నించుక విచారింపుము. సామ్రాజ్యాధిపతి నేత్రము లరుణితము లగునట్లొనర్చుట నినుఁబోలు సేనాధిపతికి క్షేమంకరమా? (చంద్రగుప్తునిఁజూచి) యువకా!

చంద్రి—సార్వభౌమా !

సెకం—నిన్నేలబంధింపరాదు?

చంద్రి—నేఁజేసిన యపరాధమెట్టిది?

సెకం—నాసేనాసన్నివేశమున గుప్తచరుఁడవై ప్రవేశింప వచ్చునా?

చంద్రి—ఇదియా యపరాధము. సెకందరు వీరవరుఁడని భావించితిని. ఇప్పుడతఁడు భీరువని గ్రహించితిని. గృహహీనుఁడై, నిరాశ్రయుఁడై, శిష్యుఁడై, వచ్చిన హైందవరాజపుత్త్రునిఁగాంచి యిట్లు భీతిల్లుటచే, సెకందరుచక్రవర్తి నైజము వెల్లడియైనదని తలంచెదను.

సెకం—సెల్యూకస్ ! ఇతనిబంధింపుము.

చంద్రి—సార్వభౌమా ! నన్ను వధింపకుండ బంధింపఁజాలవు.

(ఒఱనున్న ఖడ్గముఁ జేఁబూని)

ఉ. కేలఁ గృపాణముండ, బరికింపగరాని ప్రతాపముండ, నా నాళములన్ మహోకమల కొసరుదునిరక్తము పాఱుచుండ, భూపాలకులన్ జయింపఁగల బాహువులుండఁగ, నన్ జయింపగాఁ జాలవు ! నన్నుఁజంపిచెలి కొసాలకుఁబంపుము మ్లేచ్ఛనాయకా.

సెకం—(ఉల్లాసమున) ఏమిసాహసము !! ఎంతటిధైర్యము !! వీరశిఖామణీ ! వెడలుము. బంధింపఁదగవు. నిన్నుఁ బరీక్షింపనట్లు పల్కితిని. నిర్భయముగ నీరాజ్యమున కేగుము.

చంద్రి—సార్వభౌమా ! నేను నీసాయ మపేక్షించి వచ్చినవాఁడను.

సెకం—మంచిది-మగధరాజ్యసేనాబల మేపాటిది?

చంద్రి—సార్వభౌమా ! వినినంతమాత్రమున భీతిల్లెదవేమో? ఇరువదివేల గుఱ్ఱములు, రెండులక్షలకు మించిన కాల్బలము, మూఁడువేలరథములు, నాలువేలకు హెచ్చిన యేనుఁగులు, గలవని సేనాని

గుదును. మఱియు మూలబలమెంత యున్నదో నిర్ణయించి చెప్పఁ జాలను.

సెకం—(తనలో) అబ్బా! వినినంతమాత్రమున నాహృదయము వ్రీలుచుండ నిఁక నాసైన్యము, భయమునఁగాంచిన నాశ్చర్యమే మున్నది—(చంద్రగుప్తునితో) యువకా! నాభవిష్యద్వాక్యము విని సంతసింపుము. నీరాజ్యమునుద్ధరింపఁగలశక్తి నీకున్నది-దుర్జయపరాక్రమంబున దిగ్విజయ మొందుదువు. నీదేశమున కలంకారభూతుఁడవు. వెడలుము—వెడలుము. సంతసించితిని. (సెల్యూకస్‌తో సెకందరు నిష్క్రమించును)

చంద్ర—(తనలో) తుదకు గొప్పసాయములభించినది—ఊఁ—ఒకనిసాయముతో నేమిపని—దైవమనుకూలముగనున్నఁజాలదా?

(చంద్రగుప్తుఁడు నిష్క్రమించును.)

ద్వితీయదృశ్యము:—శ్మశానప్రాంతము.

కాలము:—ప్రత్యూషము. ఏకాకియైచాణక్యుఁడు ప్రవేశించును.

చాణ—ఔరా! ఈశ్మశానవాటికను దహింపఁబడుచున్న శవముల దుర్గంధము, పవనుని నిశ్వాసమును సైతము నరికట్టుచున్నది. శునకముల భం భం స్వనములచే బ్రకృతి, నిశ్శబ్దమునుండి మేలుకొనుచున్నది. ఈప్రాతఃకాలదేవి శరీరము వ్రణాంకిత మైనట్లున్నది. ఓసుందరీ! భీభత్సతా! నీసౌందర్యము ప్రశంసనీయము. సుందరీ! నీభీభత్సతాసుందరప్రవాహమున జలకమాడఁదలంచియే ప్రతిదినము ప్రాతఃకాలమునకు, నాగ్రామమునుండి యిచ్చటికే తెంచుచుంటిని. నీయందనేకాంశముల నభ్యసించితిని. నీవు నాకుఁ బ్రియసివైతివి. నీమైత్రివలన సంసారమేవగించితిని. ప్రేమను నశింపఁజేసితిని. ఈశ్వరునకనిష్టమగు నత్యాచారమునఁ బ్రవర్తింపఁదలంచితిని. ఓసుందరీ! సంసారమునకు మిక్కిలి దవ్వగనుండు మఱియొండుతావునకు నన్నుఁగొనిపొమ్ము. నర

కమైన నంగీకరించెదను. సంసారముకంటె మృత్యువైన నాకు మేలుగ నుండు. (అనియాలోచించుచు నిటునటు తిరుగుచుండును. అంత నించుక దూరమున నిరువురు మాటలాడుకొనుచుఁ బ్రవేశింతురు.)

ప్రథ—కాత్యాయనుఁడు తిరుగ నూతనమంత్రియయ్యెఁగదా?

రెండ—కాత్యాయనుఁడెవఁడు. అతనిపేరు శాకతాళుఁడని విని యుందునే?

ప్రథ—అట్లుకాదు. వానిపేరు కాత్యాయనుఁడే. అయిననేమి శాకము, తాళము రెండుఁదినుబడివస్తువులే—అదియట్లుండ—నేను భావించినదియేమనఁగా.

రెండవ—ఏమి? ఏమీ?

ప్రథ—మహారాజతనిఁ గారాగారమునుండి తుదకు విముక్తునిఁ జేసెను. ఇది యాశ్చర్యకరమైనవిషయము. మఱియు నాతనినే మంత్రి గనియోగించెను. ఆతనికొడుకుల నేడ్వురఁజంపి తుదకతె—

రెండ—రాజులకిట్టికార్యములు క్రీడ వినోదములు.

చాణ—(విని) "విశ్వాసోనైవకర్తవ్యః స్త్రీషు రాజకులేషుచ"

ప్రథ—ఎవఁడీతఁడు.

రెండ—చాణక్యుఁడు—బ్రాహ్మణుఁడు.

ప్రథ—మనుష్యుఁడగునా?

రెండ—అట్లే వినియుంటిఁగాని నాకట్టి విశ్వాసము లేదు.

ప్రథ—మనమీస్థలమున నుండఁజాలము రమ్ము.

రెండ—ఈబ్రాహ్మణునిఁ జూచినంత నాశరీరము కంపించుచున్నది.

(ఇరువురు నిష్క్రమించుచుందురు.)

చాణ—నీచులకీనాఁటికి ద్వేషముగలిగినది. బ్రాహ్మణునిఁజూచినప్పుడు శుభపరిణామమునకైన వారికి హస్తములు లేవు. నానీడ

మైన లోకముననుండుఁగాక. నానిశ్వాసమున విషజ్వాలయున్నది. నేను దుర్భిక్షకుఁడను. మూర్తీభవించినమసూచివ్యాధిని, నేఁజచ్చియు జీవించియేయుందును.

(కాత్యాయనుఁడుప్రవేశించును)

చాణ — హే...... హే...... హే...... ఈనిస్పృహయదరి ద్రబ్రాహ్మణునిపాదమున, సీచకుశాంకురము సహితము గుచ్చుకొని యుఁ దలచూపుచున్నది. ఈకుశాంకురము నిర్మూలనమగుంగాక. (అనికుశాంకురముఁబెల్లగించి రాతిపైఁ నఱుగఁదీయును,) ఆఁ, ఇప్పటికి నీ గర్వ మణంగినదా? ఈబ్రాహ్మణుని పాదమునఁ జొచ్చియుఁ దలచూపెదవా!

కాత్యా—(సమీపించి) నమస్కారము.

చాణ—ఎవఁడవురా నీవు?

కాత్యా—నందమహారాజుగారి మంత్రిని కాత్యాయనుఁడను.

చాణ—నందుఁడా? అతఁడు మహారాజుగారా? నీవాతనిమంత్రివా? కాత్యాయనుఁడవా? ఊఁ...ఊఁ...దూరముగనుండుము.

కాత్యా—అట్లనఁదగదు. నేఁజేసిన యపరాధమెట్టిది?

చాణ—నీయందపరాధమేమియు లేదు, మీమహారాజుగారి యపరాధమేమియు లేదు, ఈశ్వరునియపరాధమేమియు లేదు. అపరాధమంతయు నాయందేయున్నది. నాబ్రహ్మత్వమునకుఁ లోపముండుటయే నాయపరాధమునకుఁ గారణము. ఈశ్వరుఁడఁట. ఎవఁడో యున్నవాఁడట. వాఁడు నాగృహమును శూన్యముం జేసి నాగృహలక్ష్మిని బలాత్కారమున నపహరించుటయు నాయపరాధము. చోరులు నాప్రియకన్యకను దొంగిలించుటయు నాయపరాధము. ఈనాటికీ దరిద్రబ్రాహ్మణుని పాదమునందీ తుచ్ఛకుశగుచ్ఛము

గ్రుచ్చుకొని తలచూపుచుండుటయు నాయపరాధము. (కుశాంకుర ముజూచి) ఎట్లుంటివి? ఈపై నెప్పుడైన నన్ను బాధించెదవా?

కాత్యా—చాణక్యా! కార్యార్థినై యీదినము నీకడకు వచ్చితిని.

చాణ—మంత్రిమహాశయా! ఏలరావలెను? నాకేమున్నది. ఈయగ్నికుండమున్నది. మఱియు నీకుటీరముమాత్రమున్నది. కావలసిన, నీకుటీరమును దహింపఁజేయుము. పూర్వకాలబ్రాహ్మణ ప్రతాపమిానాడున్న—

కాత్యా—బ్రాహ్మణప్రతాపము లేకున్నదా? పాణిని చెప్పుచుండి యేమనగా?

చాణ—(స్వగతము) అయ్యది స్వకీయదోషము; జగతియందు గల సమస్తవిద్యను, యశమును, ఋషును తనస్వాధీనముఁ జేసికొన సాధ్యమగునా? శరీరమునకాహారము లేకున్న మస్తిష్కమభివృద్ధిఁబొందునా? తుదకు పతనము సంప్రాప్తమగును. సుందరీ! నీవు చెప్పితివిగదా! సహింపవచ్చునా? మఱియు నధఃపతనమేల ప్రాప్తించరాదు?

కాత్యా:—మీరు మౌనము వంహించి రేల? నేనవనిఁబొంఁబలుకుచుంటినో యోచుంగరా?

చాణ॥ ఆఁ.......... అధఃపతనము. అధఃపతనము............ ఎంతటిది? ఒక్కుమ్మడి పర్వతశిఖరమునుండి గభీరగహ్వరమునకు...... నేటికి బ్రాహ్మణుఁడు............ఆగహ్వరమునుండి, యంధకార బంధురమైన గర్తమునకు, నచటినుండి మఱియొండు నంధకారగహ్వరమునకుఁబోయి పతనశీలుఁడయి తలవంచుకొనియున్న వాఁడు. అన్యపరిత్యక్తతండులకణముల నాయత్తముఁ జేసికొని జీవించుచున్న వాఁడు. సిగ్గయిన లేకున్నది. ఒకప్పుడైపనిజన్నిదంబులఁగాంచి, దేవేంద్రాదులైన వారైనను

నుండిదిగి మన్నించెనో, ఎవనిపదాఘాతచిహ్న మాదినారాయణుని వక్షోభాగము నలంకరించెనో. యట్టిబ్రాహ్మణుఁడు నేడు నామమాత్రము నకు జన్నిదంబులఁదాల్చి, భిక్షకొఱకుఁ బదువుర వేఁడుకొనుచున్నవాఁడు. ఆహా! ఔరా! కాలమహిమ!! ఇంతకంటె హెచ్చుగ నధఃపతన ముండునా?

కాత్యా—తిరుగ బ్రాహ్మణ్యము తేజోవంతమగునేమో?

చాణ—అసంభవము. వారిక్షమ నశించినది.

కాత్యా—ఏమి? ఇప్పటికైన, మంత్రిగనుండువాఁడు బ్రాహ్మణుఁడేగదా? పురోహితకర్మలకు బ్రాహ్మణుఁడే నియోగింపఁబడుచున్నవాఁడు. విదూషకుఁడుసహితము బ్రాహ్మణుఁడే. విధ్యుక్తకర్మవిధానమున బ్రాహ్మణుఁడగ్రగామియైయున్నవాఁడు. ఈగౌరవజాతి యిప్పటికైన స్వర్ణసూత్రముఁబోలి సమస్తసమాజముల నలంకరించుచున్నది.

చాణ—బ్రాహ్మణ్యమునకు నిశీథము సమీపించినది. అటు చూడుము.

కాత్యా—బ్రాహ్మణుఁడు నిజప్రభుత్వమనుభవించుచున్నవాఁడు. తిరుగ తనజాతి నుద్ధరింపఁగలఁడు. నేనట్టియభిప్రాయముననే నిన్ను సమీపించితిని.

చాణ—ఏయభిప్రాయమున?

కాత్యా—మిమ్ము మహారాజుగారి మాతామహుని శ్రాద్ధమునకుఁ బౌరోహిత్యము నిర్వర్తింప—

చాణ—మంత్రిమహాశయా! దౌర్భాగ్యకుక్షింభరబ్రాహ్మణుఁడను. నాకు భక్షింప నన్నము, ధరింప వస్త్రము లేకుండుఁగాక. రాజపౌరోహిత్యమునకుమాత్రము రాఁజాలను. ఇఁకపై నీలోకమున, నీజన్మమున, నీబ్రాహ్మణుఁడట్టి కార్యముఁ జేయఁజాలఁడు, ధాత్రిదాస్యమనిన నేవగించెదను.

కాత్యా—బ్రాహ్మణా! వినుము.

చాణ—వినఁజాలను. ఇది యేమి? అత్యాచారము! నాయింట నగ్నికుండము సమీపమునఁ గూర్చుండి దుఃఖించెదఁగాని యట్టికార్యమున కొడంబడఁజాలను; రాఁజాలను.

సీ. వనభూమిరుహదత్త । పరిపక్వఫలముల
భక్షించి స్వేచ్ఛగా । బ్రిదుకవచ్చుఁ
బ్రకృతికాంతాదయా । రసముబోలిననదీ
వాఃపూరముఁగ్రోలి । బ్రిదుకవచ్చు
మానావనార్థంబు । చీనాంశుకము లేల?
వల్కలంబులఁగట్టి । బ్రిదుకవచ్చుఁ
దతహంసతూలికా । తల్పంబులవి యేల?
మ్రాకునీడఁబరుండి । బ్రతుకవచ్చు

గీ. బ్రిదుకు లేకుండినఁ జావ । వచ్చుఁగాక
దుర్మదాచ్ఛాదితాత్ములై । దుష్టులగుచు
నఖలజనులజీవనముల । నపహరించు
ప్రభుదురాత్ముల సేవించి । బ్రతుకఁదగునె?

కాత్యా—పురుషుని యాక్రందనమున శోభయావంతయు లేదు.

చాణ—లేకుండుఁగాక. (ఇంచుక యాలోచించి) మంత్రి మహాశయా! నేనేమి చేయఁగలను! భాగ్యవిపర్యయము సంభవించునపుడేమి చేయవచ్చును! ఇంతియేగాక, నాకన్యాపహారణమున నామేరుదండము భగ్నమైనది.

కాత్యా—(స్వగతము) ఈతనికీపాటియైనఁ గోమల ప్రవృత్తి యున్నదా?

చాణ—రాత్రికాలమున నేను కార్యాంతరమున, నొక స్థలమునకేగి వచ్చునప్పటికి నింట నాభృత్యుఁడు మైమఱచి భూమిపైఁబడి

యుండెను. నాకు మూర్ఛ కళ్ళ య్యపైఁ గానరాకుండెను. వెంటనే నాశరీర మున రక్తము ప్రజ్వలించెను. నేత్రముల నంధకారమావరించెను. తప్తబాష్పములు జలజలమని రాలెను. అనంతరము స్మృతినిఁబోలి తల్లీ! తల్లీ! యని యేడ్చుచు మార్గమునఁ బడుచు లేచుచుఁ బరువులిడితిని. సమీపవనాంతరమునఁ బక్షుల కలకలధ్వనిమాత్రము వినఁబడుచుం డెను. నదీతీరమునకేగి తల్లీ! తల్లీ! యని యఱచుచు నదీజలములఁ బడితిని. ఆయంధకారమునఁ గూలంకషముగఁ బ్రవహించుచున్న న దీధ్వనిలో "గతించె, గతించె" నని మాత్రము నా చెవులఁబడెను. భూ మిపైఁబడి మూర్ఛిల్లితిని.

కాత్యా—మీరు మనీషావంతులు. కేవల మధీరు లగుట భావ్యమా?

చాణ— అధీరుఁడనా? భోరుమని యేడ్చుచుంటినా? అవును. అవును. నాయశ్రుజలముచేఁ బృథ్వియంతయుఁ దరంగితమయ్యెను. ఆ యశ్రుజలము నిమిషమాత్రమున నింకెను. మఱియు నాలో నశ్రుజల మధికముగఁ బూర్ణించినట్లూహించెదను. ఇంతియేగాక నాబుద్ధి యవి చారమునకు నత్యాచారమునకు, నాస్తిక్యమునకుఁ బరిణమించు చున్నది.

కాత్యా—క్రమక్రమముగ సర్వము మార్పుఁజెందును. ఆక సంబున వ్యాపించిన మేఘ మెంతకాలముండును. ఏకాకివై వ్యర్థముగ విచారింపకుండ నూతనోద్యమమునకుఁ బ్రయత్నింపఁదగును. కర్మప్ర వాహమున నీఁదులాడవలెను. కర్మమయమగు సంసారము నిర్వర్తింప వలెను.

చాణ—అట్లాచరింపవలసి యున్నదా?

కాత్యా—సుఖదుఃఖములు మానవజీవనములందు స్వాభావి కములు. ఆలోకాంధకారములు కాలవికాసములు. మీరు దుఃఖమధి

కముగఁ బొందియుండవచ్చును. నేనాదుఃఖమెఱుంగఁజాలకుండ వచ్చును. నందమహారాజు నాజ్ఞాశృంఖలమునకు బద్ధుండనై, కారాగృహంబునఁ గొడుకులేఁడుపురతో నివసించి, తుదకు, రాజాజ్ఞచేఁ గుమారులెల్లఱుఁ జంపఁబడుచుండఁ జూచియుఁ జావలేక, దుఃఖమంతయు దిగమ్రింగి యిట్లు, జీవచ్ఛవంబుఁ బోలి జీవించు చుంటిని.

చాణ——నీవాతని మంత్రివిగదా?

కాత్యా——అవును. మహానుభావా! ప్రతిక్రియ నిర్వర్తింపఁదలంచియే తిరుగ వానికొలువంగీకరించితిని. అంగీకరింపకున్న నిరాహారముచేఁ జావవలెంగదా? చాణక్యమహాశయుని తోడ్పాటు నాకుఁ గావలసియున్నది.

చాణ——క్షత్రియాధముఁడు తన యత్యాచారమును బ్రాహ్మణునిపైఁ బ్రయోగించెనేమి? ఓసుందరీ! కుటిలా! నీవు మనోహరతీవ్రదృష్టి నాపై నిగిడించుచుంటివా? నీయాజ్ఞకు బద్ధుండను.

కాత్యా——బ్రాహ్మణుని లుప్తతేజము తిరుగ దేకెత్తుఁగాక. నేనిప్పుడు నందుని మంత్రిని. నీవు సహితము పురోహితుఁడవు గమ్ము. ఈబ్రాహ్మణులిరువురు నేకీభవించి క్షత్రియాధముని శిక్షింపక తప్పదు. భరతఖండ మెంతకాల మీలోకంబున వెలయుచుండునో, యంతకాలము బ్రాహ్మణప్రతాపము విజయధ్వజముఁ బోలి చెలంగుఁగాక. సోదరా! రమ్ము. నన్నాదరింపుము.

చాణ——(ఇంచుక యాలోచించి) మంచిది; నేనిరాజపౌరోహిత్యమున కంగీకరించితిని. స్వీకరించితిని. నేను సర్వమెఱుంగుదు. విశ్వసింపఁదగని బౌద్ధయుగమును నశింపఁజేసెదంగాక! బ్రాహ్మణునకు సంభవించుదాగుణము, నధర్మమును, మొదలంటఁ బెల్లగించెదను. ఈయడవియందుండనేల? బ్రాహ్మణ్య మెచటనున్నదో పరిశోధించెద. బ్రాహ్మణ్యమును రక్షింపక తప్పదు. బ్రాహ్మణప్రళయమునకుఁ బూర్వ

మీ కలియుగంబును, బ్రాహ్మణ్యము, ద్వాదశ మార్తాండతేజోవంత మై దహింపఁజేయుఁగాక. నేను వచ్చెదను.

చ. హరిహృదయంబుఁ దన్ని నిట ♦ లాక్షునునోతిశయాంబణాంచి భీ
కరముగ క్షాత్రవంశకుజ ♦ కాండకఠోరకుఠారమైధరా
మరులకుగౌరవంబొసఁగి ♦ మాన్యులకుఙ్ భువిఁగల్పభూజమై
పరమపవిత్రమై యొసఁగు ♦ బ్రాహ్మణతేజము సంస్మరించెదఙ్.

కాత్యాయనా! నాకుమార్గదర్శకుఁడవు గమ్ము, రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

తృతీయదృశ్యము. మహానందుని ప్రమదోద్యానము.

కాలము:—రాత్రి

(ప్రవే)—మహారాజనందుఁడు, పరిషద్గణము, సానులు.

సానులు—(నృత్యగీతముల నభినయింతురు.)

ప్రథము—ఇఁక యీ యాటపాట చాలించండే; జావళీలు పాడండి.

ద్వితీ—అవునురా! జావళీలు సరస్వతికి బావళీలురా.

తృతీ—"జాణా తనపు మాటాలింకా" జావళీపాడండి.

సానులు—జాణా తనపు మాటాలింక చాలు నిల్పారా సామి చాలు నిల్పారా" అని పాడుచు నాడుచు నభినయింతురు.)

ద్వితీ—ఛీ! ఛీ! ఇదేమి పాటే! గమ్మత్తులేమీ లేవు.

ప్రథము—సానమ్మ! నువ్వు చక్కనిదానివేమో, చంద్రుని వెక్కిరించూ

తృతీ—నెత్తికి మత్తు బాగా ఎక్కిందిరా!

ద్వితీ—నాముఖంచూచి వెక్కిరించమను. చంద్రుని వెక్కిరించినట్లే.

నందు—(అట్టహాసముఁ జేయును.)

తృతీ—(ద్వితీయునిఁజూచి) ఒరే! నీబట్టకు పసుపెక్కడిదిరా!

ద్వితీ—ఊరుకో సంధ్యావందనములో నేమన్నాడో యెఱుగుదువా! ఏరాత్రి చేసిన పాపం, ఆరాత్రే విడిచిపెట్ట మన్నాడు. ఇప్పుడా వూసెందుకు ఊరుకోరా!

నందు—(నవ్వుచుండును.)

ప్రథము—సానిగారూ! అభినయింపట్టగలవేమో, నాముక్కుమీఁద అభినయింపట్టూ. (అని అట్టహాసముఁ జేయును.)

ద్వితీ—సానీ! నీకు మగఁడున్నాఁడూ?

సాని—లేకేమండి—(సాని యొక బంగారు నాణెముం జూపును.)

తృతీ——పద్యాలు చదవండే.—

ద్వితీ—పద్యాలు నాకు బోధపడవు—

తృతీ—అయితే హిందూస్థానీగుమికీలు పాడండే; పాడండి.

ద్వితీ—గుమికీలేమిటిరా? టుమిరీలు టుమిరీలు.

సానులు—ఓలమ్మో! గుమికీలూ?

ప్రథ—టుమిరీలు పూరీలు ఉంచండిరా—ఔనే! ఈమధ్య మీపంతులు దెబ్బలుతిన్నాఁడఁట,

సాని—అవునండి. సాదారణంగా నేను వారింటికే ఎల్తూంటాను. ఒకమారు వారే మాయింటి కొచ్చారండి—అపుడింట్లో సరసులకీ ఊరికి పెద్దజట్టీ పుట్టిన మాట నిజమండి.

ప్రథ—(తృతీయునితో) నువ్వుకూడా అందులో నున్నట్లుంది.

ద్వితీ—సందేహమే? సాంతిలేని కషాయమా?

నందు—మీకు "సరిగమపదనిసలు" వచ్చునా?

సానులు—చిత్తం మహాప్రభూ! అన్నీ కంఠతావచ్చును.

నందు—రాగా లెన్ని కంఠతావచ్చును.

సానులు—(ఒకరి ముఖ మొకరు చూచుచు నవ్వుచుందురు.)

ప్రిథ—మాకు కొన్ని రాగాలు చెప్తారూ? రాసుకొని కంఠ దా పెడ్తాము.

తృతీ—వెర్రి వెంగళప్పా! నోరు మూయి.

ప్రిథ—సాసీ! కాఫీలో హిందూస్థానిపూరీ మిళాయించి ఒక టుమిరీ వదులూ!

ద్వితీ—అహాహా! ధన్యాసి, ధన్యాసి—

తృతీ—ఖరహారప్రియ వసులే.

ప్రిథ—ఖరహారప్రియయంటే?

ద్వితీ—ఖరమనగా గాడ్దె; హారమనగా దానిని చంపుటయందు ప్రియయనగా ఇష్టముగలది అనగా, ఆరాగము పాడినట్లయితే, గాడిద సహితం, విని, సహించలేక చచ్చిపోతుంది. మనవారు పెట్టిన పేర్లలో తక్కువ అర్థంవుంటుంది?

ప్రిథ—అవును. అవును. గాడిద కూడా "సంగీతానికి నేను. చక్కదానికి మాఅప్పవుంటే" అందట—

ద్వితీ—తప్పు. తప్పు. "సంగీతానికి నేను. చక్కదనానికి సాని."

తృతీ—అందులో "అప్ప" అని చేర్చేవు కావూ బావా!

ద్వితీ—ఛీ! నోరుమూయి—

ప్రిథ—ఇది రాజసభ అనుకున్నారా! మీయిల్లనుకొన్నారా?

(అంత చాణక్యుఁడు ప్రవేశించును.)

చాణ—మహారాజా!

ప్రిథ—ఎవఁడితఁడు?

ద్వితీ—నీ నాకాసమునుండి దిగివచ్చిన చంద్రుఁడవేనా?

తృతీ—నాట్యమాడఁగలవా ?

నందు—నీవెవ డవు ?

చాణ—నేనా?—ఎవఁడనా ! ఊఁహూఁ—బ్రాహ్మణుఁడను.

ప్రథమ—ఇక్కడ నీకేమీ లభింపదు. వెళ్ళవయ్యా !

ద్వితీ—స్త్రీలు, గోవులు, బ్రాహ్మణులు, నుండఁదగిన స్థలము కాదిది.

తృతీ—నిష్క్రమింతి.

నందు—ఎందుకీ రాక.

చాణ— అజ్ఞానాంధకారమణంచి, జ్ఞానచంద్రికల వెదఁజల్లుటకు మహారాజా ! బహుభాష లేల ? నీమాతామహునిశ్రాద్ధమునకుఁ బౌరోహిత్యము నిర్వర్తింపవచ్చితిని.

నందు—నిన్నెవ్వఁడాహ్వానించెను?

చాణ—మంత్రి.

నందు—మంత్రి యాహ్వానించెనా ? ఆతనికడకేగుము.

చాణ—సరియే. అది యట్లుండ, నీమఱంది నన్నవమానించెను.

ప్రథ—అవును అతఁడవమానింప కేమి ?

ద్వితీ—మహారాజుగారి మఱంది యవమానించినఁ దప్పేమి ?

తృతీ—అతఁడేమి హత్యలఁజేయుట కధికారమున్నది. చావకుండ బ్రదికినందుకు సంతోషింపరాదా ?

చాణ—ఛీ ! తుచ్ఛులారా! నాలుకలఁ దుంచుకొనుఁడు.

నందు—నిన్నవమానించినయంతమాత్రమున నీకు వచ్చిన నష్టమేమి ? అతఁడు మహారాజుగారి మఱందియని యెఱుంగవా ?

(అంత వాచాలుఁడు ప్రవేశించును.)

వాచా—(చాణక్యునితో) నన్ను నీవు సామాన్యునిగ నెంచితివేమో ? మహారాజుగారి భార్య సహోదరుఁడను. మఱియు మహా

రాజుగారి తండ్రి, (శ్రీ) (శ్రీ) (శ్రీ) మాతండ్రిగారికి మఱందియగుదురు. అనఁగా, వియ్యంకులు. మహారాజుగారి కుమారులనగా నాసోదరీ కుమారులు. నాభాగినేయులనగా నాకు మేనల్లుండ్రగుదురు. నేను సామాన్యుఁడనా? భగినీభాగ్య విభవుఁడనని యెఱుఁగవా? నేనవమానించినఁ జాలునని, యెందఱో చూచుచుందురు వైదిక జనుఁడా?

నందు—(చాణక్యునిఁజూచి) నీ వీ స్థలమునుండి వెడలుము. మేమిప్పుడు విచారింపము. ఇది సమయముగాదు.

చాణ—అవును. నీవేల విచారించెదవు. ఈనాఁటి బ్రాహ్మణుఁడా నాఁటి బ్రాహ్మణుఁడుగాఁడు. అందుచే క్షత్రియుఁడనాయాసముగ, బ్రాహ్మణుల సంపదల నపహరించి, నిర్భయముగ ననుభవించుచున్నవాఁడు. ఆనాఁటి బ్రాహ్మణ్య మీనాఁటి బ్రాహ్మణుల కుండిన, సింహాసనమున నీవుండఁగలవా? అయిన నించుక బ్రాహ్మణతేజ మీయుగమున నున్నదని యెఱుఁగుము.

వాచా—బ్రాహ్మణుని ప్రతాప మే నెఱుంగుదును. మహారాజుగారి స్యాలకుని ప్రతాప మీ వెఱుఁగవలసియున్నది.

చాణ—అవును; ఎఱుంగవలసియున్నది. నేఁ జేయఁబోవు ప్రతిక్రియకు మీరు సహితము సిద్ధముగ నుండుఁడు, (అని నందుని తీవ్ర దృష్టిఁజూచును.)

నందు—ఎంతటి పొగరుఁబోతుఁడవు. రాజసభాంతరాళంబున నిర్భయంబుగ నాపైఁ గ్రూరదృష్టిసిగుడించుచుంటివి. దరిద్రభిక్షుకా! శీఘ్రముగ నావలకుఁ బొమ్ము.

చాణ—కలియుగ బ్రాహ్మణుఁడననియా తృణీకరించుచుంటివి! వీనులార వినుము. క్షత్రియుఁడు బ్రాహ్మణునిఁ జూచి శీఘ్రముగ నావలకుఁ బొమ్మనుచున్నవాఁడు. ఛీ! ఛీ! అగ్నివర్షము లేదేమి? పృథ్వి కంపింపలేదు. చుక్కలు రాలలేదు. దిక్కులు కూలలేదు.

సప్తపాథోనిధులింక లేవు. ప్రళయకాలఝంఝూనిలంబు విజృంభింప లేదు. సర్వము స్థిరముగ నున్నది. ఏమాశ్చర్యము ఏమాశ్చర్యము.

నందు.—నీవర్ధచంద్రప్రయోగముం గాని వెడలవు.

చాణ.—ఓభగవతీ! వసుంధరా! ద్విభాగములంగమ్ము. బ్రాహ్మణు? ... అశ్రులవై నిజనామము సార్థకముఁజేయుచుఁ జూచుచు యున్న కుంటివా? జగత్తికి విదూరపిన్నై భిక్షాటనముఁజేయుచు జీవించుచుండినను నీవు లజ్జింపకుంటివా? శక్తిసామర్థ్యములు గల నీవు నన్ను లోనికింగొనుము. కపిలుని తేజము స్ఫులింగవర్షమున, నీచదర్పమును భస్మీకరింపఁ జేయదా? అట్టి మహత్తర తేజము నాకొసంగ వేమి? ఒసంగకున్న, క్షుద్రమై ఘృణితమై దళితమై భయంకరకంకాళమై, యొసంగునీముఖమండలము నెన్నఁడుంజూడను. రసాతలంబునకైన నేగెదంగాక. నరకకూపంబునఁ గ్రుంగెదగాక. ఛీ! ఛీ! ఎంతటిధౌర్త్యము!!

నందు.—ఉన్మాదప్రలాపముల వినుటకు మాకిది తరుణముగాదు వాచాలా! ఈతని సావలకుఁ దొలంగింపుము,

వాచా.—దరిద్రక్షుద్రబ్రాహ్మణాధమా! ఆవలకు రమ్ము.

(అనిచాణక్యుని శిఖఁ బట్టుకొనును.)

చాణ.—అవును వచ్చెదను. పోవుటకుఁ బూర్వమింంక చెప్పవలసియున్నది. నందమహారాజా! నీవీకలియుగమున విశీర్ణధ్వంస సంశీయమగు బ్రాహ్మణ్యముఁ జూడవలసియున్నది. నీనందనవంశము ధ్వంసముం జేయకున్న, చణకమహామునికిఁ గుమారుండఁ గాఁజాలను. నిరక్తరంజితహస్తముఁగాని యీశిఖను బంధింపఁజాలనని ప్రతిజ్ఞఁ బలుకుచున్నవాఁడను. నాజీయు భవిష్యద్వ్యాఖ్యానముఁ జెప్పుచున్నవాఁడ వినుము. ఇఁకపై నెప్పుడైన నొకప్పుడీదరిద్రబ్రాహ్మణుని పాదముల పైఁబడి ప్రాణదానమునకై నన్ను వేడుదువు. నేనుమాత్రము నిన్నుఁ

గాపాడఁజాలను. ఈబ్రాహ్మణుని తపశ్శక్తియు, నీబ్రాహ్మణుని ప్రతిభావప్రభావము నీబ్రాహ్మణుని ప్రతిజ్ఞానిర్వాహణము, నీబ్రాహ్మణాభిశాపతేజము, నీబ్రాహ్మణ క్రుద్ధవిక్రమము, నీబ్రాహ్మణదుర్జయ ప్రతాపమును, నీవు నిశ్చయముగఁ జూడఁగలవు. అనుభవింపఁగలవు. పశ్చాత్తాప మొందఁగలవు. మేలుకొనియుండుము.

సీ. బ్రాహ్మణవిద్వేష పాపంబునంగాదె
వేయుచేతులవాని యాయువణఁగ
బ్రాహ్మణవర్యుని వంచించుటంగాదె
వేయికన్నులవాని పెంపణంగె
బ్రాహ్మణిఁజెఱపట్టి రమియించుటంగాదె
రాజైనచంద్రుండు రహిఁదొలంగె
బ్రహ్మర్షివరులని ర్బంధించుటంగాదె
నహుషుండు సర్పజన్మంబుఁదాల్చె
గీ. జపతపోధ్యానపరులౌట శాంతులౌటఁ
బ్రాహ్మణప్రవరులు పర బ్రహ్మహితులు
రోగికౌషధద్వేషంబు రూపుమాపు
బ్రాహ్మణద్వేషమట్టిదే పార్థివులకు

చ. కలుషితచిత్తులన్ ఖలుల క్షత్రియదుర్జనులన్ కుఠారధా
రల వధియించునాపరశురాముని నీవు స్మరించునట్లు నీ
కులమును సంహరించి నినుఁ గూల్చెద నీహృదయంబుఁజీల్చెదన్
కలియుగభార్గవుండని జగంబునుతింపఁగఁ గీర్తిఁ గాంచెదన్
గీ. నందకులఘోరవిలయంబ మందకోప
వహ్నిజనిత ధూమలతికా వలయమిాశ్శి
భూవలయము, నీహృదయ రక్తముననఁగాని
సంస్కరింప; నిద్రింపని స్సంశయముగ

(అని నిష్క్రమించును.)

నందు—ఉన్మాదరోగి. పోనిండు-బ్రతుకనిండు.

వాచా—గగనమునుండి వచ్చినవాఁడా యేమి? నీనియబ్బ మఱి యొకండు పౌరోహిత్యమునకు రాఁగలండు. నేను శాంతపురుష చక్రవర్తిని. ఇంచుక శాతించి శాంతించి కుత్తుకఁ బట్టి యావలకుఁ దొలఁగించితి. ఇయ్యది నాయపరాధమా? నాకపరాధమున్నదా?

నందు—దోషము నీయందున్నది. బ్రాహ్మణుఁడనియైన విచారింపవలదా? కుత్తుకఁబట్టి యేల తొలఁగించితివి?

వాచా—ఏలతొలంగించితినా? ఏనెవండను? మహారాజుగారి శ్యాలకుఁడను.

ప్రథ—మీఁదుమిక్కిలి మహారాజుగారాతని భగినీపతి.

ద్వితీ—సందేహమేమి? ఇతనితండ్రి మహారాజుగారి మామగారు.

తృతీ—అవును. అవును. మంచిపనియేయైనది.

నందు—సంతోషమునకు భంగమువచ్చినది.

ప్రథ—మహారాజా! భంగమునకేమున్నది? నూతనాంశము గన్పట్టినది.

ద్వితీ—అహాహా! చూడసొంపుగనున్నది.

ప్రథ—శ్రాద్ధములయందైన నిట్టివింతఁ జూడఁబోము. మఱియు నీస్త్రీల నృత్యగీతములయందైన నిట్టిసంతోషముండదు.

ద్వితీ—ఇదియొక విధమైన బ్రాహ్మణశ్రాద్ధము.

ప్రథ—తెలియునట్లు చెప్పుము.

ద్వితీ—శ్రాద్ధములు మూఁడువిధములు. తండ్రిశ్రాద్ధమొకటి దానికి శ్రాద్ధమనియే యందురు. స్త్రీలశ్రాద్ధము దానికేమనియెదరు? సరసము మొదలు, అనఁగా సరసశ్రాద్ధము. తరువాత మూప్యముల శ్రాద్ధము. అనఁగా వ్యాజ్యశ్రాద్ధము.

తృతీ—గతించినవారి శ్రాద్ధములకేమి? మిగిలినశ్రాద్ధములు సార్థకములు.

(అంత మురతోఁ గాత్యాయనుఁడు ప్రవేశించును.)

నందు—ఎవరావచ్చుచున్నది. (చూచి) ఓహో! వారిచటి కేలరావలెను?

కాత్యా—మహారాజుగారి యాజ్ఞననుసరించి శీఘ్రముగ—

నందు—ఈప్రమదోద్యానమునకా? సరియే—వచ్చినదేమి?—భద్రముగనున్నవాఁడు.

మురా—ఈనాఁటికి నీముఖమునుండి యీవార్త విని మిక్కిలి సంతసించితి.

నందు—మంచిది. ఏకార్యమునకు నిన్ను రప్పించితిమో యెఱుంగుదువా? దానికేమి? మంత్రీ! రాజకార్యవిచారమున కిది తరుణమా? అవి వేఱే!

కాత్యా—ఆజ్ఞాపించిన నిమోఁ గొనిపోయి తిరుగ దర్శించెదను.

ద్వితీ—మంత్రిమహాశయా! నీవావిధముగఁ జేయుదేని—

ప్రథము—ఆవిధమనఁగానేవిధము.

ద్వితీ—ఒకప్పుడొకఁడు జన్మమునకు శివరాత్రియని గ్రహచారము బాగుగనుండుటచే నందలమునఁ గూర్చుండెను. వాహకులు నలుగురు వానిని గమ్యస్థానముఁ జేర్చిరి. అందుఁగూర్చుండిన నరసుఁడు వారికీయవలసిన విత్తమొసంగఁ జాలకుండెను. వారెల్లరుఁ బోరాడి కుత్తుక బిగ్గలుచేసికొని సంధికివచ్చిరి. కూర్చుండినవాఁడు "వాహకులారా! నాయొద్ద ధనములేదు, మీరు కోపించిన లాభములేదు. కనుక నన్ను తిరుగ నాయింటికిఁ గొనిపొండు. ధనముండునపుడు మిమ్ముఁరప్పించి యిచ్చుటకివచ్చెద" ననెనఁట. ఆవిధముగనున్నది.

కాత్యా—మహారాజుగారి యాజ్ఞపై నీమెం గొనిపోయి తిరుగ నే దర్శింపవచ్చునా?

తృతీ—మంత్రిమహాశయా! నీజ్ఞానము లోకాతీతము. లోకులు తనే యట్లుచేసియున్న మీయజ్ఞానము వెల్లడి గాకుండెడునే.

నందు—వలదు. వలదు. ఈమె వచ్చునపుడే విచారింపవలెను.

వాచా—అవును. పనసలభించినప్పుడే తద్దినము పెట్టవలెను.

నందు—(మురంజూచి) తల్లీ! వినుము. నీకుమారుండు చంద్రగుప్తుండు జీవించియుండును.

మురా—అట్లనా? ఎచ్చట?

నందు—అయ్యది తెలియంగోరియే నిన్ను రప్పించితిని. ఆతని నివాసస్థల మెఱుంగుదువా?

మురా—వత్సా! నే నేమియు నెఱుంగను.

నందు—అసత్యము. నీవెఱుంగుదువు. తెలియంజేయుము. లేని యెడల—నందుని బాగుగ నెఱుంగుదువుగదా?

మురా—ఎఱుంగ కేమి? బాగుగ నెఱుంగుదును. నందుని నేను లాలించి పెంచి పెద్దంజేసినదానను. నా స్తన్యమొసంగి యాతని నీచేతు లారం బెంచితిని.

నందు—ఆగౌరవము నీవనుభవింపంజాలుదువు. చంద్రగుప్తుం డెచ్చట?

మురా—సుంతయు నెఱుంగను.

నందు—సత్యముం జెప్పుము. నీవెఱుంగుదువు. లేనియెడల—

మురా—నన్ను వధించెదవా యేమి! నన్ను వధింపవచ్చును. ఇపుడు మాత్రమట్టి ఘోరమునకుం బూనుకొనవలదు. కావలసినం జంద్రగుప్తునిం జూపి, యనంతరము నన్ను వధింపుము. ముఖము మాత్రము జూపినం జాలును. కుమారా! వినుచుంటివా?

నందు—నీవు శీఘ్రముగఁ జచ్చిన, నీకొఱకాజన్మాంతము దుఃఖించువారలెవరు. శాశ్వతముగ నిన్నుఁ గారాగృహమున బంధించెదను. క్షుధాగ్నిచే నిన్ను శుష్కింపఁ జేసెదను.

ముర.—ఇంతటి నిష్ఠురము నీకు శ్రేయస్కరముగాదు. నేను నీకు తల్లినగుదుఁగదా? ఇంచుకయాలోచింపుము.

నందు—అవును. శూద్రాణి వాకుఁ దల్లియగుదు. నేనో రాచబిడ్డఁడను. ఏమాశ్చర్యము. తండ్రిగారి యుంపుడుకత్తెవు. నీకింతటి పొగరుఁబోతుఁదనమా? నీవు నాకుఁ దల్లివేమి?

ముర—ఓహో!..........(శిరము వంచుకొనును.)

ద్వితీ—నాకొక తలంపూరినది.

నందు—మిన్నకుండుము. శూద్రాణి, నందమహారాజుగారి జనని యని యెఱుఁగవా?

ముర—నేను నందమహారాజునకుఁ దల్లియగుటకుఁ గోరలేదు. నీవు చిరకాలము మహారాజశిఖామణివై యుండుము. నా చంద్రగుప్తుఁడు దరిద్రుఁడై జీవించుఁగాక. ఆతఁడెచ్చటనైనను జీవించియుండినం జాలును. ఆతనిఁ జూపుమని నిన్నుఁ బ్రార్థించుచున్నదానను. వానిఁ గౌఁగిలించుకొని యానందబాష్పములతో దుఃఖాపఁదలంచితిని. వాని నా కనులయెదుట నిలువఁబెట్టుటయే నాకధికగౌరవము. మహారాజుగారికిఁ దల్లిగనుండు పాపాత్మురాలఁగాను. చంద్రగుప్తునకే నేను తల్లినగుదు.

నందు—ఈపలుకులతో నేమి? చంద్రగుప్తునియుదంతముఁ దెల్పుము. నీవెఱుఁగుదువు.

ముర—ఒకప్పుడు నేనెఱింగిన నెఱుఁగుదుంగాక. నీకుఁ దెలుపు తలంపు నాకుండదని యెఱుఁగుము. నందమహారాజా! ఏగొడ్డురాలు తాఁ గన్నకుమారునిఁ దనప్రాణరక్షకొఱకు, బెబ్బులివాఁతఁబెట్టఁ జాలును. ఈమాత్రమూహింపవలదా?

నందు—ఏమేమీ? నీకుఁ దెలియఁజేయు తలంపు లేదా? నీకుమారుఁడు చంద్రగుప్తుఁడు—తెలిసినదా?—తండ్రిగారి యుంపుడుకత్తెకు ముద్దులకొడుకు—ఎఱుంగుదువా? ఆతఁడు నాశత్రుకోటిలోఁ జేరి, మగధదేశముఁ దానాక్రమింపఁదలంచి, విద్రోహియై, పరసైన్యముల నాయత్తముఁ జేయుచున్నట్లు నాకుఁ దెలియవచ్చినది.

ముర—హా! దైవమా! ఈతనిపలుకులు సత్యములగుంగాక. చంద్రగుప్తుఁడు తన తల్లికి సంభవించిన యవమానమునకుఁ బ్రతిక్రియఁ జేయుఁగాక.

నందు—ఎవఁడురాయచ్చట? ఈశూద్రాణినిఁ గారాగృహంబున బంధింపుము.

వాచా—సిద్ధముగనున్నాను. (మురఁజూచి) ఓసీ! లంజా! రావే! రా. (అని కేశముఁబట్టుకొని లాగును.)

(సభ్యులెల్లరు నట్టహాసముఁ జేయుదురు.)

నందు—(మందహాసముఁ జేయుచు) శూద్రాణికెంతటి గౌరవము, మహారాజుగారి తల్లి కెంతటి వైభవము.

ముర—ఇంతటి కావరమా? నందమహారాజా! నిన్నుఁ బెంచి పెద్దఁజేసిన తల్లికి నీవలన సంభవించిన యవమానమునకుఁ బ్రతిఫలముఁ గాలక్రమమున ననుభవించెదవు. నీవు సహించి మానందించుటయా? ఎంతటిఘోరము. నేను నీకెట్లు తల్లినగుదును. నిన్ను నేఁ బెంచియుండను. ఏరాక్షసి స్తన్యపానముననో నీవు పెద్దవైతివి. లేకున్న నీ వింతటి ఘోరమునకుఁ బాల్పడవు. క్షాత్రధర్మ మిట్టిదేయైన నేనెల్ల జన్మముల శూద్రాణినై జన్మించెదంగాక.

ప్రథ—భళి భళి! దివ్యనాటకము. ఎంతటియానందము.

ద్వితీ—ఆనందమా! దివ్యసౌందర్యము మూర్తీభవించినది. చిత్ర్యఁదరమా?

త్రుతీ—మహారాజా! ఈమె తల యెత్తి పలుకుచుండ నోర్వ వచ్చునా?

ముర—మహారాజా! నేను నీతల్లిఁగాకున్న నేమి? అబలనగుదుఁ గదా? దిక్కులేనిదాననని యెఱుఁగవా? నిస్సహాయనని తలంపవా? అనాథనని కరుణింపవా? స్త్రీపై నత్యాచారమా? ఇంతటిఘోరమా? ఇయ్యది క్షాత్రధర్మమా? నీయత్యాచారము నబలనగుటచే నేసహింపఁగలఁగాని, కేవలము దైవస్వరూపమగు ధర్మము సహించునా? ఇది నీకు శ్రేయస్కరమా?

వాచా—శూద్రాణి ధర్మోపన్యాసమును వినువారు లేరు. న డువుము. ఉంపుడుకత్తె కెంతటిపౌరుషము. నిజముగ నీవాడుదానవేయై న, పురుషునకుండఁదగిన యీపౌరుషమెందులకే లంజా! రా! రా! (అని కేశముఁబట్టి లాగును.)

నందు—ఇప్పుడైనఁ జంద్రగుప్తుని సమాచారముఁ జెప్పుము. లేనియెడల—(అంతహఠాత్తుగ ఖడ్గహస్తుఁడై చంద్రగుప్తుఁడు ప్రవేశించును.)

చంద్ర—చంద్రగుప్తుఁడు నీకు ప్రత్యక్షమయ్యెను. అధమాధమా! (అని పదాఘాతమున వాచాలుని నేలకుఁ బడఁద్రోసి) తల్లీ! నా కంఠమునఁ బ్రాణములుండగనే, నీకింతటి యవమానమా! నన్నుఁ గడుపారఁ గన్నతల్లికా యింతటిదౌర్భాగ్యము.

ముర—వత్సా—(చంద్రగుప్తునిఁ గౌఁగిలించుకొనును.)

చంద్ర—(వాచాలునిఁజూచి ఓరీ! పాషండా! ప్రతిఫలమనుభవించెదవు. ఏమఱియుండకుము. (అని చంద్రగుప్తుఁడు తన తల్లితో నిష్క్రమించును. సభ్యులెల్లఱుఁ జెదఱిచెదఱి పరువిడుదురు. వాచాలుఁడు నేలఁబడి లేవలేకుండును. నందుఁడు మ్రాన్పడినిల్చి చూచుచుండును............యవనికజారును.)

చతుర్థదృశ్యము స్థానము:— (మలయరాజ్యమునఁ జంద్రకేతుని సౌధము కాలము:—సాయంకాలము; ప్రవే॥ చంద్రగుప్తుఁడు చంద్రకేతువు)

చంద్రకే—ఈగృహము మీయది; నేను మీబాంధవుఁడను. మీరు నన్ను విశ్వసింపవలెను. మీకొఱకై పార్వతీయసైన్యము ప్రాణముల నర్పింప సిద్ధముగనున్నది.

చంద్రగు—నేనీయశిక్షితసైన్యమును యవనపద్ధతిని శిక్షించి, యుద్ధోపయోగమున కనుగమింపఁజేయుదును. అసమానసాహసముం గల యీపార్వతీయసేనాసమూహమునకుఁ దగిన రణవిజ్ఞానమొసంగిన యనంతరము మగధసామ్రాజ్యమును జయించి క్రమక్రమముగ నఖిలభరతఖండమును శాసింపఁదగియుందును.

చంద్రకే—నందుని యమాత్యశేఖరుఁడు ప్రతిభావంతుఁడనియు, నమానుషశక్తిసామర్థ్యములఁగలవాఁడనియువినియుందుముగదా?

చంద్రగు—అవును. అదియు నే నెఱుంగుదు. మనపక్ష మవలంబించిన మంత్రియగు కాత్యాయనుఁడు సహిత మసమానుఁడు మఱియు నేనతని, రాజనీతివిశారదుఁడుఁ బండితుఁడునగు చాణక్యుని రప్పింపఁబంపియుంటిని.

చంద్రకే—చాణక్యుఁడెవఁడు.

చంద్రగు—చాణక్యుఁ డేతన్మాత్రుఁడని తలంపకుము. అమోఘప్రతిభావంతుఁడు నద్వితీయుఁడుఁ బరిశుద్ధబ్రాహ్మణుఁడుఁ బ్రతిజ్ఞానిర్వాహకుఁడు, నని నే వినియుంటిని. నందునిపై నాతని కధికద్వేషము చాలకాలమునుండియుఁ బూర్ణించియున్నది. మనతోడ్పాటున నాతని ద్వేషము మితిమీఱఁగలదు. ఆతఁడెట్టి ప్రభావముఁగలవాఁడో యెఱుంగుదువా?

చంద్రకే—ఇంచుకంతయు నెఱుఁగను.

చంద్రగు—ఆతనికోపదృష్టికిఁ బ్రళయము సంభవించు ననుటకు సందేహము లేదు. ఆతఁడెల్లప్పుడు నేకాకియైయుండును. మిత్రుఁడనువాఁడు లేఁడు.

చంద్రకే—అట్టివాఁడు భయంకరుఁడగుఁగదా?

చద్రగు—అట్టివాఁడే మన కార్యమునకుఁ దగినవాఁడు. నీతోడ్పాటును గాఁచున్న కతని ప్రతిభామహాగ్నిహోత్రము ప్రజ్వరిల్లుచు. రణభారము నీపైనున్నది.

చద్రకే—మహారాజా! నీవు మగధ రాజ్యాధిపతివని యొకప్పుడు నిన్ను మన్నించుచుండును. ఒకప్పుడు సోదరుఁడవని యుప్పొంగుచుండును. ఒకప్పుడాప్తుఁడవని గర్వించుచుండును. నీ వెఱుంగవా ?

చంద్రగు—(కౌఁగిలించుకొని) ఇఁక నాకుఁ గావలసిన దేమి? నావిచారమంతయు నంతరించినది.

(తెరలో) చంద్రగుప్తా!

చంద్రగు—తల్లీ! వచ్చుచున్నాను చంద్రకేతూ! రమ్ము. తల్లి యాశీర్వాదము గ్రహింపవలసియున్నది.

(ఇరువురు నిష్క్రమింతురు.)

(వెంటనే ఛాయ ప్రవేశించి) చిత్రగుప్తుడవతరించిన దేవేంద్రుని వలె నానయనంబులకుఁ దోఁచుచున్న వాఁడు. ఈతనిదర్శనము పూర్ణచంద్రోదయము. ఈతనిగంభీరస్వరము రణవాద్యమనుటకు సందేహము లేదు. ఇతఁడు నాయగ్రజుఁ గౌఁగిలించినప్పుడు భానుబింబమును శరత్కాల చంద్రమండలము కౌఁగిలించి నట్లుగ భావించితిని. ఇతని శరీరచలనమున సంభవించిన వాయువు మలయమారుతముఁ బలె హాయిగ నుండెను. ఓవసంత! నేఁడు నిన్నుఁ గీర్తించెదను. కారణమేమియో గాని యనిర్వాచ్యమగు సంతోషము పొంగుచున్నది.

పాట—(ఇదిరగడ. పాటగమార్చి పాడినను పాడవచ్చును.)

ఓవసంతుఁడ నీదు రాకకు। నొప్పెఁబక్షుల కలకలంబులు।
క్రొవ్వులూఁదినమావిచిగురెల్లెడఁ। గూయుచున్నవి కోకిలంబులు
నీతనుద్యుతి సోకినంతనె। నెగడుచున్నవి పల్లవంబులు।
నూతనంబుగ విచ్చుమొగ్గల। నొంచుచున్నవిబంభరంబులు।
భూజనంబులు సంతసింపగఁ। బూచియున్నవి మల్లెపువ్వులు।
త్వాజసౌధనివాసమాధవ। మల్లెపువ్వులు నీకునవ్వులు।
ప్రేమగంధముఁ జల్లియెల్లెడ। వీచుచున్నవి మారుతంబులు।
నామనోహరు నన్నుఁ గూరిచి। నాకొసంగుము కామితంబులు।
ప్రేమసుంతయునే నెఱుంగను। ప్రేమమాధురినేనుగ్రోలను।
ఈమహానది పొంత సంతత। మేమెలంగుచునుందు వేలను।
కొందఱెంతయు సంతసింపగఁ। గొందఱెంతయుఁగుందుచుందురు
అందఱెందనియుంపశక్యమె। యంచు నెన్నెదనిందుచందురు।
నిష్క్రమానములెల్లఁగైకొని। నేనొసంగెదఁ జంద్రకాంతికి।
విప్రయోగినినైయు మెలంగల। భింపవచ్చును సౌఖ్యమింతికి॥
ఓవసంతుఁడ నీదురాకకు॥

(అనిపాడుచుఁ బాడుచు నిష్క్రమించును.)

(అనంతరము చంద్రగుప్తుఁడును మురయుఁ బ్రసంగించుకొనుచుఁ బ్రవేశించుదురు.)

చంద్ర—తల్లీ! నీకు సంభవించిన యత్యాచారమునకుఁ బ్రతిక్రియఁజేయ నిశ్చయించితిని. నాహృదయాగ్నిహోత్రము జ్వలించుచున్నది. నీకు సంభవించిన యవమానవహ్నికి వారాహుతి కాఁగలరు. ఒకప్పుడు స్నేహదౌర్బల్యమున నందునిక్షమింప నూహించితింగాని యిప్పుడాయూహ యంతరించినది. నాస్నేహశుభ్రబిందువు లగ్నిస్ఫులింగములవలెఁ బరిణమించినవి.

ముర—నందుఁడు శూద్రాణియని నన్నవమానించినప్పుడు నాహృదయము దుఃఖాగ్నిహోత్రమున కాహుతియైనది. ఆతనియాజ్ఞ ననుసరించి, దుశ్శీలుఁడా వాచాలుఁడు నా కేశములఁబట్టి లాఁగినప్పుడు,

(దుఃఖించును.)

చంద్రగు—జయమునకు సందియమున్నను, వారియాకారములు భూమిపైఁ గన్పట్టవు. ఇదినిశ్చయము. ప్రపీడితయగు సీతామహాదేవి బాష్పములకు లంకాద్వీపము భస్మమైనది. ద్రౌపదిద్వేషాగ్నిహోత్రమునకు కౌరవవంశము విధ్వంసమైనది. స్త్రీయెడ సంభవించిన యత్యాచారము వ్యర్థముగఁబోదు. నందవంశము సహితము మట్టిదే యగును.

ముర—ఆయాశతోడనే జీవించియున్నాను. (అని మురనిష్క్రమించును)

చంద్ర—నాజనని శూద్రాణియా? శూద్రసంపర్కమతనికి మాత్రము లేకున్నదా? క్షత్రియులకున్నట్లు శూద్రులకుఁ గరచరణాద్యవయవములు లేకున్నవా? హృదయము లేకున్నదా? మస్తిష్కము లేకున్నదా? ఆశ లేకున్నదా? ఇంతటి ధార్ష్ట్యమా? మంచిది. శూద్రశక్తిఁ బ్రకటించెదంగాక. సెకందరుచక్రవర్తి వచించినట్లు నాజీవితము సార్థకమగుంగాక.

(కాత్యాయనుఁడు ప్రవేశించును.)

చంద్రగు— ఎవఁడావచ్చుచున్నది?

కాత్యా— నేను. కాత్యాయనుఁడను.

చంద్ర—ఓహో! చాణక్యుని సమాచారమేమి?

కాత్యా—ఇప్పుడే రాఁగలఁడు.

చంద్రగు—ఎట్లుపరిణమించినది.

కాత్యా—సముద్రమనథమున గరళముద్భవిల్లునో, యమృత

ము సంభవించునో నిరీక్షింపవలెఁగదా? ఆతని ప్రకృతి మంచిదిగఁ గ స్పట్టును.

చంద్రగు—ఎందుచేత?

కాత్యా—నేనీయుదంతముఁ దెలియఁజేయునప్పటికాతని గంభీరముఖవైఖరి ప్రత్యూషముఁ బోలి దీప్తమై తత్క్షణమున గోధూళిఁ బోలి మ్లానమయ్యెను ఆతని శీర్ణదేహము ప్రదీపశిఖఁ బోలి కంపించి తిరుగ స్థయిర్యమువహించెను. ఓష్ఠప్రాంతమున వ్యంగ్యమందహాసము ద్భవించి, వికటముగఁ బరిణమించి మెఱపుఁబోలి యంతరించెను. ఆతని లలాటగంభీరరేఖయు, గృష్ణాపాంగనేత్రద్వయియు నాకనులకుభీతిఁ గొలిపెను.

చంద్రగు—అద్భుతము. (పాదచారణముఁ జేయుచు) ఎపుడు వచ్చును?

కాత్యా— వచ్చుసమయమైనది.

చంద్రగు—(తెరవైపుఁజూచి) వచ్చుచున్న యాతఁడెవఁడు?

కాత్యా.—(తెరవైపుఁజూచి) ఆ, ఆతఁడే చాణక్య పండితుఁడు.

చంద్రగు—ఈతఁడా?

(చాణక్యుఁడు ప్రవేశించును. చాణక్యుఁడు, చంద్రగుప్తుఁడు బరస్పరముఁ జూచుకొందురు. చంద్రగుప్తుఁడు చాణక్యునకు నమస్కరించును.)

చాణ—నీవాంద్రగుప్తుఁడవు?

చంద్రగు—అవును. మీపాదసేవకుఁడను. బ్రాహ్మణేతరుఁడ నాదుంగాని, బ్రాహ్మణద్వేషినని భావింపరాదు.

చాణ—అవును. మంచిది. నీవు కార్యమునకుఁ దగుదువా?

చంద్రి—మీాకృపాకటాక్షముండినఁజాలు.

చాణ— నేనెవండను. దరిద్రబ్రాహ్మణుండను. నీవొక్కండవే చాలుదువు.

చంద్రగు—దరిద్రబ్రాహ్మణులా? (అని మందహాసముఁ జేయును.)

చాణ—అవును. నేను బ్రాహ్మణుఁడను. బ్రాహ్మణశాపమున నబ్రాహ్మణ్య క్షాత్రవంశమునశింపఁగలగు. అవును—అవును—జన్నిదంబులు బ్రాహ్మణులకేల? భిక్షాటనమునకు. బ్రాహ్మణ్యము బ్రాహ్మణ్యపదాఘాతమునఁ గుృంగుచున్నది. ఎంతకాలము, కాలము సమీాపించుచున్నది, ఓరిమి యుండవలెఁగాక.

చంద్రగు—(స్తంభీభూతుఁడై యుండును.)

చాణ—సముద్రతరంగములు తీరము పర్యంతమువచ్చి బాధించి, హతాశ్వాసములై తిరుగ గంభీరసముద్రమున కేగుచున్నవి. ఎట్టి శక్తియు లేదు. లేదు. లేదు.

చంద్రగు—అదియేమి? చాణక్యుఁడు పండితశిఖామణియని వింటినే.

చాణ—అవును. విచక్షణుఁడు. విద్వాంసుఁడు, కౌటిల్యుఁడు మఱియు మూర్ఖుఁడు. మూఢుఁడు. నీవు బాగుగవిని యుండవు. చాణక్యునకు హృదయమనునది లేదు. నామేరుదండము భగ్నమైనది. ఈవక్షమున (చంద్రగుప్తునిచేతులఁ దనవక్షముపైనిడి) పరిశీలించితివా?

చంద్రగు—రక్తప్రవాహమాంద్యము తోఁచుచున్నది.

చాణ—ఎట్టిప్రవాహము

చంద్రగు—రక్తప్రవాహము.

చాణ—మూర్ఖా! ఏమియు నెఱుంగవు. నాదేహమున రక్తము లేదు. హిమానీప్రవాహమని యెఱుంగుము.

చంద్రగు—గురుదేవా! నేను సర్వమెఱుంగుదును. నన్నాజ్ఞాపింపుఁడు. ఆశీర్వదింపుఁడు. మఱియేమియు మీరు చేయనక్కఱలేదు. చంద్రగుప్తా! అగ్రగామివై యుండుమని మాత్ర మాజ్ఞాపింపుఁడు. సర్వము నేనే నిర్వర్తించెదను.

చాణ—నిర్వర్తింపఁజాలుదువా?

చంద్రగు—నిస్సందేహముగ సెకందరుచక్రవర్తి నాభావికాలము నాకెఱింగించెను. "దిగ్విజయలక్ష్మి నామండలాగ్రము నాశ్రయించుకొనియున్న" దని యీవాక్యము నాహృదయమునందు ప్రతిక్షణము జాగరితమై నావీనులఁ బ్రతిధ్వనించుచున్నది. నారాజకార్యయజ్ఞమునకు పౌరోహిత్యభారము మీరు భరించెదరుగాక. జయమగుగాక;

చాణ—(ఆకసముపై దృష్టినిగుడ్చి) ప్రాణేశ్వరీ! కుటిలా! ఏమనియెదవు. నీయాజ్ఞయేమి?

చంద్రగు—(ఆశ్చర్యమునఁ దనలో) వెఱ్ఱివాఁడాయేమి?

చాణ—(ఆకసముఁజూచుచు) ప్రేయసీ! నీయాజ్ఞయే కావలెను. (చంద్రగుప్తునిఁ జూచి) ఓయీ! ఈదరిద్రబ్రాహ్మణుని యాజ్ఞ నెల్లకాలముఁ బాలించెదనని నాపాదములఁబట్టి ప్రమాణముఁ జేయుము.

చంద్రగు—(చాణక్యునిపాదములఁబట్టి) తప్పకుండ మీయాజ్ఞఁ బాలించెదను. నాకు దీక్షయొసంగుఁడు. అభయ మొసగుఁడు.

చాణ—అవును నీవు నిర్వర్తింపఁ జాలుదువు. నీముఖము నీదృష్టి నీవైఖరిఁ జూడఁ దగినవాఁడవని తోఁచుచున్నది. నీకుదీక్ష యొసంగె

వ. నిన్ను మగధసింహాసనమునఁ గూర్చుండఁబెట్టఁగలను. భారతవర్షమున, నీపరాక్రమము విజృంభింపఁ జేసెదను చంద్రగుప్తా! ఇంధనంబులఁ గూర్పుము. నా బ్రహ్మతేజను ప్రజ్వలింపఁ జేసెదను. ఆయగ్ని దావాగ్నియై వ్యాపించి, సమగ్రభారత వర్షమున వెలుఁగుఁగాక. చంద్రగుప్తా!

చంద్రగు—గురు దేవా!

చాణ—ఆకాశముఁ జూడుము ఏమికనఁబడుచున్నది ?

చంద్రగు—(మెల్లగ) ఆకాశము.

చాణ—వర్ణమెట్టిది?

చంద్రగు—పాంశురక్తవర్ణము

చాణ—ఏమిగ్రహించితివి?

చంద్రగు—జగడము సంభవించునని,

చాణ—నిశ్చయము. యుద్ధముసిద్ధము. దానిసముఖమునఁ గన్పట్టుచున్నది యేమియోగ్రహించితివా?

చంద్రగు—గురుదేవా! గ్రహింపశక్తిచాలదు

చాణ—అంధుఁడా! కపిలుని యభిశాపము, పరశురాముని శౌర్యము, వామనుని విక్రమము, నిదివఱకీ లోకమెఱుంగును ఈబ్రాహ్మణుని బుద్ధియు, శూద్రునినిష్ఠయు. బ్రాహ్మణునిసాధనము, శూద్రునిప్రతిహింస బ్రాహ్మణతేజము, శూద్రశక్తియు నేకీభవించి స్వర్గమర్త్య పాతాళలోకముల వ్యాపించుఁగాక.

సీ. బహుపాండములయందు ఁ పరిఢవిల్లినయట్టి
మృత్పిండమేకమై ఁ యొసఁగునట్లు
బహుభూషణములందు ఁ భాసిల్లుచున్నట్టి
బంగారమేకమై ఁ పరగునట్లు
బహుధేనువులయందు ఁ ప్రభవించియున్నట్టి
క్షీరమేకంబయి ఁ చెలఁగునట్లు

బహుదేహములయందు ప్రజ్వలించుచున్న,
పరమాత్మయేకమై వరలునట్లు.

గీ. మనమహాద్యమంబేకమై యనలమట్లు
శాత్రవుల బూదెసేయు నిస్సంశయముగ;
విప్రుడును శూద్రుడేకీభవించిరేని
యీప్రభుత్వంబు నశియించుటేమివింత?

చంద్రగుప్తా! భీతిల్లవలదు. లెమ్ము. నాచక్షువులం బ్రత్యక్షమగుచున్న తేజస్సుం దిలకింపుము.

చంద్ర—గురుదేవా! తిలకింప శక్తి చాలదు.

చాణ— ప్రధూమిత, ప్రజ్వలిత, ప్రవాహిత, రక్తస్రోతస్వినీతరంగిత సమగ్రభాగత భూపరివర్తనంబను పాథోనిధినుండి, రత్నాలంకారయుం, బుష్పోజ్జ్వలయు, సంగీత మధురయు మందస్మితమధురాస్యయునగు సామ్రాజ్యలక్ష్మి యవతరింపంగలదు. ఆమహాసామ్రాజ్య లక్ష్మి, భవదీయ భుజాసంరంభ పరిరంభము నభిలషించును. మీయిరువురి వివాహమునకు, నీదరిద్రుడు దౌర్భాగ్య బ్రాహ్మణుడు పురోహితుండగును. చంద్రగుప్తా! నీవు నాశిష్యుండవు రమ్ము.

(ఎల్లరు నిష్క్రమింతురు.





# ప్రతిజ్ఞాచాణక్యము.

## ద్వితీయాంకము.

ప్రథమదృశ్యము— స్థానము:— హీరట్టులో నొక సౌధము
కాలము:— రాత్రి.

(సెల్యూకసు, హెలేనయుఁ బ్రవేశింతురు.)

సెల్యూ—శ్రీ సెకందరుచక్రవర్తి కీర్తిశేషుఁడయ్యెను.

హెలే—అట్లనా? నీ వెట్లెఱింగితివి?

సెల్యూ—సూర్యాస్తమానము లోకమునకుఁ దెలియకుండునా?

హెలే—పిమ్మట.

సెల్యూ—మతేమున్నది. ఆసియాఖండోత్తర భాగమునకు నన్నధిపతిఁ జేసెను.

హెలే—అతఁడాసియాఖండోత్తర భాగము జయించియు, దిగ్విజయము సంపూర్తిగాకుండఁగ నేతన దేశమునకు మగిడిపోఁగారణ మేమి? పాపము. నిజదేశమునందైన గతించియుండలేదు.

సెల్యూ—ఆతని యవశిష్ట కార్యభారము నే భరించి సంపూర్తిఁ జేసెదు.

హెలే—అదియేమి ?

సెల్యూ—భారతవర్ష జయము.

హెలే—దానివలన లాభమేముండును ?

సెల్యూ—యశస్సే.

హెలే—అయ్యది దుర్యశము. ఆశ్చర్యము. పురుషుని మరాశ యించుకంతయు ఫలింపదు. పురుషునకెంతటి జిఘాంస! మనుజుఁడు తాను వేటాడుఁగాని మనుజులఁజంపి భక్షించునా? తండ్రీ! ఇంతటి దుష్కార్యమేల? చేయఁదలంచిన కార్యము కేవలము భ్రాన్యము. పురుషజాతి కెంతటి రక్తదాహమున్నది? హృదయమధ్యమున నితరప్రవృత్తి లేకున్నదా? ఎంతటి ఘోరము? ఎంతటిదారుణము ?

సెల్యూ—ఎట్టి ప్రవృత్తియుండవలెను ?

హెలే—దుఃఖితుని దుఃఖము దూరముసేయుట. రోగిరోగంబు నివారించుట. క్షుధార్తున కన్న మిడుట. అజ్ఞాని విజ్ఞానిఁ జేయుట. ఇంతకంటె ప్రవృత్తి యేమున్నది. ఇట్టి ప్రవృత్తి పురుషులకుండవలదా? కేవలము స్వార్థపరత్వము, వేదనావృద్ధి, యత్యాచారము, మొదలగు దుర్విచారములు హృదయమున నంకురింపఁదగునా?

సెల్యూ—విజిగీష మనుజునకు మహత్తర ప్రవృత్తియని డిమస్తనీసు చెప్పియున్నాఁడు.

హెలే—(నవ్వుచు) ఆతఁడట్లుచెప్పనైనఁ జెప్పియుండడు. ఆగ్రంథము దెచ్చెదంగాక. (అని పోనుద్యమించును.)

సెల్యూ—వలదు. వలదు. ఆతని గ్రంథములఁ జదివితివా యేమి ?

హెలే—చదివితిని.

సెల్యూ—అధికముగఁ బఠించి బుద్ధికిఁ గష్టమొసంగరాదు.

హెలే.—కేవలము పఠించినంతమాత్రమున వచ్చు హానియేమి? బుద్ధివికసించుఁగదా? చదువకున్న బుద్ధి వికసించునా? చదివిన బుద్ధి క్షీణించునేని, చదువని గార్ధభమున కధికబుద్ధియుండవలెఁగదా?

సెల్యూ—నీవు నన్నవమానితునిఁ జేయుచుంటివి.

హెలే—తండ్రీ! అట్టి స్వప్నముఁ దలంపవలదు.

సెల్యూ—నీవు నన్ను గార్ధభతుల్యునిఁ జేసితివి.

హెలే—అట్లు తలంపవచ్చునా? నాయభిప్రాయమదిగాదు,

సెల్యూ—లేదు. లేదు.

హెలే—(చేతులుజోడించి) తండ్రీ! నాయందు దోషమున్న క్షమింపుము.

సెల్యూ—నేను క్షమింపఁజాలను. నాకుఁ గోపమువచ్చినది. నన్ను తఱచుగ నవమానించుచుంగువు.

హెలే—(చేతులఁ బట్టుకొని) తండ్రీ! క్షమింపుము. నాయభిప్రాయ మదికాదు.

సెల్యూ—(చేతులు విడిపించుకొని) ఆవలకుఁ బొమ్ము.

హెలే—(గద్గదస్వరముతో) తండ్రి క్షమింపకున్న నాకేమిదిక్కు? (పాదములపైఁ బడును.)

సెల్యూ—ఇది యేమి? లెమ్ము. లెమ్ము. నీయందు దోషమేమియు లేదు. దోషమంతయు నాయందేయున్నది. కోపవశమునఁ బొమ్మని యంటిని. నీపై నాకింతటి కోపముండరాదు. (అని హెలేనను లేవదీసి) క్షమింపుము.

హెలే—తండ్రీ! నేనా క్షమింపవలెను. (అని తండ్రిచేతులఁ బట్టుకొనును.)

సెల్యూ—(కౌఁగిలించుకొని) అమ్మా! తల్లిలేని బిడ్డవు. నా తల్లీ! విచారింపకుము. దోషము నాయందున్నది.

హెలే—తల్లిలేని బిడ్డనని యెవ్వరైనఁ దలంపఁగలరా? సర్వము నీవై యుండఁగా నాకా విచారముండునా?

సెల్యూ—నీకేమి కావలయును. వేగముగఁ జెప్పుము.

హెలే—నేనేమియుఁ గోరకుండగనే నీవు నాకొసంగుచుంటివి. నాకెట్టి కోరికయు లేదు.

సెల్యూ—అమూల్యవస్త్రముల, ననర్ఘ్యరత్నాలంకారముల—

హెలే—వస్త్రాలంకారములయందు నాకు లోపమున్నదా?

సెల్యూ—అట్లయినఁ గావలసినదేమియు లేదా?

హెలే—అవసరమున్నఁ గోరకుందునా?

సెల్యూ—సరియే. నేనిప్పుడు సేనానివేశమునకుఁ బోవలసియున్నది. నీవు పండుకొని యుండుము.

హెలే—నేఁడుసాయంకాలమున నించుక నిద్రించితిని. నిద్రకై తొందఱలేదు.

సెల్యూ—నీవు రాత్రి చాలకాలమువఱకుఁ జదువుచుందువు. అధికముగఁ జదువుటయందే కాలము వెచ్చింపవలదు. నీముఖము పూర్వమువలెఁగాక యించుక వాఁడియున్నది.

హెలే—(మందహాసముఁజేయుచు) అట్లే చేసెదఁదండ్రీ!

సెల్యూ—మంచిది—(సెల్యూకసు నిష్క్రమించును.)

హెలే—(పాదచారణముచేయుచు) ఒక గ్రంథము పఠించెదంగాక.

(అని యొక గ్రంథముఁబూని చదువుచుండును.)

......................... (గ్రంథము విడిచి) నేటికి యవనసూర్యుఁడస్తమించెను. చంద్రోదయమునకుఁ గాలము సమీపించినది. ఆమగ

ధ దేశరాజపుత్త్రీకు—ఆఁ మఱచితిని. నేను వేగముగ సంస్కృతము పఠింపవలెను. సంస్కృతము విజ్ఞాన మహాసముద్రమని వింటిని. (అని తెరవైపుఁజూచి) పదముల సడి వినవచ్చుచున్నది. వచ్చుచున్నవారెవరు? (నిదానించి) ఓహో! ఆంటిగోనస్!

(ఆంటిగోనస్ ప్రవేశించి) అవును హెలేనా.

హెలేన—తండ్రిగారిచట లేరు.

ఆంటి—అది యెఱింగియే వచ్చితిని.

హెలే—అట్లయిన నీవు రావలసిన కార్య—

ఆంటి—నా రాక నీకప్రియమా యేమి?

హెలే—నేనట్లు పలికియుండను.

ఆంటి—(తనలో) ఎంతటికపటము. (ప్రకాశముగ) నీమనంబునఁగల తలంపు నాకు నేఁటికైనఁ దెలియకున్నది. నీయప్రియ ప్రత్యుత్తరముననే నెంతయుఁ జింతించుచున్నాను. నా రాక నీకు ప్రియమో యప్రియమో వ్యక్తముగఁ జెప్పరాదా?

హెలే—చెప్పినలాభమేమున్నది.

ఆంటి—చెప్పిన లాభము లేకుండుఁగాక. అగౌరవింపవచ్చునా? ఇంతకు నీయభిప్రాయ మెఱింగిన మేలుగదా?

హెలే—అదియెట్లు?

ఆంటి—నాభావికాలము నీప్రత్యుత్తరము పైనున్నది. హెలేనా! వినుము! నేనిప్పుడు వ్యక్తముగ నీయభిప్రాయ మెఱుంగవచ్చితిని.

హెలేన—సంతోషింపవలసినదే.

ఆంటి—వినుము. నేనశ్రుజలములు విడుచుచు నిన్ను భిక్షవేడు వాఁడఁగాను. అట్లని క్రోధకంపిత స్వరమునఁ బలుకుటయు లేదు. సరళభావమున బరిశుద్ధభావముతో నిశ్చయ మెఱుంగవచ్చితిని. కపట క్రోధము తెలుఁగను. వ్యంగ్యము సహితము లేదు. పలుపలుకు లేల?

సమ్ముఖమున రాయబారమేల? ముంజేతికంకణమున కద్దమేల? నన్ను నీవు పెండ్లాడెదవా లేదా? చెప్పుము. నే నోర్వఁజాలను. నీ మనోని శ్చయము సరళభావమున వ్యక్తముగ నిష్కపటముగఁ జెప్పుము.

హెలే—నాతండ్రిఁ జంపయత్నించిన వాని నేనెట్లు వివాహ మాడఁగలను.

ఆంటి—ఇదియా నీప్రత్యుత్తరము. ఆ కారణముతో నీకుఁ బని లేదు. అంతకుఁబూర్వము వివాహముఁగూర్చి నేఁ బ్రసంగించినపుడేవే మంటివి. "జనకుని యిష్టమే, నాయిష్ట" మనఁగదా? అనంతరము నీతం డ్రితో నిందుగూర్చి నేఁ బ్రసంగించితిని. ఆతఁడు వ్యంగ్యభావమున, "తనజన్మమెట్టిదో, తానెవఁడోలోక మెఱుంగని వానికి సెల్యూకసు, కుమారికనిచ్చునా?" యని వచించెను. నీవెఱుంగవా?

హెలే—ఆతఁడు సర్వసేనాధిపతి. నీవో, సామాన్య.

ఆంటి—అదియట్లుండనిమ్ము, నాజన్మముఁగూర్చి సంశయించి వ్యంగ్యభావమున నన్నగౌరవించెను. అందుచే నేఁగుపితుఁడనై ఖడ్గము బ్రయోగించితి క్షమింపుము.

హెలె—ఒకవేళ క్షమించినను పెండ్లాడఁజాలను.

ఆంటి—ఎందుచేత ?

హెలే—రాజకన్యక సామాన్యుని సంబంధము నభిలషింపఁ దగునా?

ఆంటి—ఇంతటి మనోగర్వమా?

హెలే—గర్వముగాదు. నిన్ను నిరాకరించుచున్నాను.

ఆంటి—పెండ్లాడెదవా లేదా?

హెలే—బలాత్కరించెదవా యేమి?

ఆంటి—బలాత్కారముననైన నాయభీష్టముఁ దీర్చుకొందు.

హెలే—నీతరమా?

ఆంటి—ప్రత్యుత్తరమునకై నిరీక్షించుచున్నాను. పెండ్లాడెద వా లేదా?

(అని హస్తముఁబట్టుకొనును.)

హేలే.—(కోపముతో) ఛీ! కాపురుషాధమా! హస్తము విడువుము.

ఆంటి.—(ఇంచుకతొలంగి) నేను కాముకుఁడను. సరళభావమునఁ బ్రత్యుత్తరమిమ్ము. నన్నుఁ బెండ్లాడెదవా లేదా? (అని బ్రతిమాలును.)

హేలే—(తనలో) ఏమాశ్చర్యము.

గీ. కాలమృత్యువు వీక్షింపఁ జాలుఁగాని
తాను మనసారవలసిన తరుణిముఖము
కోపముననుండ వీక్షింప నోపఁడెందు
కామమా! ప్రేమమా! నను స్కారశతము.

ఇపుడు నేను లేనికోపము నటింపకతప్పదు. (ప్రకాశముగ) అధమాధమా! నిన్ను వివాహమాడుటకంటె నపుంసకుని వివాహమాడుట మేలు. శీఘ్రముగఁబొమ్ము.

ఆంటి—మంచిది నేఁబోవుచున్నాను. (పోవుచుఁదిరుగసమీపించి) యించుక చెప్పవలసి యున్నది హేలేనా!

హేలేన—నానామముఁ బేర్కొనుటకునీకధికారముచాలదు. "రాజకన్యా"! అని సంబోధింపుము సామాన్యసైనికుఁడు—సామ్రాజ్యాధిపతికుమారి దేహము స్పృశించునా? ఇంతటిదియాగడమా? నాచరణఘట్టనమాత్రమున నిన్ను సంహరించి యుందును. బ్రతికితివి. పొమ్ము పొమ్ము

ఆంటి—పత్యుత్తరము మఱియొకనాఁడిచ్చెద.(అనిపోవుచుండ సెల్యూకసు ప్రవేశించును.)

సెల్యూ—నేఁజూచుచున్న దంతయునిజమేగదా?

హెలే—(కంపితస్వరమున) ఈబర్బరకాపురుషాధముఁడు నీకుమాఱిన బలాత్కరించుచున్నాఁడు.

సెల్యూ—ఆంటిగోనస్! నిశ్చయమా?

ఆంటి—నిశ్చయము.

సెల్యూ—సెకందరునాజ్ఞచే దేశమునుండి వెడలింపఁ బడితివి. ఆతని యనంతరము నిన్ను నాసేనలోఁ జేర్చుకొంటిని. ఇదియా నీవు నాకొసఁగిన ప్రతిఫలము! మంచిది. (తెరవైపుఁజూచి) భటులారా!

(భటులిరువురు ప్రవేశించి) ఏమియాజ్ఞ.

సెల్యూ—(ఆంటిగోనసుఁజూపి) వీనిబంధింపుఁడు.

భటులు—(శ్రీ)వారియాజ్ఞ. (ఆంటిగోనసునుబంధింతురు)

సెల్యూ—వీనిని వధ్యభూమికిం గొనిపోయి వధించిరండు. ఈక్షణమే.

భటులు—(పోవుచుండ)

హెలేన—భటులారా! తాళుఁడు. తండ్రీ! ఇప్పటికీతని క్షమించివిడువుము.

సెల్యూ—క్షమింపఁదగదు. వీనికింతటి యౌద్ధత్యయా?

హెలే—పదవినుండి తొలఁగింపుము.

సెల్యూ—ఆశిక్షచాలదు.

హెలే—పోనిమ్ము. రాజ్యమునుండి వెడలింపుము. చంపింపవలదు.

సెల్యూ—వీనివధించినఁగాని నాకోపాగ్నిచల్లాఱదు.

హెలే—ఆంటిగోనసు వీరుఁడు. ఆతఁడు తనయపరాధము నంగీకరించెను. తప్పకక్షమింపవలెను. కేశమునుండితొలఁగించినంజాలు.

ఆంటి—నాయందపరాధమున్నదని యంగీకరించెదఁగాని క్షమింపుమని ప్రార్థింపఁజాలను. నాకుఁ దగినంత శిక్ష విధింపవచ్చును.

హెలే—తండ్రీ! వానికొఱకు నేను ప్రార్థించుచున్నాను.

సెల్యూ—హెలేనా! అట్లుకోరవలదు.

హెలే—(పాదములపైఁబడి) తండ్రీ! క్షమింపకతప్పదు.

సెల్యూ—మంచిది. క్షమించితిని. ఆంటిగోనస్! వెడలిపొమ్ము. నాసామ్రాజ్యమున నీవు వసించిన మృత్యువు సంప్రాప్తించును. (భటులఁగని) వానివిడువుఁడు. పోనిండు బ్రతుకనిండు.

ఆంటి—(లజ్జించుచు నిష్క్రమించును.)

హెలే—తండ్రీ! నీవు క్షమించెదవని విశ్వసించితిని.

సెల్యూ—తల్లీ! ఈవృద్ధుఁడు నిన్నునాదరించునా?

హెలే—(మందహాసమున) ఈవిషయమున ధెమిష్టిక్లెస్సే మనినాఁడు.

సెల్యూ—ఏమియు లేదు. నీకేమియుఁదెలియదు. సుఖముగ నిద్రింపుము.

(సెల్యూకసు నిష్క్రమించును.)

హెలే—నీయిష్టమే నాయిష్టము. నీయుపారప్రేమకు నే నేమియొసంగఁగలను. నిన్నుఁ జంపనుద్యమించినవాని నే నెట్లువరింపఁగలను.

(నిష్క్రమించును.)

ద్వితీయదృశ్యము. స్థానము:—రణక్షేత్రసమీపమునశిబిరము.

కాలము:—రాత్రి.

(ప్రవేశము:—మురయుఁ జాణక్యుఁడు.)

ముర—రేపుయుద్ధమా?

చాణ—అవును.

ముర—చంద్రగుప్తుఁడాక్రమింపఁజాలునా?

చాణ—నిశ్చయముగ నాక్రమింపఁగలఁడు, ఈయాంశ మింతకుఁ బూర్వము చెప్పియుంటినే? ఇపుడా సందేహ మెందుకు?

ముర—గురుదేవా! మనస్సమాధానముకొఱకు యుద్ధము వలనఁ గార్యము ఫలింపదని తోఁచుచున్నది.

చాణ—(ఆశ్చర్యమున) మురా! ఏమనుచుంటివి?

ముర—చంద్రగుప్తుఁడు, నందుఁడు నాకుమారులు. వారిరువురు నేకవృంతమునఁగల పుష్పములు. నాహృదయాకాశమునకు వారిరువురు సూర్యచంద్రులు. ప్రళయమున కోర్వఁజాలను. గురుదేవా! వలదు; కార్యము లేదు. చంద్రగుప్తుఁడు భిక్షార్థియై యుండుఁగాక.

చాణ—అబలా! నీయభిప్రాయమెఱింగితిని. విచారము వలదనియు సామమునఁ గార్యమొనర్చిన మేలని నీతలంపు. అట్లున్నఁ దుఁగా నేరదు.

గీ. రాజు శౌర్యంబుఁ గౌటిల్య ధీమే జయించుఁ
బ్రజ్వలించిన సన్నిపా తజ్వరంబు
ధ్వంసముం జేయఁగా పాలి వలయుగాక
యగునె వాసంతకుసుమాక రౌషధమున?

ఇంతకు ఫలోన్ముఖసమయమున కీవిచారమేల? అంతయు సిద్ధమైనది. ఇపుడు నీనిరుత్సాహవాక్యముల నాలింప వేళ లేదు. విళంబము వలదు. శీఘ్రముగ నీశిబిరమునకుఁ బొమ్ము.

ముర—నిరుత్సాహవాక్యములా? నన్నింత తిరస్కరింపఁదగునా? గురుదేవా? ఈహృదయమున నేనేమిభరించుచున్నదానో యెఱుంగరా! నేనెంత సహించితినో యెఱుంగరా?

చాణ—అంతయు నేనెఱుంగుదును. అబలవు. నీవేమెఱుంగుదువు. వైరిని కారాగృహంబున బంధించినంత కార్యమొనర్చి యనంతరము వానిరక్తము సహితముఁ గనులఁజూడ నిశ్చయించుకొనిన మనకిపుడీ నిరుత్సాహమేల? నీవేమెఱుంగుదువు. ఈహృదయమునఁ బ్రతిహింసాజ్వాల యెట్లు మండుచున్నదో నీవేమెఱుంగుదువు. యుద్ధమనివార్యము. శిబిరమునకుఁ బొమ్ము.

ముర—అయిన గురుదేవా!

చాణ—(కఠోరస్వరమున) పలుకవలదు శీఘ్రముగ వెడలుము.

ముర—(భయమునటించుచు నిష్క్రమించును)

చాణ—(ఏకాకియై పాదచారణముఁ జేయుచు) ఊర్ణనాభచర్మము, సూకరముఖము, శవదహనగంధము, గార్దభధ్వనియు, నేరండతైలము, నామస్తిష్కమునకో నేకీభవించి సలసలమరగుచున్నట్లున్నది. పరివర్తనంబున, నూతనసృష్టి దృగ్గోచరమగుననుట నిశ్చయము. ఓయదృశ్య మహాశక్తీ! కుటిలా! మధురపూతిగంధమయమగు నీకాక్షికాంశము నామూలమున నిర్వర్తింప నిశ్చయించితివా? (తెరవైపుఁజూచి) ఆపడుచున్న శిశిరబిందువులు, నానేత్రములకుస్ఫులింగములుగఁ గన్పట్టుచున్నవి. ఆకాశము, నాహృదయమువలె జ్వలించుచున్నది. నేనీజ్వాలాకలాపమునఁ బాదచారణముఁ జేయుచున్నాను. ఆజ్వలించుచున్న యగ్నిహోత్రమే, పరిశుద్ధవైదిక బ్రాహ్మణతేజము. (మందహాసముఁ జేయుచు) ఈకలియుగమున సహితమొకమారు బ్రాహ్మణప్రతాపముగన్పట్టునా? (ఆకాశముఁజూచుచు) ప్రేయసీ! ముఖమున కుటిలమందహాసము నలంకరించి, భయంకరశిరముఁద్రిప్పుచు నానస్తు చెప్పు

చుంటివా? ఔను. నిన్ను నేనెఱుంగుదు. సుందరీ ! నీ ప్రేమకు బద్ధుండనై తుదకు వెంగలినైన నగుదుంగాక. నిన్ను విడువఁజాలను (తెరవైపుఁజూచి) ఎవఁడావచ్చుచున్నవాఁడు? ఓహో ! కాత్యాయనుఁడా?

కాత్యా—(ప్రవేశించి) ఔను. నేనే.

చాణ—ఇంత రాత్రివేళ రాఁ గారణము?

కాత్యా—విశేషమున్నది. నందునివృద్ధమంత్రి వచ్చెను.

చాణ—(తొందరపాటుతో) వచ్చెనా? అట్లయిన?

కాత్యా—సంధిఁగూర్చి ప్రసంగించెదను.

చాణ—ఏవిధముగ?

కాత్యా—అనేకాంశములఁగూర్చి ప్రసంగించుచు "నన్నదమ్ములకిరువుర కీరణ మేమి? రాజ్యమిరువురకు విభాగించిన మేలు. నందుఁ డేమియుఁ దెలియనివాఁడు. తమ్ముని నేరము నన్న క్షమింపవలదా" యనెను.

చాణ—(నవ్వుచు) బాగుగనున్నది. మంచిది. చంద్రగుప్తుఁ డా స్థలమున నుండెనా?

కాత్యా—ఉండెను.

చాణ—నందునివృద్ధమంత్రి మిక్కిలి విచక్షణుఁడు. చంద్రగుప్తుఁ డేమైనఁబలికెనా !

కాత్యా—లేదు.

చాణ—నీవేమైనఁబలికితివా?

కాత్యా—నీతోఁ బ్రసంగించిన యనంతరము ప్రత్యుత్తర మిచ్చెదనని పల్కితని.

చాణ—ఆతఁడు నాకడ కేలరారాదు?

కాత్యా—ఆతఁడు మీకడకురా నంగీకరింపలేదు.

చాణ—(తనలో) అశుభము గన్పట్టుచున్నది. పరాజయ మ

నివార్యమని తోఁచుచున్నది——మంచిది——

కాత్యా——నీయభిప్రాయమేమి?

చాణ——ఏమియు లేదు——"మనసాచింతితం కర్మవచసాన ప్రకాశయేత్"

కాత్యా——నేను నీమిత్రుఁడఁగదా?

చాణ——"నమిత్రే ప్యతివిశ్వసేత్" అందుచే నిపుడు నీతో నేమియుఁ జెప్పరాదు. సంధిమాత్రము పొసంగదు.

చాణ——నీవిపుడు నీశిబిరమునకుఁ బోవచ్చును. నేను నాప్రేయసితో విమర్శింపవలసియున్నది.

కాత్యా——(ఆశ్చర్యముతో) ప్రేయసియా? నీకు భార్యయున్నదా?

చాణ——నీవెఱుంగవుగాక. (మందహాసమున) నాకొకసాని యున్నది.

కాత్యా——ఆఁ——నిశ్చయముగ——

చాణ——(అట్టహాసముఁ జేయును)

కాత్యా——(ఇంచుక కోపముం జూపును).

చాణ——నీవావృద్ధమంత్రి నెఱుంగుదువా?

కాత్యా——ఎఱుంగకేమి? బాగుగ నెఱుంగుదును. బాల్యమున మేమిరువుర మొక గురువువలన శాస్త్రముల నభ్యసించితిమి. మనోవిజ్ఞానమున నాతఁ డపార శేముషీవంతుఁడు. అతఁడు కేవల మహర్నిశము సాంఖ్యముఁ బఠించును.

చాణ——నీవు పాణిని పఠించియుందువు.

కాత్యా——పరిహసించెదవా? పాణినీయ వ్యాకరణమున నొక్కొక్కసూత్రమున కనేక గూఢవ్యాఖ్యానములున్నవి.

చాణ—నీవా వ్యాఖ్యానముల సారమంతయు నెక్కుమ్మడిఁ గోరియుందువు. నీపాణినితో నాకుఁబని లేదు.

కాత్యా—పాణిని నీవు నిరసించుచుంటివి.

చాణ—నందుఁడు నన్నుఁ గారాగృహంబున నేలబంధించెనో నే నెఱుంగుదు.

కాత్యా—ఎట్లు?

చాణ—నీపాణినీయజ్వాలయే యందుకుఁగారణము. నీవు పాణినీయమును భక్షించుచుందువని నూతఁడెఱింగెను. రాజ్యవివాదమునఁ బాణినియే నీకుఁగావలెను. యుద్ధమునందు సహాయము పాణినియే. అతివృష్టికైన, ననావృష్టికైనఁ బాణినియే. మహారాజునకు మహారాజ్ఞికిఁ గలిగిన కలహమునకుసైతము పాణినియే. నీపాణినీయమునకు నందుఁడస్థిరుఁడయ్యెను.

కాత్యా—అస్థిరుఁడయ్యెనా? ఎట్లు?

చాణ—నీపాణినిచే రాజునకు శూలవేదన సంభవించెను శిరముభ్రమించెను. ఉపాయాంతరము లేకుండుటఁబట్టి నన్నతఁడు బంధింపవలసివచ్చెను. తుదకు నిన్నంతకుఁ దెచ్చినదదియే.

కాత్యా—ఎంతకుఁదెచ్చినది?

చాణ—విచక్షణబుద్ధిగలవాఁడు వ్యాకరణముఁబఠించి లోకమున మెలంగఁజాలఁడు.

కాత్యా—నీవేమియు నెఱుంగవు. పాణినీయసూత్రములు—

చాణ—అవును. నీశిబిరమున కేగుము. చంద్రకేతుఁ డెచటనుండునో చూడుము.

కాత్యా—చంద్రగుప్తుని శిబిరమున నున్నవాఁడు.

చాణ—నీ పాణినీయసూత్రమున చంద్రకేతుని రక్షింపుము.

కాత్యా—పాణినీయమును నీవు నిరసింప—

చాణ—పొమ్ము. వానిఁబంపుము.

కాత్యా—అల్లొనర్చెదఁగాని పాణిని—

చాణ—నీపాణినికొక నమస్కారము. యుద్ధక్షేత్రమున రెండు జాముల రాత్రివేళ నీపాణినీయముతో నేమిపనియుండును. వానిని వేగముగ బంపుము; అత్యవసరము.

కాత్యా—సరియే. పాణినీయసూత్రము—

చాణ—పాణినియు, నీవు, నరకమునఁ కేగుదురుగాక. పొమ్ము.

కాత్యా—పాణినీయము శుద్ధవ్యాకరణమని లోకవిశ్వాసము. పాణినీయసూత్రములయందు సహితము వేదాంతసారమున్నది.

చాణ—మాకు దానితోఁబనిలేదు. వెడలుము. వానిఁబంపుము.

కాత్యా—మంచిది. పోవుచున్నాను. (పోవుచు) నీవుపాణిని నవమానించితివి. ధర్మముగాదు. (దుఃఖించుచు నిష్క్రమించును.)

చాణ—కేవలము ప్రవృత్తిఁబట్టియే కార్యము జరుగుచున్నది. ప్రేయసీ! ఏమందువు? నందునివృద్ధమంత్రి ప్రయోగించిన చమత్కారమమోఘము. పరాజయమా? పర్యవసానమెట్లుండును? నేనుసహితము గ్రహించితిని. నీవు సహితమెఱుంగుదువు. వృద్ధమంత్రిమహాశయా! చాణక్యునకు నీవు చాలవు. ఇంతమాత్రమునకా నన్నుఁ దర్కింపఁజేసితివి?

(చంద్రకేతువుప్రవేశించి) మహాశయా! నమస్కారము.

చాణ—జయమగుఁగాక. అవును. నిన్ను రప్పించితిని.

చంద్రకే—ఆజ్ఞకు సిద్ధముగనున్నాను.

చాణ—రేపు యుద్ధము. జయము నిశ్చయము. నీవు ప్రాణములుగణింపకుండఁబోరాడిన—

చంద్రికే—గురుదేవా! అట్లు పలుకనేల? నన్ను మీరు విశ్వసింపుఁడు.

చాణ—నీయందు విశ్వాసము లేకగాదు. చంద్రగుప్తుని విశ్వసింపఁజాలను.

చంద్రికే—ఎందుచేత?

చాణ—చంద్రగుప్తునరుఁగలయాశ నొక యనిర్వాచ్యప్రవృత్తి సమీపించి యణంచుచున్నది. లక్షింపగా నొకమేఘము హఠాత్తుగ నావరించినట్లున్నది. వర్షింపదు, రెండుమూడు బిందువులుమాత్రము పడును. ఇట్లు గాకున్న చంద్రగుప్తునిశౌర్య మనివార్యము.

చంద్రికే—మీయాజ్ఞకు సిద్ధముగనున్నవాఁడను.

చాణ—మంచిది. రేపు యుద్ధము. అంతపర్యంత మతనిపార్శ్వమున నెల్లప్పుడు వేచియుండుము. యుద్ధమునందుసైత మతని విడువరాదు.

చంద్రికే—గురుదేవా! మీయాజ్ఞకుబద్ధుండను.

చాణ—నేను, మురయు, నాపర్వతసమీపమునఁ గలసేతు పార్శ్వమున మీవిజయవార్తకై ప్రతీక్షించుచుందుము.

చంద్రికే—చిత్తము.

చాణ—ఇఁక నీవు పొమ్ము.

చంద్రికే—(పోనుద్యమించుచుండ)

చాణ—మఱియు—

చంద్రికే—ఏమియాజ్ఞ?

చాణ—చంద్రగుప్తుఁడు నిద్రించుచుండునా?

చంద్రికే—అవును. గురుదేవా.

చాణ—ఊఁ...... వానితోఁబనిలేదు. నిద్రింపనిమ్ము. ముర

ను—ఆమెతో సహితము పనిలేదు. రేపు, ప్రత్యూషమునకుఁ బూర్వమే మేల్కొని, చంద్రగుప్తుని మేల్కొలుపుము. మురమేల్కొనని పూర్వమే మీరు రణయాత్రకుఁ బోవలయు. వెడలుము

చంద్రకే—మహాప్రసాదము—(నిష్క్రమించును)

చాణ—ఉదారయువకుఁడు. కేవల మజ్ఞాని ఇతరులకు సర్వస్వమొసంగుచున్నాఁడు. మూర్ఖా! చంద్రగుప్తుఁడు నీకేమగును ?......

(నిష్క్రమించును)

తృతీయదృశ్యము, స్థానము: హీరట్టుదేశమున నొక సౌధము; కాలము:- ప్రభాతము బంధితుండగు సెల్యూకసుతో నాటింగోనసు ప్రవేశించును.

ఆంటి—సెల్యూకస్! నేడు నీవు బంధితుఁడవైతివి.

సెల్యూ—అవును. ఎఱుంగుదును.

ఆంటి—నాఁటిదంభసంరంభములు నేఁడేమైనవి సార్వభౌమా?

సెల్యూ—నేనెప్పుడు దంభముఁజూపియుండను. యుద్ధమున జయాపజయంబులు స్వభావసిద్ధములు. అనేకయుద్ధములలో జయమొందితిని. నేడు నీచేజయింపఁబడితిని. తిరుగ యుద్ధమొనర్చిన—

ఆంటి—ఇఁక యుద్ధముతోఁబనిలేదు. ఇదియే తుదిపోరు.

సెల్యూ—ఇదియే తుదిపోరాటమా ? నీవు నన్ను వధింపవని భావించెదను.

ఆంటి—ఎంతమాట. నిన్ను వధించెదనా ?

సెల్యూ—అట్లయిన నీవు నిశ్చయించిన దేమి? నీనేత్రముల యందు హింసాహేతుకములగు చూపులు వెడలుచున్నవి. ముఖము పాండువర్ణమున విరాజిల్లుచున్నది. దంతఘర్షణమున వికృతరూపము ధరిం

చితివి. నీహృదయమున రాక్షససంకల్పముదయించినట్లున్నది. నీభీష ణాకారమున సర్వము విశదమగుచున్నది.

ఆంటి—నిన్ను వధింపను. మనము సుసభ్యులమగుయవనుల ము. యుద్ధమున నన్యోన్యము ఖడ్గములఁబ్రయోగించుదుము. ఘాతు కవ్యాఘ్రములఁబోలి పోరాడుదుము. యుద్ధాంతమున శత్రువును గా ఢాంధకారగృహంబున జీవితపర్యంతము బంధింతుము. వధింపను గదా?

సెల్యూ—నన్నట్లుబంధించుటకుమారు వధించుటయే మేలు.

ఆంటి—అట్లుగాదు, నిన్ను బంధించుటయే యోగ్యము. సూ ర్యకాంతియుఁ జొచ్చుటకు వలనుపడనిగృహమున నిన్ను సురక్షితము గఁ గాపాడఁగలను. అయ్యది హత్యలోఁజేరదు. సెల్యూకస్! నేను శైశవమునుండియుఁ బితృహీనుండను. భిక్షాటనంబున జీవింపుమని యీశ్వరుఁడీసృష్టిలో నన్నువిడచెను. కఠోరదారిద్ర్యభారమున, నిజశౌ ర్యమున దక్షుత్వముఁగలిగి, సేనాధ్యక్షుఁడనైతిని. అయ్యది లజ్జా కరమా?

సెల్యూ—ఎప్పుడైన నేనట్లు పలికియుందునా?

ఆంటి—లేదు. లేదు. అయినను, సంసారమున నిట్టి యవిచా రముగలదు. "నీతండ్రియెవ్వఁ"డని యెవఁడో ప్రశ్నించినపుడు నేను తగిన ప్రత్యుత్తరంబీయ లేకుండుటచే, నాతఁడునన్ను జారుఁడని పలికి యేవగించి, నన్ను సమాజేతరుఁజేసెను. నాతండ్రినేను నెఱుంగకుండ వచ్చునుగాని నీవలెనే యాతఁడుసహితము మానవుఁడై మానవాకార ముఁదాల్చినవాఁడని యూహింపవలదా? జారజుండట. నాజన్మముఁ గూర్చి నాకు బాధ్యతలేదు నావాక్యములకు మాత్రము నేను బా ధ్యుఁడను. నేనెన్నఁడైన నీచకార్యములఁజేసియుందునా?

సెల్యూ—లేదు.

ఆంటి—అట్లయిన నిన్నిపుడు ప్రశంసింపవచ్చును. ఇపుడు నీకుమారిక, యీరాజపుత్త్రిక, యీయభిజాత్య, యీదురభిమానిని, నన్నేమనునో చూచెదఁగాక.

(అనంతరము బంధితయగు హెలేన రక్షకభటులతోఁ బ్రవేశించును.)

హెలే—హా! తండ్రీ! (అని సెల్యూకసు పైఁబడును.)

సెల్యూ—హా, హెలేనా! (దుఃఖించును.)

ఆంటి—సార్వభౌమా! సాదరసంభాషణము సంపూర్తియైనదా? మీయిరువుర కిదియే తుదిచూపు.

హెలే—తుదిచూపులనుచుంటివా?

ఆంటి—అవును. రాజాధిరాజకుమారీరత్నమా! ఆజన్మాంతము నీతండ్రి కారాగృహనివాసియై యుండును.

హెలే—విచారణకర్త యాజ్ఞాపించునట్లుగఁదా?

ఆంటి—నీవు చెప్పవలసిన దేమైన నున్నదా?

హెలే—చెప్పుట కేమున్నది! నీ వెఱింగినయంశము నీకు జ్ఞప్తికిఁ దెచ్చెదను.

ఉ. ఓడుటయుం జయించుటయు నొప్పగు; నోడలు బంధ్లవచ్చు; బం
ధ్లోడలవచ్చు, నీ వెఱుఁగవో? విజిగీషనహించి యాజిఁబో
రాడినవారెఱుంగరో జయాపజయంబుల; నింతకింతనో
నాడుదురే విపత్తుల; మనోతిశయంబునకంతముండునే

వీరుఁడగువాఁడు వీరునియెడలఁ జూపఁదగు వీరాచరణము నీ వెఱుఁగవా? బంధితునకుఁ జేయఁదగిన మర్యాద జయశీలుఁ డెఱుంగకుండునా? ఇపుడు నీయధికారముఁ గూర్చి చర్చించునవస్థలో లేని నేనేమి చెప్పఁగలను.

ఆంటి—ఇంతమాత్రమేనా? సెల్యూకస్! నీకుమారిక విశేష పితృభక్తిఁజూపుచున్నది.

సెల్యూ—ఆంటిగోనస్! రాజకీయాంశములఁ గూర్చి నీవు ప్రసంగింపవచ్చుఁగాక. తండ్రిబిడ్డలస్నేహము తో నీ కేమిసంబంధమున్నది?

ఆంటి—నీగర్వమిప్పటికైన నణంగకున్నదా?

హెలే—ఆంటిగోనస్! నీవు నన్నిప్పుడేలరప్పించితివో నేనెఱుంగుదు. వామనుఁడు చంద్రునినందుకొనఁబోవునట్లున్నది నీప్రయత్నము! నీవు మమ్ముజయించితివి. రాజ్యాధిపతివైతివి. నాహృదయసామ్రాజ్యమునకీవధిపతివి కాఁజాలవు.

మ. బలవంతుండు జయించి దేహులను నిర్బంధించి దేహంబులన్
బలిమిన్ దున్పగవచ్చు; వారిహృదయస్వాతంత్ర్యమున్ బల్మినై
గెలువంజాలునె? నీవు నాయెడల లోఁగీడించినన్ నామనో
బలమున్ నీవు జయింపఁజాలుదువె? సంభావింపుమీధర్మమున్

తండ్రీ! నిశ్చింతతోనుండుము. నీవు వీరుఁడవు. నీవు గాఢాంధకారమయమగు గృహమునకైన నివసింపఁగలవు. నాకీజన్మంబున నేఁటికినీతో నెడబాటు సంభవించినది. తండ్రీ! అనుజనిమ్ము. ఇదియేమి? దుఃఖించెదవా?

సెల్యూ—తల్లీ! దుఃఖింపను.

హెలే—తండ్రీ! ఈకారణమున మనయిరువురిదుఃఖము సమానమే. పురుషునివలె నీవు సహింపుము. స్త్రీవలె నేను సహించెదను. ఈయాంటిగోనస్ నాయందు—

ఆంటి—హెలేనా! నాయెడల నీకింతటిపట్టింపేల? నన్నుఁబెండ్లాడుము, నీజనకుని దాసుఁడనై మెలంగెద. హెలెనా! అనుగ్రహింపుము.

హెలే—(వ్యంగ్యహాసమున) మూఢా! ప్రలోభముఁజూపి నని తౌన్నాదయముఁ గైకొనఁ జూచితివా? మానినీమణీధర్మము ప్రభాత సూర్యునివలె భాస్వరమై, మృత్యువువలె కరాళమై, తల్లివలెఁబవిత్రమై వెలయునని యెఱుంగుము. ధూర్తి మృష్టినిడి నాహృదయముఁ గైకొనఁ దలంచుచుంటివి. ఇంతకంతయు లభింపదు. నేను నిన్నేవగించెదను.

ఆంటి—ఇఁక నాదోషమేమియు లేదు. భటులారా! వీరిరువురఁ బ్రత్యేక గృహముల బంధింపుఁడు.

హెలే—తండ్రీ! అనుజ్ఞనిమ్ము.

సెల్యూ—హెలేనా! (దుఃఖించును.)

హెలే—ఇదియేమి? నీనేత్రములనా బాష్పములు రాలుట? వీరుఁడవయ్యు దుఃఖింపఁదగునా? నేను సహింపఁగలనా? తండ్రీ! ఆహారములేని శిశువును, నవమానింపఁబడినవృద్ధుని, పరిత్యక్తరోగిని, వదాహతమృతకళేబరము జూడవచ్చుఁగాని నీనేత్రములఁగల జలబిందువులఁ జూడరాదు. నేనేమి చేయఁగలను? నాస్వతంత్రాభిప్రాయముఁ జెప్పితిఁగాని, నేనుచేసినదేమి? కానిమ్ము. నేను నిన్ను వివాహమాడుదును. నీకు నేవిక్రయింపఁబడినదాసిని. నాతండ్రిని విడువుము.

సెల్యూ—వలదు. వలదు. హెలేనా! నరకమునకైన నేగెదంగాక; కన్యావిక్రయమున స్వాతంత్ర్యము గోరను. నేను యవనుఁడను. ఈక్షణకాలమునకు దౌర్బల్యము సహించెదనా? భటులారా! కారాగృహంబునకు రండు. మీయిష్టమువచ్చిన స్థలమునకు నన్నుఁ గొనిపొండు. హేలేనా! హేలేనా! దయయుంచుము.

భటులు—(వారిరువురఁ బ్రత్యేకముగఁ గొంపోవుచుండ)

ఆంటి—(సింహాసనము నుండిదిగి) నిలువుఁడు నిలువుఁడు. సెల్యూకస్! నీవు విముక్తుఁడవైతివి. నే జారజుఁడనైనను, యవనుఁడనగుదు

గదా? నేను మిక్కిలి కఠినుఁడనైనను, మీదృశ్యముఁ జూచినంత దుఃఖముగలిగెఁడి. మహిమాయయీ! హెలేనా! నీకు నేయోగ్యుఁడను గాను. సెల్యూకస్. ఈసింహాసనము నాక్రమింపుము.

(అనినిష్క్రమించును.)

(ఎల్లరునాశ్చర్యమున నిశ్చేష్టులై చూచుచుందురు. క్రమక్రమముగ యవనికజారును.)

చతుర్థదృశ్యము. స్థానము.—యుద్ధాంగణము. కాలము.- సంధ్య.

(స్త్రీసన్నివేశసమీపమునఁ, జెలికత్తెలతో ఛాయప్రవేశించును.)

ఛాయ—ఈయుద్ధజయాపజయంబులకై నాహృదయము తల్లడిల్లుచున్నది. దూరమునుండి కేవలము రణకోలాహలము మాత్రము వినులఁబడుచున్నది. వీరిరణోత్సాహముఁ జూడ నాహృదయము బ్రద్దలగుచున్నది.

ప్రథ—రాజకుమారీ! వీరికీయుత్సాహమేల?

ఛాయ—నేను నిదానించునది నీవు ప్రశ్నించినదే. (నిట్టూర్పు పుచ్చును.) ఆమహారాజునకుఁ దగినదానఁగాను మఱివిచారింపనేల?

ప్రథ—ఏమహారాజునకు?

ఛాయ—చంద్రగుప్తమహారాజునకు.

ద్వితీ—చంద్రగుప్తునిఁ బ్రేమించుచుంటివా?

ఛాయ—ప్రేమించుచుంటినో లేదో యెఱుంగను. నాహృదయముమాత్రమతనిపై నుండును. నేను నిన్నరాత్రి యెట్టి స్వప్నమున నుంటినో మీరెవరైన నెఱుంగుదురా?

ద్వితీ—మేమెట్లెఱుంగఁగలము?

ఛాయ—అవును. వినుండు. నేనంట యాకసమున కెగసితినఁట. భూతలమున నొక్కచంద్రగుప్తుఁడు మాత్రమే కన్పట్టుచుండెనఁట. మఱియుఁ బయికేగుచుంటినఁట. క్రమక్రమముగాఁ బ్రజ్వరిల్లుచున్నదియై

కన్నట్టుచుండెనఁట. చంద్రగుప్తుఁడు కేవలము మార్తాండునిఁబోలి వె లుఁగుచుండెనఁట.

ద్వితీ—సీవీవిధమునఁ గ్రమక్రమముగ క్షీణించి మరణిం చెదవు.

ఛాయ—ఎందుచేత?

ద్వితీ—ఈరోగము చేత.

ఛాయ—ఈరోగమనఁగా నేరోగము ?

ద్వితీ—మదనరోగము.

ఛాయ—ఇదియు రోగమగునా ?

ద్వితీ—రోగమా! రోగమునుమించిన మహారోగమా!

ఛాయ—అతనిఁ దలఁచుకొనుచుఁ బ్రాణములఁ ద్యజించుట యే నాకుఁ గావలసినది.

(అంతచంద్రకేతువు ప్రవేశించును.)

ఛాయ—అన్నయ్యా! యుద్ధసమాచారమేమి?

చంద్రకే—నావాహనము వధిపఁబడినది. మఱియొండు గుఱ్ఱ మునకై వచ్చితిని. (అనిపోవుచుండ)

ఛాయ—విశేషమేమి?

చంద్రకే—మాకుపరాజయము.

ఛాయ—ఆఁ—పరాజయమా—చంద్రగుప్తుఁడెచట?

చంద్రకే—ఆపదలో నున్నవాఁడు. నేనాతనిఁ గాపాడవలెను.

ఛాయ—నేను సహితము వచ్చెదను. నాగుఱ్ఱము సిద్ధమగున ట్లాజ్ఞాపింపుము.

చంద్రకే—మంచిది. (నిష్క్రమించును.)

ఛాయ—మీరు శిబిరములఁ గాపాడుచుండుఁడు.

సఖులు—(ఇరువురు నిష్క్రమింతురు.)

ఛాయ — దైవమా! ఈసుయోగము ప్రాప్తించినందుకుఁ గార్యమీడేఱు నట్లనుగ్రహింపుము. అతని నేను రక్షించునట్లొనర్పుము. ఆతనిఁ గాపాడునిమిత్తము ప్రాణములనైన విసర్జించెదఁగాక. ఆతని నొకక్షణమైనఁ బ్రేమించిన నాజన్మము సార్థకంబగును.

చంద్రికే — ఛాయా! గుఱ్ఱములు సిద్ధముగ నున్నవి. (నిష్క్రమించును)

ఛాయ — నేను సిద్ధముగనే యున్నాను. ఓమహేశ్వరీ! నీవేశక్తిని దానవుల జయించితివో, యాశక్తినో నొకకణ మనుగ్రహింపుము,

(నిష్క్రమించును,)

పంచమదృశ్యము,

(స్థానము:— సేతుసమీపమున నరణ్యము:— కాలము:— సంధ్య)

(చాణక్యుఁడు ప్రవేశించి) క్షుత్పీడిత శునకముల రణరంగమునకు విడిచితిని. వైరులగ క్తధారల యథేచ్ఛముగాఁ గ్రోలుచున్నవి. అప్పుడప్పుడు వ్యాఘ్రభల్లూకములు మానుషరక్తముఁ ద్రావుటగలదు. ఇపుడు మనుష్యులామృగములఁబోలి హింసాంధత్వమున నన్యోన్యరక్తధారలఁ గ్రోలుచున్నారు. దాహముతీరునట్లులేదు. జగత్సృష్టి జీవహింసాహేతుకమైనది — ఈసూర్యుఁడస్తమించెను, తిరుగ రేపుదయించును (తన్నుద్దేశించుకొని) ఈసూర్యుఁడట్లుదయింపక క్రమక్రమముగ శీర్ణమై ధూళిధూసరమగును.

(తెరవైపుజూచి) వచ్చుచున్నవారెవరు?

(కాత్యాయనుఁడు ప్రవేశించి) నేను —

చాణ — మంచిది, కాత్యాయనా! విశేషమేమి?

కాత్యా — మనకు పరాజయము సంభవించినది.

చాణ — పరాజయమా?

కాత్యా—చంద్రగుప్తుఁడోడి పలాయితుఁడయ్యెను. సైన్యము చెదరి పోవుచున్నది.

చాణ—చంద్రగుప్తుఁడు పలాయితుఁడయ్యెనా? ఎచటికి?

కాత్యా—నేనెఱుంగను.

చాణ—చంద్రకేతుఁ డెచట?

కాత్యా—ఎఱుంగను. వానియశ్వము మాత్రము చచ్చి పడియున్నది.

చాణ—ఇంతపర్యంతము నీవుచేయుచున్న పనియేమి?

కాత్యా—పర్వతముపైనుండి రణముఁ జూచుచుంటిని.

చాణ—రణముఁజూచుచుంటివా?—హస్తగతము, నిశ్చితము, సగు జయము—అహాహా!

కాత్యా—చంద్రగుప్తుఁడు తిరుగవచ్చును.

చాణ—(ఆగ్రహమున) ఎందుకు? నీవిఁక వెడలుము. సైన్యమునకుత్సాహముఁగొల్పుము. చంద్రగుప్తుఁడు నూతనబలముతో వచ్చుచున్నాఁడని చెప్పుము. నామాటగా, జయము నిశ్చయమని, మనసైనికులకుఁ దెలియఁజేయుము. ఊఁ—శీఘ్రముగఁబొమ్ము.

కాత్యా—మంచిది. (నిష్క్రమించును.)

చాణ—"కంటకే నైవకంటక" మ్మను న్యాయము ప్రయోగింపఁదగును. ఇఁక చింతింపఁబనిలేదు. మురా! మురా!

ముర—(ప్రవేశించి) గురుదేవనియాజ్ఞ.

చాణ—బాగుగ నేడువఁగలవా?

ముర—అదియేమి?

చాణ—చంద్రగుప్తుఁడువచ్చును. నీవేడువవలయు.

ముర—(దుఃఖించుచు) హా కుమారా! (అని తెరవైపునకుఁబోవును.)

చాణ—ఇప్పుడు ప్రేమకుఁ గాలముగాదు. ఇపుడు నిష్ఠురమున కుఁదగిన సమయము. దుఃఖబాష్పములవసరము. అభినయమునకు సిద్ధముగనుండుము.

(అంత ముక్తాయుధుఁడై చంద్రగుప్తుఁడు ప్రవేశించును. )

చాణ—ఓహో ! చంద్రగుప్త మహారాజుగారా ? మురా! నీ కుమారునిఁ గౌఁగిలింపుము. వైరులజయించివచ్చినవాఁడు.

చంద్ర—గురు దేవా! అంతటి భాగ్యము నాకు లేదు

చాణ—అట్లనా ! ఏమి ?

చంద్ర— నేను రణక్షేత్రమునుండి పలాయనుఁడనై వచ్చిన వాఁడను.

చాణ—.అసంభవము. మురాపుత్రుఁడు రణక్షేత్రమునఁ బలాయనుఁడగునా ?

ముర—పలాయనుండవైవచ్చితివా? చావకుంటివా? భీరువా !

చాణ—క్షమింపుము. ఇదిక్షణకాలదౌర్బల్యము. చంద్రగుప్తా మనము పురుషులము. మనకిదితగదు. వేగముగ రణమునకుఁబొమ్ము.

చంద్ర—యుద్ధమునకుఁబోఁజాలను.

చాణ—పోఁజాలవా ! ఎందుచేత?

చంద్ర—ప్రక్కఁబుట్టినవాని వధింపఁజాలను.

ముర— కాపురుషాధముఁడు నీసోదరుఁడా !

చంద్ర—నాసోదరుఁడు కాపురుషుఁడెట్లగును ?

చాణ—నిన్ను దేశమునుండి వెడలించినవాఁడా నీసోదరుఁడు?

చంద్ర—అతఁడెవఁడైననేమి ? నాసోదరుఁడు.

ముర—ఎవఁడు నీతల్లినవమానించెనోయాతఁడేనా నీతమ్ముఁడు? మాటలాడవేమి ? నందవంశీయుఁడా ! శూద్రాణిపుత్రుఁడా ! నీవురాజ్యమునకనర్హుఁడవు.

చాణ—ఎవని రాజత్వము ధౌర్త్యమునఁ బరిపూర్ణమైయుండెనో!

చంద్ర—గురుదేవా! భ్రాతృవిరోధమునకు నన్నుఁ బురికొల్పఁదగునా?

ఉ. నెత్తురుకూటికైయకట నెచ్చెలులన్ నిజసోదరాది గో
త్రములన్వధించుటకు నొప్పకయున్నది వజ్రమయ్యు నా
చిత్తము; చేతులారఁ జలి చీమను సైతముచంపరాదు; నే
నిత్తఱి నా సహోదరుని నెట్లువధించెద బ్రాహ్మణోత్తమా!

చాణ—అవును. బాగుగ నేయున్నది. అర్జునునకు శ్రీకృష్ణుఁడుపదేశించినది నీవెప్పుడైన వినియుందువా?

చంద్ర—క్షమింపుము గురుదేవా! శ్రీకృష్ణునియుక్తి నాహృదయమునకు సరిపడదు.

చాణ—(కోపముతో ఈ పాపమార్యావర్తమునకుఁ జెందును.) గీతారహస్యము నీవేమెఱుంగుదువు? శాస్త్రచర్చ బ్రాహ్మణులకుఁ జెల్లుఁగాక.

చంద్ర—బ్రాహ్మణాధికారమును బ్రాహ్మణుఁడే యనుభవించుఁగాక. నేను సెలవుఁ గైకొనెదను.

చాణ—చంద్రగుప్తా! నీదౌర్బల్యము నిప్పుడప్పుడు నిదానించుచుంటిని. రణమునందే యిట్టిదౌర్బల్యము పూర్తిగఁ గనంబడును. నీకొక్క రహస్యముఁ జెప్పెద వినుము కేవలము నిరాశాపరుండవై దినమంతయు వెచ్చింపుము. ఉష్ణాశ్రుజలముల రాత్రుల నుపధానముల నభిషిక్తములఁ జేయుము. ఒకప్పుడు భోరున నేడ్చుటయు నొకవిలాసమే యగును గాని కర్మక్షేత్రమునందు నిల్చియున్నప్పుడుమాత్రము దౌర్బల్యముఁ జూపరాదు. అట్టిదౌర్బల్యముఁ జూపితివేని భూమి కంపించునట్లు శరీరము వడంకును. శతసంవత్సరములనుండి చేయుచున్న కార్య

ము వ్యర్థమగును. ముహూర్తకాలములో జీవితసాఫల్యము నిష్ఫలమగును. జీర్ణవస్త్రసమమగు దుర్మోహము హృదయమునుండి తొలంగిం పుము. యుద్ధమునకగ్రేసరుఁడవై నిలువుము.

చంద్రి—గురుదేవా! క్షమింపవలయును.

ముర—చంద్రగుప్తా! నీవు నాపుత్రుఁడవే? ఏనందుఁడు—

చంద్రి—ఆతని నీవేల క్షమింపరాదు.?

ముర—అవును. నేనెట్లు క్షమింపఁగలను. సర్వాంగములయందహర్నిశము శతవృశ్చికవిషజ్వాలఁబోలి, పరిభవాగ్ని జ్వలించుచున్నప్పుడు, శీతలముఁ జేయఁగలిగినది నందునిరక్తముగాక మఱియొండేమున్నది ?

చంద్రి— తల్లీ! శైశవమున నతనితో నేనెంతకాలమాటలాడితిని! అతనికి నేను నేర్పినయాటలెన్ని? ఇంతయేల? నీవు నందునిఁ బెంచి పెద్దఁజేసియుండవా? అతని నీవు ముద్దాడియుండవా? కుమారుఁడని యక్కునఁ జేర్చియుండవా! ఆతఁడు దుఃఖించునప్పుడు నీవోదార్చియుండవా? ఒకప్పుడాతఁడు గుఱ్ఱముపైనుండి బడినప్పుడేఁ గాపాడినందుకు నీవు నన్ను మెచ్చుకొనియుండవా? నేఁడాతని కోమలతరుణముఖముఁ గన్నార రణరంగమునఁ జూచితిని. హృదయము ద్రవీభూతమైనది. అతని లక్షించి ఖడ్గమెత్తి నేఁజంపఁబోవునప్పుడు నారక్తనాళములయందు పితృరక్తము ప్రవహించి హృదయమునుండి "వలదు వలదు. చంద్రగుప్తా!" యనుపలుకులు నాచెవులఁబడెను. నేనెట్లు చంపఁగలనమ్మా. అతఁడు నాతమ్ముఁడు. నే వధింపఁజాల.

ముర— నందుఁడు నీకుఁ దమ్ముఁడగుఁగాక. నాకేమగును ?

చంద్రి—నాకుఁదమ్ముఁడైనప్పుడు నీకుఁ గుమారుఁడగును. గర్భధారణము లేనంతమాత్రముచేఁ గుమారుఁడు కాఁగూడదా? నందునిగన్నతల్లి గతించిన యనంతరము నీవు మాతృస్వరూపిణివై పెంచి పెద్ద

జేయలేదా? స్తన్యపాన మొసంగలేదా? వక్షమున ధరించి ముద్దాడ లేదా?

ముర — అందుచేతనే క్షమింపఁజాలను. లేకున్న క్షమించి యుందును. ఈయంశము లాతఁడు మఱచినను నేను మఱువఁజాలను. చండాలుఁడగు వాచాలుఁడు నా కేశపాశములఁబట్టి లాగినప్పుడు — "శూద్రాణి రాజమాతా" యని నందులుల్లంఘించునప్పుడు — ఆహా! నీతల్లికిసంభవించిన యవమానము నీయది కాదా? నీ వాలోచింపవలదా? "తల్లి" యనుభావము నీకు సహింపము లేకుండవలెనా?

చాణ — ఏకమాతృగర్భంబున జన్మించినను సంబంధమునునది లేదు. తల్లికంటె నతఁడు నీకధికుఁడా? జగతిలో నెయ్యది ప్రథమగణ్యమో నిదానింపవలదా? పుత్రుఁడు తల్లియవమానమునకు బాధ్యుఁడు కాఁజాలఁడా? (మురఁజూచి) దౌర్భాగ్యురాలా! ఏడ్వుము. భోరుమని యేడ్వుము. దిక్కు లేదని యేడ్వుము. పుత్రుఁడనువాఁడు లేఁడని యేడ్వుము. ఈనీకుమారుఁడు — శూద్రాణిపుత్రుఁడు — తల్లియన నేమియో యెఱుంగఁడు. జగతిలోఁగల పవిత్రవస్తువులలోఁ దల్లిని మించునది లేదని యెఱుఁగఁడు.

చంద్ర — గురుదేవా! ఎఱుంగుదును.

చాణ — ఛీ! ఛీ! ఏమియు నెఱుంగవు. లేకున్న తల్లినిట్లు బాధించెదవా! ఏనీశరీరము తల్లిశరీరములో నొకటియై మెలంగదో! — ఏనీవొక ప్రాణమై, యొక హృదయమై, యొక నిశ్వాసమై, యొక యాత్మయై యుంటివో — పిమ్మట వేరైతివో — అగ్నిస్ఫులింగములవలె — సంగీతమూర్ఛనఁబోలి — చిరంతన ప్రహేళికా ప్రశ్నమువలె నున్న యీయమృత స్వరూపిణి, తనరక్తమును వక్షఃకటాహమునుండి దుగ్ధరూపమున నీకొసంగెనో — ఏచంద్రవదన నీయధరమున మందహాసామృతమును నింపెనో — నీనాలుకకు భాష

యెలవడఁ జేసెనో? ఏలలన, పరదేవతయై, ఏకాంతామణి వాణియై, నీ లలాటము నాశీర్వాదచుంబనముచేఁ బవిత్రముచేసి, నిరోగమును—శోకమును, దైన్యమును, నీవక్షమునుండి తొలంగింపఁ జేసెనో? ఏకృపా స్వరూపిణి నీమ్లానముఖము నుజ్జ్వలింపఁజేయఁ దనప్రాణములనైన నర్పింప సిద్ధముగనుండునో? ఏవెలఁది, స్నేహమందాకినియై శుష్క—తప్తసంసారమరుభూమిని శతధారలై ప్రవహించుచున్నదో, ఏపొలఁతి—మానవజీవితమునఁ బ్రభాతసూర్యునిఁ బోలి, యపార శుభ్రకరుణా కిరణములఁ బ్రసరింపఁజేయునో, ఏపడఁతి—ప్రత్యుపకారనిస్పృహాత్మ నిన్నుఁ బెంచి పెద్దఁజేసెనో—ఆమెయే యీమె. నీతల్లి—శూద్రాణి—

చంద్రి—గురుదేవా! రక్షింపుము. తమ్ముని వధింపఁజాలను.

ముర—చంద్రగుప్తా! నీకు నాకు సంబంధము లేదని నేఁటి కెఱిఁగితిని. నందుఁడు క్షత్రియుఁడు; నీవు క్షత్రియకుమారుఁడవు. నేను శూద్రాణిని. పాపఫలమున నిన్నుగర్భమున ధరించితిని. నేనెవర్తను. నీవెవ్వఁడవు. నీకుఁ దల్లి లేదు. నాకుఁ గుమారుఁడు లేఁడు.

చంద్రి—పుత్రునిపై నింతటి నిష్ఠురము తగునా! తల్లివగుట యట్లుండ, నీవు మాతృధర్మస్వరూపవు. నాయీశ్వరివి. నీయాజ్ఞ యనుల్లంఘనీయమని యెఱుంగుదు.

ముర—అదియే నిశ్చయమైన యుద్ధమున కగ్రేసరుఁడవుగమ్ము. ఏమి? అట్లుంటివి? చంద్రగుప్తా! మాటలాడవేమి? (గద్గదస్వరమున దుఃఖించుచు) అవమానితయు—బ్రపీడితయు—బదాహతయునగు నీతల్లిని—శూద్రాణిని—నిన్నాజ్ఞాపించుచున్నదానను. నీయిష్టము.

చంద్రి—హా! ఎట్టివిషమావస్థ ఘటిల్లినది?

ఉ॥ దేవసమానుఁడైనగురు దేవునియాజ్ఞఁ దృణీకరించి నా
జీవనధాత్రి తల్లియు వచించిన పల్కుల ధిక్కరింపనా?
భావమునందు బాంధవముఁ బాసి సహోదరు సంహరింపనా?
దైవమ! యేమిచేయుటకుఁ దైర్యము చాలదు మహాఘచిత్తుఁడన్ 18

(విచారించుచు)

ఉ॥ ఈవిధినేనుచింతిలగ నేటికిఁ బూర్వము తండ్రియానతిన్
దైవసముండు భార్గవుఁడు తల్లినిఁ దమ్ములఁ జంపె వెండియున్
జీవులఁ జేసె; నాకటులు చెల్లునె? యాతని కేను సాటియే?
దైవమ! యేమిచేయుటకుఁ దైర్యముచాలదు మూఢచిత్తుఁడన్ 19

వేయేల? (ఇంచుక యాలోచించు నట్లభినయించి) అవును నాకీతలంపుల తో నేమిపని?

చం॥ గురువులుఁ దల్లిదండ్రులునుఁ గోరియొసంగిన యట్టియానతిన్
శిరమునఁదాల్చి కార్యములఁ జేయుట ధర్మము; తత్ఫలంబులో
నరయగరాదు. నాజనని యానతి నీగురుదేవు నానతిన్
దుర మొనరించెదన్ రిపులఁ ద్రుంచెద నావిధ నేనొనర్చెదన్ 20

దైవమా! సాక్షీభూతుఁడవై యుండుము. తల్లీ! చెప్పఁదగినదంతయుఁ జెప్పితి. నీయాజ్ఞ నాకనుల్లంఘనీయము. ఈకుటిలజగత్తున నాకు మార్గముఁజూపు విద్యుద్దీపశిఖవు నాజీవితాంధకారమునకు నీవు నక్షత్రమవు. సంసారసముద్రమున నీయాజ్ఞయను నౌకపై జీవింపవలసియున్నది. తల్లీ! నీకు లేని బాంధవ్యము నాకెందుకు? ఆశీర్వదింపుము. ఇప్పుడే యుద్ధమునకేగెద.

గీ॥ మన్ముజభ్రమితోద్దండ మండలాగ్ర
దళితరిపుశిరఃకోటీర గళితమణుల
ఘృణులు, భవదీయ పాదపంకేజములకు
నేడు నీరాజనంబు కా నిశ్చయముగఁ

మురా—ఇప్పుడు నీవు నాకుమారుఁడవు.

చాణ—నిశ్చయముగ నీవు నాశిష్యుఁడవు. దౌర్బల్యము హృదయమునుండి తొలఁగింపుము.

(తెరలో) ఇచ్చటే—ఇచ్చటే.

చాణ—వింటివా! వచ్చుచున్నారు. లెమ్ము. సిద్ధముగనుండుము. మేఘనిర్ముక్తసూర్యునిఁబోలి ద్విగుణీకృతతేజశ్శాలివై విరాజిల్లుము. అదిగో! తూర్యధ్వని. నీసేనాసమూహము వచ్చుచున్నట్లున్నది. భయము లేదు. చంద్రగుప్తుఁడొకఁడే శతనందులకుఁదుల్యుఁడు. నా శిష్యుఁడొకనికిఁ జిక్కువాఁడుగాఁడు. చంద్రకేతువు నీకొఱకై నిరీక్షించుచుండును. వెడలుము. వెడలుము. జయమగుఁగాక.

(తెరలో తిరుగ) ఈయడవిలోనే.

చాణ—చంద్రగుప్తా! వింటివా? సిద్ధముగనుండుము. జయము నిశ్చయము. మురా! రమ్ము! (నిష్క్రమించును).

ముర—చంద్రగుప్తా! నాపాదధూళిఁగొనుము. (పాదధూళి నొసంగి నిష్క్రమించును.)

(మఱియొక ప్రక్కనుండి ఖడ్గహస్తుఁడై భటులతో నందుఁడు ప్రవేశించును.)

నందు—ఈ కాపురుషుఁడీ స్థలమున డాఁగియున్నవాఁడు, రండు ఆక్రమింపుఁడు. (ఆక్రమించును.)

చంద్ర—నీప్రాణములరక్షించుకొనుము. (అని ఖడ్గముఁబైకెత్తి (తనలో) దైవమా! శరీరము వణంకుచున్నది. (ఉద్రేకించి భటులపైఁబడును. సైనికులుకొందఱు నేలపైఁగూలుదురు. కొందఱు చెదరి పరువిడుదురు. చంద్రగుప్తుఁడు నందునిపైఁబడును. చంద్రగుప్తుని ఖడ్గాఘాతమునకు నందునిఖడ్గము చేనుండితుల్లిపడును. చంద్రగుప్తుఁడు—నందునితలఁద్రుంపనుద్యమించును. నందుఁడు వలదని నివారించుచు) రక్షింపుము. రక్షింపుము. చంద్రగుప్తా!

చంద్రగు—(తనకత్తి దూరముగవిసరి) హా! తమ్ముఁడా! (నందునిఁ గౌఁగిలించుకొనును) (అంత నందునిభటులిరువురు ప్రవేశించి చంద్రగుప్తునిఁ బట్టఁబోవుదురు. ఛాయయుఁ జంద్రకేతువుఁ బ్రవేశించి పోరాడి భటులఁజంపుదురు.)

చంద్రకే—ఛాయా! చూచుచుంటివేమి? నందునిశిరము నొక్కుమ్మడిఁ దునుముము—కరుణించుటకిది తరుణముగాదు.

ఛాయ—(ఖడ్గమెత్తును.)

నంద—చంద్రగుప్తా! చచ్చితి. చచ్చితి.

చంద్రగు—వధింపవలదు. బంధింపుఁడు. (అని చంద్రగుప్తుఁడు నిష్క్రమించును.)

(చంద్రకేతువు, ఛాయయు నందునిబంధించి, నిష్క్రమించుదురు.)

ద్వితీయాంకము సంపూర్ణము.





# ప్రతిజ్ఞాచాణక్యము.

## తృతీయాంకము.

ప్రథమదృశ్యము. స్థానము:—కారాగృహము. కాలము.—రాత్రి.

(నందుఁడు, వాచాలుఁడు కారాగృహంబునఁ

దిరుగులాడుచుందురు.)

నందు—ఈభాగమంధకారమయమైయున్నది.

వాచా—అవును.

నందు—వాచాలా! జ్ఞప్తియున్నదా! ఇందే కాత్యాయనుని బంధించితిమి.

వాచా—అవును మహారాజా!

నందు—ఎంతటిభయానకము.

వాచా—మఱియు నీగృహంబుననే యతనిపుత్త్రిలు వధింపఁ బడిరి.

నందు—అబ్బ. అబ్బ. పరితాపమధికమగుచున్నది.

వాచా—మహారాజా! మనకింతకంటె నధికభయమేముండును :

నందు—అదియెట్లు నిశ్చయింపఁగలము. అయినఁ జంద్రగుప్తుఁడు నన్ను వధింపఁడని యూహించెదను. వధింపఁదలఁచువాఁడు శీర్ణభ్రుకుటీకుటిలుండును, ప్రతిహింసాపరాయణుండునగు బ్రాహ్మణుండు. మృగశాబకముపైఁ జెలరేగుశార్దూలముఁబోలి యూనాఁడా బ్రాహ్మణుఁడు భయంకరుఁడైయుండెను.

వాచా—అట్లయిన భీతిల్లవలసినదే.

నందు—అందుకుసందేహమా ? నీకు భీతిలేకున్నదా?

వాచా—నాకేమియు భయముు లేదు. మహారాజుగారినిమాత్రము చిత్రవధఁజేయుదురు. ఇతరులపై వారికి ద్వేషమేల ? నాభగిని విధవయగునను విచారమించుక నన్ను బాధించుచున్నది.

నందు—అట్లనా? నన్నువధించి నిన్నుబ్రదుకనిచ్చెదరని యూహించుచుంటివా ?

వాచా—అవును సందేహమేమి?

నందు—అట్లెన్నఁడునూహింపవలదు.

వాచా—(భయముతో) ఆఁ—ఆఁ—ఏమనుచున్నారు?

నందు—జ్ఞప్తియున్నదా? మురకొప్పుబట్టుకొని యీడ్చితివి.

వాచా—అవును. మఱచితిని—చచ్చితిసిరాదైవమా!

నందు—నీవు చాణక్యపండితుని సహిత మవమానించి కేశముఁబట్టి లాగితివి. నన్ను బ్రతుకనిచ్చినను, నిన్ను బ్రదుకనీయరు.

వాచా—ఆఁ—ఆఁ—మహారాజా! ప్రాణములు పోవుచున్నవయ్యా! (అనివడంకుచుండును.)

నందు—నన్ను బ్రతిమాలినలాభమేమి?

వాచా—పూర్వాభ్యాసమువలన బ్రతిమాలుచుంటిని.

నందు—నీవు చావక తప్పదు.

వాచా—పెండ్లాడకుంటిఁగాని లేకున్న—భార్య—విధవయై యుండును.

నందు—నీవు చచ్చిన విధవ యెవర్తె? నీకు భార్య లేదుగదా?

వాచా—ఈ దుఃఖములో నదియొక దుఃఖము. భార్యయుండిన నాకొఱకేడ్చుటకైనఁ బనికిరాదా?

నందు—నీవు చచ్చిన నేడ్చువారు లేరు.

వాచా—నాకున్న విచారమదియే. ఆలోచింపవలసిన విషయమే.

నందు—విపత్కాలమున సైతము నీవలన నవ్వువచ్చుచున్నది. ఆమాటకేమి? అంతఃపురపరివారము వృద్ధమంత్రిగృహమున భద్రముగ నుండునా?

వాచా—ఆహా! నిస్సందేహముగ.

నందు—(వినుటనభినయించి) ఆశబ్దమేమి?

వాచా—(కంపించుచు) తలుపు తెఱచినట్లున్నది?

(అంతరక్షకభటులతోఁ గాత్యాయనుఁడు ప్రవేశించును)

కాత్యా—ఓహో! మహారాజమహాశయా!

నందు—ఛీ! విశ్వాసఘాతుకా!

కాత్యా—నేను విశ్వాసఘాతుకుఁడనా?

నందు—సందేహమేమి? బాల్యమునుండియు నాతండ్రియన్న ముదిని—

కాత్యా—నీతండ్రి చంద్రగుప్తునకు సహితము తండ్రియే. నీ తండ్రిగారికి నేనెట్టి ఘోరముఁ జేయలేదు. అతని పుత్త్రులలో నొకనిపక్షముఁ జేరితిని.

నందు—అవును. అతని దాసీపుత్త్రునిపక్షముఁ జేరితివి. సిగ్గు

లేదా? చాణక్యుఁడు, నీవు, బ్రాహ్మణులై యుండియు — ఆర్యద్విజులై యుండియు, — కుటిలమున — ఆచార్య పార్వతీయసేనాసహాయమున క్షత్రియుని పదచ్యుతినిఁ జేసి, దాసీపుత్త్రుని సింహాసనమునఁ గూర్చుండఁబెట్టితిరి. ఆహా! జారజుఁడు, శూద్రుఁడు, క్షుద్రుఁడు, దరిద్రుఁడు, మగధసింహాసనముపయిఁ గూర్చుండెను. మీజన్మములు పవిత్రములైనవి.

కాత్యా — నందా! విశ్వాసఘాతుకకృత్యమెవనియందున్నది.

మ. అకటా! బాలకులన్ నిరీహులను, భ ద్రాకారులన్ నాదు పు
త్త్రకులన్ నాదుకులప్రదీపకులఁ గా ర్రాబద్ధులన్ దిండిబె
ట్టకచంపింపవె నీవు నాయెదుటదు ర్మ్లాముష్యా! విశ్వాసఘా
తుకుఁడెవ్వాఁడో యెఱుంగఁజాలకననున్ దూషింతువే? ధర్మమే.

నాకుమారుల నేవిధముగాఁ జంపించితివో యెఱుంగవా? అంధకారబంధురకారాగృహంబున బంధించి, చాలక, నిరాహారులఁగాఁ జేసి శుష్కింపఁజేసి చంపింపవా? ప్రతికుమారుఁడన్నముకొఱకై దుఃఖించి, దుఃఖించి, శోషిల్లి చనిపోవునప్పుడు, నిన్నుశపించి, నన్నుఁజూచి ‘తండ్రీ! ప్రతిక్రియకుఁ బూనుకొనుము’ అని నన్ను బ్రతిమాలరా? వృద్ధత్వమున సంతానముఁ గోలుపోయినవారిదుఃఖము నీవేమెఱుంగుదువు? ఈసంసారమున; నీజగత్తులో పుత్త్రునితోఁదక్క నితరునితో నేమిపని యుండును? తండ్రి తనకీర్త్యపకీర్తులను, సంపద్దారిద్ర్యములను, పుత్త్రులపైఁబెట్టిగతించును. నాపుత్త్రులఁజంపించినవానికిఁ బ్రతిక్రియనేఁజేయవలదా? నాభవిష్యత్కాలము శూన్యముఁ జేసితివి.

నందు — కాత్యాయనా! నాయందుదోషమున్నది. సంఘదోషమునఁ బాషండుఁడనై యీఘోరకార్యమొనర్చితిని. ఇపుడు చింతించి పరితపించుచున్నాను.

కాత్యా — మహారాజా! ఆదిని నీకు నేనుపదేశింపలేదా?

వింటివా? రాజిట్లయినఁ బ్రజలేమిచేయఁగలరు?

నందు—క్షమింపుము. క్షమింపుము.

కాత్యా—నేనుక్షమించుటకు నేమున్నది, నేనిసంసారముఁద్య జించి సన్న్యాసినగుదు.

వాచా—ఉత్తమము. ఈసంసారము మంచిదికాదు. అందు చేతనే నేనవివాహితుఁడనై యున్నాను కాని—మమ్ము—లేక—న న్నుఁ గాపాడుము.

కాత్యా—నాకట్టి యధికారము లేదు. ఆయధికారము మం త్రిచాణక్యునిపైనున్నది.

నందు—ఆబ్రాహ్మణుఁడా మంత్రియయ్యెను?

కాత్యా—కేవలము మంత్రిమాత్రుఁడేగాడు. మహారాజున కు గురుదేవుఁడు.

నందు—శూద్రాణిజుఁడు మహారాజా? భిక్షుకదరిద్రబ్రా హ్మణుఁడు మంత్రియా? అట్లయిన సేనాధిపతి?

కాత్యా—మలయరాజు, చంద్రకేతువు.

నందు—బాగుగ నేయున్నది-నియందత్యాచార మొనర్చితిని. క్ష మింపుము. ఈచంద్రగుప్తుని—ఈబ్రాహ్మణుని—ఈమురను, సేవగిం చెదను. నేను విముక్తుఁడనైన—

కాత్యా—ఎట్లయిన నీకు విముక్తితప్పదు.

వాచా—మంత్రిమహాశయా! నాకేమిదిక్కు?

కాత్యా—వాచాలా! నమ్ము! చాణక్యపండితుని యాజ్ఞ యైనది.

వాచా—(వడంకుచు) నిశ్చయమే? అందుకావచ్చితివి?

కాత్యా—నిశ్చయము. నారాక యందుకే.

నందు—వాచాలునితోనతని కేమిపనియున్నది?

కాత్యా—నేనెఱుంగను—వాచాలా! రమ్ము.

వాచా—చిత్తము. మంత్రిమహాశయా! (నంమనిఁగని) మహారాజా!

నందు—నేనేమి చేయఁగలను? వెడలుము.

వాచా—హృదయము కంపించుచున్నది. వానిఁజూచినఁ బ్రాణములుండునా ?

కాత్యా—అదియంతయు నాకుఁదెలియదు. వేగముగరమ్ము.

వాచా—దైవమే దిక్కు (అని కాత్యాయనునితో నిష్క్రమించును.)

(యవనిక జారును.)

ద్వితీయదృశ్యము:—స్థానము చాణక్యుని కుటీరాభ్యంతరము.

కాలము:—రాత్రి—(చాణక్యుఁడు ప్రవేశించును.)

చాణ—ఈనాప్రతిహింసేచ్ఛయందు తీవ్రజ్వాలపుట్టుచున్నది. ఉత్తేజమువలనఁ గటూనాన్మాదము సంభవించుచున్నది. పతనము నిశ్చయము; స్వర్గమైన నరకమైన నాకువచ్చుఁగాక. స్వర్గచ్యుతుఁడనైన నరకమునకేగెదంగాక. ఈశ్వరా! నీవిపక్షమున నేను మెలఁగెద. నీపని నీవొర్చుము. నాపని నేనొనర్చెదను. నీయక్షయసౌందర్యమును నేను ద్వేషించుచున్నాను. పిశాచీ! నీపాపవర్మమున నన్నాచ్ఛాదింపుము. ఓయయదృశ్యమహాశక్తీ! నీకు నాయాత్మనువిక్రయించితిని. నిన్ను నే ప్రేమించితి. నన్నుక్రీతదాసునిగ నంగీకరింపుము. నేను నీమధురాధరవిషసుధాపానంబున నమరుఁడనయ్యెద. నీవిషాక్తాలింగనమున నరకమున సుఖించెద. నన్ను మాత్రము విడువకుము. ప్రేయసీ! నాకరము గ్రహింపుము. దూరప్రదేశమున కేగుదము. మంచిది—

(అంతవాచాలునితోఁ గాత్యాయనుఁడు ప్రవేశించును.)

చాణ—కాత్యాయనా ! ఎవఁడీతఁడు?

కాత్యా—ఇతఁడు నందునిస్యాలకుఁడు. వాచాలుఁడు.

చాణ—ఓహో! భగినీభాగ్యోదయుఁడా?

వాచా—(ఒదుగుచు వినమ్రుఁడై భక్తితో నమస్కరించును.)

చాణ—ఎంతటి బ్రాహ్మణభక్తి? ఒకప్పుడు నా కేశము బట్టి లాగితివి. జ్ఞప్తియున్నదా? భగిని భాగ్యవైభవాఢ్యా!

వాచా—ఎవరు? (వెనుకకుఁదిరిగిచూచును)

చాణ—ఇపుడు జ్ఞప్తియుండునా? మంచిది. నందునికుటుంబ మెచటనున్నది.

వాచా—నిజముఁజెప్పవలసివచ్చిన—నాకేమియుఁ దెలియదు.

చాణ—(సక్రోధమున నీ వెఱుంగుదువు.

వాచా—(గడగడవడంకుచు)ఎఱుంగుదునేమో? ఆఁ—ఆఁ—ఎ—ఱుం—గుదును.

చాణ—ఎచ్చట?

వాచా—(వెనుకకుఁదిరుగును.)

చాణ—అటుచూచుటేమి? నీభాగినేయులతో నీభగిని యెచటనున్నది.

వాచా—మ—ల—య పర్వతమునఁ ఆఁ—అచ్చటే. అనృతమాడను.

చాణ—(సక్రోధమున) అబద్ధము.

వాచా—(మెల్లగ) అ—బ—ద్ధమా?అబద్ధమాడనే ఏమో? ఆఁ—ఆఁ—అవును.

చాణ—నిశ్చయముఁజెప్పుము. నిన్ను బహూకరించెదను.

వాచా—అట్లయిన నిశ్చయముఁజెప్పెదను. పితాలయమున.

చాణ—మంచిది. కాత్యాయనా! సైన్యమచటికిఁబంపుము. వీ

నిని కారాగృహంబునకు వెడలింపుము. నందుని పరివారము లభించిన వీనిబహూకరించి విడిపింపుము. వీని పలుకనృతమైన, వీనికిఁగఠినశిక్ష విధించి వధింపుము.

వాచా—ప్రాణదండనమా? అబ్బ! మఱిబ్రతుకఁజాల; రక్షింపుము.

(అని గడగడవడంకి నేలఁగూలును.)

చాణ—నిశ్చయము.

వాచా—అట్లయిన—అబద్ధమాడను—వారచట లేరు?

చాణ—వాచాలా! బెబ్బులితో సరససల్లాపములాడుదువా?

వాచా—లేదు లేదు—అబ్బ—అబ్బ— పరితాపమధికముగనున్నది.—

చాణ—(కోపముతో)మూర్ఖా! చిత్రవధ చేయించెద—

వాచా—అబ్బ—అబ్బ—అంతమాటవద్దు—

చాణ—నిజముఁ జెప్పుము.

వాచా—(గద్గదస్వరమున)మం—త్రి—గృహమున.

చాణ—(ఇంచుక యాలోచించి) ఈసమాచారము నిశ్చయమై యుండవలెను—మంచిది—ఎవఁడు రాయుచ్చట?

(రక్షకభటులు ప్రవేశించి) ఆజ్ఞ.

(చాణ—వాచాలునిఁజూపి)వీనినిబంధింపుఁడు. ఈతఁడు చెప్పినది నిశ్చయమైన విడువుఁడు. లేకున్న వధింపుఁడు.

వాచా—నాకు దాహము మెండుగనున్నది. జలమునిప్పింపుఁడు.

చాణ—మంచిది. వీనికి జలమొసంగ వచ్చును

(రక్షకభటులతో వాచాలుఁడు పోవుచు) బ్రతుకుజీవుఁడా.

(అని నిష్క్రమించును)

చాణ—సంసారములో విడువఁదగిన పదార్థమేమియు లేదు. సంసారమునకు లగ్నమైన ప్రాణికి పురీషదుర్గంధము సహితము పారిజాతసౌరభమువలెఁ దోఁచును. కాత్యాయనా! నీయభిప్రాయమేమి?

కాత్యా—మనుజుఁడంతటి నీచస్థితికిఁ జ్యుతుఁడాయని తలంచెదను. అదియట్లుండఁడ—అత్యాచారాది ఘోరముల సహింపవచ్చుగాని కృతఘ్నత్వము పరమాసహ్యము.

చాణ—మానవునికృతఘ్నత్వమే చాణక్యుని రాజనీతిధర్మము. బంధువుని శత్రుగాఁ జేయుట, సోదరులకు విరోధముగల్పించుట, వారల హింసయందు ప్రవర్తింపఁజేయుట, స్వార్థపరత్వముచేఁ బ్రవర్తింపజేయుట, రాజనీతిధర్మములు—మఱియు—విషముందుహాసము—విషపానీయము—వంచన—వ్యామోహము—మొదలగునవి చాణక్యుని రాజనీతిలోఁ బ్రసిద్ధికెక్కినవి. ఎందుచేతననఁగా "శఠేశఠాంత్స మాచరేత్"

కాత్యా—చాణక్య! నేను ప్రతిహింసకంధుఁడను. నీరాజనీతి శుద్ధపరిపాకమును గ్రహింపఁజాలను.

చాణ—విశ్వాసఘాతుకకృత్యమునకుఁ బ్రతిక్రియ నివల సర్వర్తింపఁజేయుదును. శాఠ్యము నీవభ్యసింపవలెను.

కాత్యా—కాని యిది యన్యాయము. పాణినీయసూత్రములో "నిర్వాణోవాతే"యనియున్నది అర్థమైనదా?

చాణ—అబ్బ! నీపాణినీయదుఃఖముఁ దిరుగఁదెచ్చిపెట్టుకుము. ఇదియన్యాయమనియెవరనిరి.

కాత్యా—సంఘము.

చాణ—తృణీకరించుదును.

కాత్యా—వివేకముననైనం దెలియుదా?

చాణ—వివేకమా? కుసంస్కారము.

కాత్యా—ఈశ్వరుఁడు.

చాణ—ఎవఁడాయీశ్వరుఁడు? ఏఁడీ! లేఁడు లేఁడు.

కాత్యా—చాణక్యా! పర్వతగృహంబునుండిపడఁగలవు.

చాణ—పడినయెడల జగత్తునకది ప్రకాండమగునుల్కాపాతమగును. నేనునిద్రింపవలెను. సర్వము సిద్ధముఁ జేయుము. నీవిఁక వెడలుము.

కాత్యా—దేనిని సిద్ధముఁ జేయవలెను?

చాణ—యూపకాష్ఠమును—ఖడ్గమును—

కాత్యా—నందునిమాత్రము విడువుము.

చాణ—ఎట్లయిన నతనికి ముక్తియే సంభవించును. అంతయు సిద్ధమైనప్పుడందుగూర్చి విచారింపనేల? చూడుము—నాప్రేయసి కుటిలవిషమమందహాసామృతమును నాపై వెదఁజల్లుచున్నది. పొమ్ము—

కాత్యా—మంచిది— (నిష్క్రమించును)

చాణ—ఓయదృశ్యమహాశక్తీ! నన్నునివేవిధముగ శిక్షించినను సంతోషమే. ఆహా! నీయీకుటిలదృష్టి, రక్తహాసము, దుర్గంధనిశ్వాసము, నెంతమధురముగనున్నవి! నిన్ను నేవిడువఁజాలను ప్రేయసీ! నీవెంతటికుత్సితవే? నిన్ను నే బ్రేమించుకొలఁదియుముగ్ధుఁడనగుచున్నాను కృష్ణదావానలము సమస్తజగత్సౌందర్యమును దహింపఁజేయుచున్నది వనమందున్నవ్యాఘ్రము జంతుసంతతిని, భీకరవిస్ఫారితనేత్రములతోఁ జూచుచున్నది ఏమిభీషణము? ఏమిసౌందర్యము?

(నిష్క్రమించును)

తృతీయదృశ్యము. హీరట్టులో నొకసౌధము. కాలము: రాత్రి.

సెల్యూకసు పాదచారముఁ జేయుచుండును.

హెలేననిల్చియుండును.

సెల్యూ—సెకందరుచక్రవర్తి కవశిష్టమైన దిగ్విజయకార్యము నావలన సంపూర్తి యగును. చంద్రగుప్తా! ఒకసంవత్సరములో భారత వర్షమునంగలయవనుల యుపనివేశమునశింపఁజేసితివిగదా? మంచిది. తగినప్రతిక్రియకుఁ బూనుకొనెదంగాక.

హెలే—తండ్రీ! నీవు భారతవర్షముజయింపనేల? ఆసియాఖండార్ధభాగము నీసామ్రాజ్యముగదా? పృథ్వియంతట నీయశమునిండి యుండఁ జాలదా? సింధునది కావల సామ్రాజ్యాధిపతియై చంద్రగుప్తుఁడు పాలించుచున్న వాఁడు. ఈపాటి దాని కింతటికన్నెఱ్ఱయేల?

సెల్యూ—ఆతఁడు యవనుఁడా రాజ్యముఁ బాలించుటకు?

హెలే—ఎవఁడైననేమి? మనుజుఁడుగదా?

సెల్యూ—నాకజగంబున రెండుజాతులుమాత్రమేగలవు. సభ్యులగుయవనులు. అసభ్యులగుబర్బరులు.

హెలే—తండ్రీ! యవనులుచాలకాలమువఱకీవిధముగఁ బాలింపఁజాలరు. వారిసూర్యుఁడస్తమించెను. ఇపుడు సంధ్యాసమయము వారికిసమీపించినది. నీకుజయముసందియము. సందియమననేల! అపజయమునిశ్చయము.

సెల్యూ—నాకపజయమా? విజయశీలుఁడనని యెఱుంగవా?

హెలే—నీవు బంధింపఁ బడుదువు.

సెల్యూ—ఏమనుచుంటివి? నాకశుభముఁ గోరుదువా?

హెలే—నీవధర్మమునకుఁ బాల్పడుచుంటివి.

సెల్యూ—యుద్ధవిషయమున నీతో నెన్నఁడుఁ దర్కింపరాదు. ఎరిష్టటేలీసు చెప్పినదియేమన,

హేలే—చెప్పిన దేమి?

సెల్యూ—స్త్రీజాతితోఁ దర్కింపరాదని.

హేలే—ఆగ్రంథముఁ దెచ్చెదఁ జూపుము. (అనిపోవుచుండ)

సెల్యూ—వలదు. వలదు. ఎరిష్టపేనిస్సు—కాదు—తెమిష్టిక్లిస్సు చెప్పినట్లు తోఁచుచున్నది.

హేలే—ఇతఁడు రాజనీతిజ్ఞుఁడు. అతఁడిందుగూర్చి యేమనును?

సెల్యూ—అట్లయిన సెఫోక్లిసైయుండును.

హేలే—పోనిమ్ము. ఆగ్రంథముఁ దెచ్చెద. (అని వెడలును.)

సెల్యూ—కేవలము మౌర్ఖ్యము. నిజముఁ దలంచినఁ బైగ్రంథకర్తలెల్లరునాకు సమానులే. పూర్వగ్రంథకర్తలసాయములు రెంచుచ్చరించిన నామెమిన్నకుండుననితలంచితిని. ఈమె యీగ్రంథములన్నియుఁ జదివినది. మీఁదుమిక్కిలి సంస్కృతము సహితము పఠించుచున్నది (తెర వైపుజూచి) వచ్చుచున్నది. నిలువరాదు—(అని నిష్క్రమించును.)

హేలే—(గ్రంథములతోఁ బ్రవేశించి) తండ్రీ! (నల్గడలఁజూచి) నిన్ను నేనువిడువను. రమ్ము చూపింపుము. (అనునిష్క్రమించి సెల్యూకసు హస్తముఁబట్టుకొని ప్రవేశించి, తండ్రీ! కూర్చుండుము. సెఫోక్లిసు చెప్పిన యీయంశముఁ జూపవలెను.

సెల్యూ—అబ్బ! బలాత్కారమా? నేను చూపింపను. ఏమి చేయుదువు.

హేలే—అట్లయిన నీవావిధముగఁ బలుక నేల?

సెల్యూ—బుద్ధిలేక. చాలు. మంచిపనిచేసితివి. నీకేమియు దెలియదు. నీవు నాతో మాటలాడవలదు.

హేలే—ఏలమాటలాడరాదు? ఇట్లనఁదగునా? నీవుకోపించిన నాకు శ్రేయస్కరమగునా?

సెల్యూ—నాయందుదోషమున్నది. క్షమింపుము.

హె లే—తండ్రీ! నీయందుదోషముండునా? నాయందున్నది నీతో భాషింపఁదగని దానను.

సెల్యూ—కాదు కాదు. తల్లీ! దోషము నాయందున్నది.

హె లే—(మందహాసముఁ జేయుచు) అట్లయిన సఘోక్లిసు ఇందు గూర్చి యేమియుఁ బలుకలేదా?

సెల్యూ—లేదు లేదు.

హె లే—అట్లయినఁ దర్కింపఁబని లేదు. అదియట్లుండ సెకందరు గూర్చి యొక వదంతి నా చెవులఁబడెను. నిజముగునా?

సెల్యూ—ఎట్టిది?

హె లే—భారతవర్షము జయింపవచ్చినప్పుడొక బ్రాహ్మణుని తో సెకందరు ప్రసంగింపఁగా నా బ్రాహ్మణుండు "సెకందరుసార్వభౌమా! భారతవర్షముజయించి నీవు చేయునదియేమి?" యని ప్రశ్నించెనఁట. చక్రవర్తి "యనంతరము చీనాదేశము" జయింతుననెనఁట. బ్రాహ్మణుఁడనంతరమని ప్రశ్నింపగా నతఁడాఫ్రికాదేశముజయింతుననెనఁట. అనంతరమైరోపా జయింతుననెనఁట. అంత బ్రాహ్మణుఁడనంతరమని ప్రశ్నింపగా నతఁడేమియుఁ బలుకఁజాలక యీభాగమంతయు నెల్లఆకు నోసంగెదననెనఁట. ఆపని యిప్పుడేల చేయరాదని బ్రాహ్మణుఁడు ప్రశ్నించెనఁట.

సెల్యూ—ఆ బ్రాహ్మణుఁడు కుక్షింభరుఁడు. మూర్ఖుఁడు.

హె లే—ఆతఁడు పరమదార్శనికుఁడు. ఆశకంతముండదని బోధించెను. దార్శనికుఁడగు డయోజనిసుసహితమిందుఁగూర్చి వివరించెను. జీవితప్రయోజనముఁగూర్చి బోధించెను.

సెల్యూ—ఇతఁడు మూర్ఖుఁడగు దార్శనికుఁడు.

హె లే—అవును. ఎల్లఱుమూర్ఖులే, అందుచేఁగాఁబోలు సెకందరా బ్రాహ్మణుని స్వయముగఁజూచి "నేను భువనవిజయినగు చక్రి

వర్తిని. నీవు కోరునది యొసంగెద" ననఁగా—

సెల్యూ—చెప్పనక్కఱలేదు. ఆకుక్షింభరుఁడు రాజ్యాధిపత్య ము గోరియుండును.

హెలే—(నవ్వుచు) కాదు. కాదు. ఆబ్రాహ్మణుఁడతనిఁజూచి "నీవీరాద్రవృత్తివిడువు" మని కోరెను.

సెల్యూ—ఆబ్రాహ్మణుఁడున్మత్తుఁడని చక్రవర్తి నిశ్చయించి యుండును.

హెలే.—అట్లుకాదు. సెకందరతనితో "నేను సెకందరుఁగాకున్న నట్లొనర్చియుందు" ననెను.

సెల్యూ—బాగుగఁజెప్పెను. సెకందరు చతురుఁడు. అహ్హా. అహ్హా. (అనినవ్వుచు నిష్క్రమించును.)

హెలే—ఆహా! మనుజుఁడు స్వార్థపరాయణుఁడు. పరసుఖము నిసుమంతయుఁ గోరఁడు. ఎప్పుడుఁబోరాటమునే కోరుచుండును. ఒకరిప్పుడీ భూమండలమునంతయు మ్రింగఁదలంచును. తల్లీ! వసుంధరా! ఇట్టిరాక్షసుల నేలభరించెదవు. ఈశ్వరుఁడీ దారుణసృష్టి కంత మాపాదించుఁగాక—(నిష్క్రమించును).

చతుర్థదృశ్యము. స్థానము:—గృహోద్యానము. కాలము.—సంధ్య—
(నదీతీరమున ఛాయ యేకాకినియై పాడుచు నుద్యానవనమున
విహరించుచుఁ బ్రవేశించును.)

చక్రవాకము. ఆదితాళము. (ఇంకాదయరాలేదా నాపై ననుకృతి
ననుసరించి పాడునది).

ప॥ ప్రేమింపగ చేలే కామించీ - భీమబలాఢ్యుని నామమెంచి॥
అ॥ వ్యోమసీమఁగ్రాలు నలచంద్రుని-స్వర్గంబుఁబోలుమగధ నేలుపంద్రు॥
చ॥మందభాగ్యయా - సుందరదనఁగని - యానంద మొంది యనుభవించునే॥

డెందమందు చింత సంతతము నెంతంతో వగచి ప్రాణములవిడుతు
ఇందువదన! యేవేళం దలంచి నీమధురనామమును వెతలంగుందితి;!!
చంద్రగుప్త శ్రీమాగధేంద్ర - శాత్రవజనభీకరా ! శ్రీకర !!

చంద్రగు—(ప్రవేశించి) ఛాయా !

ఛాయ—(త్రుళ్ళిపడి) ఓహో ! మహారాజుగారు.

చంద్రగు—చంద్రకేతు వచ్చుట ?

ఛాయ—ఎఱుంగను. చూచివచ్చెదను.

చంద్రగు—వలదు. వలదు. నిలువు.

ఛాయ—(నిల్చి చూచుచుండును.)

చంద్ర— (స్థిరదృష్టి నామెం బరికించుచు) యుద్ధానంతరము నిన్నుం జూడంజాలకుంటిని.

ఛాయ—(నిస్తబ్ధమైయుండును.)

చంద్రగు—నీవు నాప్రాణముల రక్షించినదానవని యెఱుంగుదు. ఆకృతజ్ఞత నీకుం దెలుప సమయము ప్రాప్తింపకుండెను. నీయందు కృతజ్ఞుండనై యున్నాను.

ఛాయ—(మెల్లగ) ఈమాత్రముననా ?

చంద్రగు—నీకు నేం బ్రత్యుపకారముం జేయ—

ఛాయ—మహారాజా ! ప్రత్యుపకారముతోం బ్రయోజనము లేదు. మేము పార్వతీయజాతివారము. ఉపకారము విక్రయించు నాగరకత మాయందు లేదు. అధిక కార్యములకుద్యమించువారముగాము. మహారాజుగారిని రక్షించుటంబట్టి మాజీవితము సార్థకమైనది. అధికము మాకక్కఱలేదు.

చంద్రగు—ఈకిశోరహృదయమున నింతటిమహత్త్వమున్నదా ?

ఛాయ—మహారాజా ! చిన్నప్పటినుండియు మృగయావిహార

ము. నూకలవడియున్నది. యుద్ధము మాకుజీవనము. వంచించుటయె ఱుంగము. ద్వైర్థి మాభావయందు లేదు.

చంద్రగు—ఛాయా !—

ఛాయ—మహారాజా ! మాకెట్టి కాంక్షయు లేదు. (అని పోవు చుండ)

చంద్రగు—నిలువుము. నేనించుక యడుగవలసియున్నది. ప్రత్యుపకారనిస్పృహతకుఁ గారణమేమి ? ఇంతటి యుదాసీనమేల ?

ఛాయ—(అస్ఫుటస్వరమున) ఉదాసీనమా ? అనఁగా ? (అని తలవంచుకొని) మహారాజా ! తమ రెప్పుడైన పర్వతశిఖరమునుండి సూర్యోదయముఁ జూచియుందురా ?

చంద్రగు—చూచియుందును.

ఛాయ—మాజీవితమట్టిది. మఱియు నుజ్జ్వలఘనశ్యామలతఁ బోలి మాజీవితము కంపించుచుండును.

చంద్రగు—ఈవాక్యముల కర్థ మవ్యక్తముగనున్నది. అయిన నేమి ?—ఆయుజ్జ్వలఘనశ్యామలతకుఁగల హృదయము తెలియకున్నది.

ఛాయ—మహారాజుగారి సౌజన్య మట్టిది. కేవలము కృష్ణదేహులమని పలుకరాదా ? మహారాజా ! మేఘ మెంతటి కృష్ణవర్ణము గలదియైనను నంతస్సారముగలది. దానివక్షమునఁ జంచల నటించుచుండునని యెఱుంగరా ? మాకుసహితము మానసమున్నది. మామానససరోవరమున నటించు నూహాతరంగము లెట్టివో గ్రహింపవలయుఁగాక.

చంద్రగు—ఛాయా ! నీవు నన్నుఁ బ్రేమించుచుంటివా ? అది యసంభవమగునేమో ?

ఛాయ—అసంభవమా ? ఎందుచేత ? మీరు మగధ దేశాధిపులు. నేను మలయదేశాధిపుసోదరిని. ఏల ప్రేమింపరాదు? నేను సంపూర్ణముగఁ ద్రికరణశుద్ధిగఁ బ్రేమించుచుంటిని—

(అనినిష్క్రమించును.)

చంద్రగు—ఆశ్చర్యము. ప్రాణములరక్షించి ప్రేమించినది. అంగీకరింపకున్న—స్త్రీచారిత్ర మపూర్వప్రణాళికఁ బోలినది—చాలకాలముక్రింద సింధునదీతీరమున—సెల్యూకసుకన్యకఁజూచి యీ హృదయమర్పించితిని. ఆమె నన్నుఁబ్రేమించునా? ఆమె యవనబాలిక—అపూర్వసుందరి. మహానీలజలరాశిపై నవతరించినయుమఁబోలి కన్పట్టెఁగదా? అదియొకస్వప్నము. ఏమియీవిచారము—ఎంతవిచిత్రముగనున్నది!

ఉ. ఈమలయావనీశ్వరున కేఁగడుమిత్రుఁడ; వాని చెల్లెలీ।
కామిని, నన్ను యుద్ధమునఁ గాచినదామయి నన్వరించె; నే।
నిమెంద్రుణీకరించి యవ నేశ్వరుకన్యకగోరుచుంటి; నా।
భామయు నొక్కసుందరుని పై వలపూనెనొ ? నన్వరించునో ?।
కామవికారమున్ దెలియ గావశమే యవివేకశాలికిన్ ?

(అంతఁ జంద్రకేతువు ప్రవేశించెను.)

చంద్రగు—ఓహో ! చంద్రకేతువు.

చంద్రకే—బంధూత్తమా ! బ్రాహ్మణునియాజ్ఞానుసారముగ నేఁడు నందమహారాజుగారిని వధింపవలెను.

చంద్రగు—(ఆశ్చర్యమున) ఆఁ—అది యేమి ? బ్రాహ్మణుని యాజ్ఞయా ! నేనెవండను, మగధరాజ్యాధిపతి యెవఁడు. నాకష్టమంతయుఁ గ్రుద్ధబ్రాహ్మణకోపాగ్నికి నాహుతియగుటకా ? చంద్రకేతూ

చంద్రికే—బంధూత్తమా!

చంద్రగు—నందుని వధింపరాదు. నాయాజ్ఞయని బ్రాహ్మణునకుఁజెప్పుము. మహారాజు చంద్రగుప్తుని యాజ్ఞయనియు, వధింపరాదనియుఁ బలుకుము. వెడలుము.

చంద్రికే—(నిష్క్రమించును.)

చంద్రగు—ఈబ్రాహ్మణుని తలంపు నాకుఁ దెలియకున్నది. నాయనుమతి లేకుండ నెంతటికార్యమునకుఁ బూనుకొనినాఁడు? నేను సామ్రాజ్యాధిపతినా? లేక వానిచేతి కీలుబొమ్మనా?

ఛాయ—(ప్రవేశించి) మహారాజా! క్షమింపుము.

చంద్రగు—ఎందుకు?

ఛాయ—తెలియక యేమియో వచించినందుకు.

చంద్రగు—ప్రేమించి యేవగించుటేమి?

ఛాయ—ప్రేమించుచుంటేఁగాని యేవగించుటలేదు. ఎవఁడు జాగ్రదవస్థయందు నాకు ధ్యానరూపియై యుండునో?—నిద్రావస్థయందు స్వప్నమైయుండునో?—ఇహలోకమున సంపత్స్వరూపియై యుండునో?—పరలోకమున స్వర్గమైయుండునో?—ఎవనిదర్శనము తీర్థసేవయో?—అట్టివాని నేవగింపఁదగునా?

చంద్రగు—అవును. నీవేల యేవగింతువు?

ఛాయ—అవును. మీరు నాయాహారమునకు క్షుత్తుఁబోలి, శయనమునందు నిద్రఁబోలి—వేయేల? సమస్తసమయములయందు మీరు నాలోనుండగా—

చంద్రగు—ఛాయా! (ఆమెచేయిఁబట్టుకొనును.)

ఛాయ—నన్ను స్పృశింపరాదు. మీస్పర్శమునకు నాశరీరము తటిల్లతాప్రవాహంబున మునుంగును. పాషాణపాత్రమునకు కాంస్య

పాత్రమువలె, నాము స్త్రిమ్కము బిద్దలగును. లేదు. లేను. నేను వ్వాద మును సహింపఁజాలను.

(అని విమ్కమించును.)

చంద్రగు—ఏమాశ్చర్యము! నేనీమెను సోదరియని భావించితినే. తుదకిట్లు పరిణమించినది—అత్యాశ్చర్యము.

(నిమ్కమించును.)

పంచమదృశ్యము. కాలము:—రాత్రి; రక్షకభటులతో,
నందునితో కాత్యాయనునితో చాణక్యుఁడు
ప్రవేశించును.)

చాణ—(నందునిజూచి) భూతపూర్వ మహారాజా! ఈబ్రాహ్మణపరితాపమెఱింగితివా? దైవము మూర్ఖుఁడని తలంపకుము. భుజబలమును మించునది బుద్ధిబలమని యెఱుంగుము. పశుబలంబును విశ్వసింపకుము.

చం. లలనలవిప్రులన్ సుజనులన్ నిఱుపేదలమోసపుచ్చి, దో
ర్బలమునఁగొట్టి ఘోరముగ పద్ధతులన్ గను నేర్పరించి, ప
న్నులనుగ్రహించుచుఁ బ్రజల నొంచినఁబాపము రిత్తవోవునే?
ఫలమునుగాంచె నీవిపుడ పారమదజ్వరమంతరింపఁగ.

మహర్షులు మూర్ఖులుగారు. బ్రాహ్మణుల కసాధ్యమైనది లేదు. భారతవర్షమెంతకాలముండునో యంతకాలము బ్రాహ్మణపరితాపము నశింపకుండునని యెఱుంగుము.

నందు—ఈదంభప్రలాపములకా నన్ను రప్పించితివి?

చాణ—మంచిది. నీవీఖడ్గము నీయూపకాష్ఠముఁ జూచితివా? ఇపుడైన నిన్ను రప్పించుటకు హేతువు గ్రహింపుము. నీహృదయరక్తరంజితహస్తమునఁ గాని యీశిఖావలయము సంస్కరింపనని ప్రతినఁ గైకొనిన చాణక్యుఁడను. మఱచితివా?

నందు—ఏమీ ! నన్ను వధించెదవా?

చాణ—నిరాఘాటముగ—నిస్సందేహముగ—

ఉ. రిక్కలు రాలుఁగాక, గ్రహరీతులు మారిన మారుఁగాక, న
ల్దిక్కులుఁ గూలుఁగాక, రవితేజముఁదప్పిన దప్పుఁగాక, ని
న్నొక్కట గ్రిక్కుమిక్కుమన కుండగఁ గూలినడొక్కఁ జీల్చి నీ
చిక్కనినల్లతోఁ గడిగి చేతులఁ గేశము సంస్కరించెదన్.

నందు—దిక్కులేనివాని వధించుట సనాతనధర్మమా?

చాణ—ఓరీ ! బ్రాహ్మణద్వేషీ ! బ్రాహ్మణునకు సనాతనధర్మము నీవుపదేశింపఁగలవా? ఇది హత్యగాదు. మరణదండము. నేను బ్రాహ్మణుఁడను. నీకు విధించుచున్నాను.

నందు—ఏయపరాధమునకు?

చాణ—బ్రహ్మహత్యాపరాధమునకు— బ్రాహ్మణునవమానించు నపరాధమునకు—నీవు దీనిహత్యయనినను నేను విచారమందను. ఈయధికారము నాకున్నది. నీవు గావించిన ప్రజాద్రోహమునకు మరణము విధించితిని, నందా ! సిద్ధముగ నుండుము.

నందు—చాణక్యా! నేను కాత్యాయనుని యెడల, నీయెడలఁ జేసిన యపరాధమునకు క్షమింపుము.

చాణ—(అట్టహాసముఁ జేయుచు) అహ్హా ! అక్షర మక్షరము ననుకూలించుచున్నది. నేను నాఁడు పలుకలేదా? ఒకప్పుడు నీవీబ్రాహ్మణుని పాదసన్నిధిఁ గూర్చుండి, ప్రాణదానముఁ జేయుమని వేఁడుదువనియు నేను గాపాడఁజాలననియు——

నందు—చాణక్యా ! నేను ప్రాణదానముఁ గోరలేదు. నేను క్షత్రియుఁడను; బ్రాహ్మణప్రభుత్వమును మన్నింపను. శూద్రుని గణిం

పను. మృత్యుభయము నాకులేదు. నీరక్తచక్షువులకు భీతిల్లి బ్రిమఁ దలంపను, కాని నేనొనర్చిన యధర్మమునకు పశ్చాత్తాప మొందుచు న్నాను—సహవాసదోషము నన్నింతకుఁదెచ్చినది. నన్ను క్షమింపుము. కాత్యాయనా!—

కాత్యా—(దుఃఖించుచు)మహారాజా! నేనుక్షమించితిని.

చాణ—కాత్యాయనా! క్షమ పనికిరాదు. పృథ్విలో నొకఁడొ కని క్షమింపఁజాలఁడు. ఎట్టివానికైనఁ గర్మానుభవము తప్పదు. హృద యమునఁ గోపాగ్నిహోత్రము జ్వలించుచున్నప్పుడది నీశత్రువు బా ష్పములచేఁగాని చల్లాఱదు. అనుతాపము మిథ్యయైన, క్షమసహితము మిథ్యయగును. శాంతి, సముఖమునఁ గనఁబడనప్పుడు పశ్చాత్తాపము నకుఁ బ్రమాణము లేదు.

కాత్యా—నందుఁడజ్ఞాని—బాలకుఁడు—

చాణ—అజ్ఞానియగుఁగాక; బాలకుఁడగుఁ గాక. అజ్ఞానియైన, బాలకుఁడైన, నగ్నిహోత్రముఁదాకినప్పుడు కాలకుండునా? అగ్ని తనధర్మగుణమునద్వివిధములఁ బరిణమించునా?

కాత్యా—అవునుగాని—పాణిని—

చాణ—(కోపోద్రేకమున) తిరుగ పాణిని యని వదరెదవేల? కాత్యాయనా! నీవీతరుణమునఁ బాణినిఁగూర్చి వచించినశిక్షించెదను.

కాత్యా—పోనిమ్ము. నందునిక్షమి—

చాణ—పనికిరాదు. కాత్యాయనా! ఖడ్గముఁబూనుము. నీ వీతని స్వహస్తములతో వధింపవలెను.

కాత్యా—ఆఁ—నేనా?

చాణ—అవును. నీవే. పుత్రహత్యకుఁ బ్రతిక్రియఁజేయుము. కాత్యాయనా! మఱచితివా? నీకుమారులను, భద్రాకారులను, నిరా హారులై యాహాకారముఁజేయువారలను, దీనులను, నిష్పంద, నిరి

మేమ నేతు్రిలను, కరాళమృత్యుముఙా్రింకితులఁగాఁ జేసియుండఁడా? ఆమృత్యువు నీవు ప్రత్యక్షముగఁ జూడలేదా? నీవు వారిఁ గన్నతండ్రివి గావా? ప్రతిక్రియకుఁ బూనుకొనుము.

కాత్యా——(ఖడ్గముఁ గైకొనును)

చాణ——విళంబమున కిది తరుణముగాదు. భటులారా! నందుని శిర మీయూపకాష్ఠముపైఁ బెట్టుఁడు.

భటులు——(అట్లుచేయుదురు.)

చాణ——భూతపూర్వనందమహారాజా! సిద్ధముగనున్నావా? ఊఁ—ఊఁ—కాత్యాయనా!

కాత్యా——(ఖడ్గముతో యూపకాష్ఠమును సమీపించును.)

చాణ——నందమహారాజా! ఇది బ్రాహ్మణకృత్యముగాదు. నేనే మిచేయఁగలను. నేఁడిట్టిప్రయోజనము సంభవించినది. నేఁడు బ్రాహ్మణునకుఁ దపశ్శక్తిలేదు. నేఁడు ద్వితీయపరశురామునిఁ బోలి భరతవర్షమును నిక్షత్రియముఁ జేయఁజాలుదు. కపిలునివలెఁ గ్రుద్ధదృష్టిమాత్రమున నందవంశము భస్మముఁజేయఁజాలి యుందును. ఇది కలియుగము గుట నట్లు సంభవింపనేరదు. అందుచే ఖడ్గ మావశ్యకమైనది. కలియుగ మెంతటి పాపయుగమైనను, భరతవర్ష మొకమారు బ్రాహ్మణప్రతాపముఁ జూచుఁగాక. (కాత్యాయనునిఁజూచి) ఊఁ—ఊఁ—వధింపుము—ఆఁ——ఆఁ——తాళుము——తాళుము. (నందునిఁజూచి) నందమహారాజా ఈశుభవార్తవిని చావుము. నీవంశము ధ్వంసమైనది—పిండోదకక్రియలకు నొక్కపురుగైనలేదు. నందవంశము నిర్మూలమైనదని యెఱుంగుము.

నందుఁడు——(దుఃఖించును.)

చాణ——(కాత్యాయనునితో) ఊఁ——ఊఁ——కానిమ్ము.

కాత్యా—(ఖడ్గమెత్తును.)

(చంద్రకేతువు శీఘ్రముగఁ బ్రవేశించి) తాళుము. తాళుము. చంద్రగుప్తమహారాజుగారియాజ్ఞ. ఖడ్గముదింపుము.

చాణ—చంద్రకేతూ! ఇది యేమి?

చంద్రకేతు—రాజాజ్ఞ.

కాత్యా—(ఖడ్గముదింపును)

చాణ—అట్లనా? ఎఱుంగుదు. ఈయాజ్ఞ నాకుఁ జెల్లదు. (కాత్యాయనునిఁజూచి) చూచుచుంటివేమి? వధింపుము.

చంద్రకే—గురుదేవా! రాజాజ్ఞ యమోఘము. వధింపరాదు.

చాణ—గురుదేవునియాజ్ఞ. కాత్యాయనా! వధింపుము.

చంద్రకే—అట్లయిన మహారాజు స్వయముగవచ్చుఁగాక. అంతపర్యంతము వధింపరాదు. రాజాజ్ఞ నేఁ బాలింపకతప్పదు. రక్షకభటులారా! దూరముగ నుండుఁడు. తొలంగుఁడు.

చాణ—వలనుపడదు. వధింపక తప్పదు.

చంద్రకే—(తెరవైపుఁజూచి) వీరబలా! ఇటు రమ్ము.

(భటులతో వీరబలుఁడు ప్రవేశించును.)

చంద్రకే—భటులారా! మహారాజువచ్చుపర్యంత మీనంద మహారాజునురక్షింపవలెను. వీరబలా! నీవు మహారాజుగారికీయుదంతమంతయు విన్నవించి స్వయముగ రావలసియుండునని చెప్పుము.

వీర—మహాప్రసాదము. (నిష్క్రమించును.)

చాణ—కాత్యాయనా! ఖడ్గముఁబైకెత్తి తిరుగ దింపితివేమి? మృణ్మయాకారముఁ దాల్చితివేమి? ఆఖడ్గము నాకిమ్ము.

ఉ. నాకొకఁడాకయైనఁ బనుపె నాల్గుజగంబులు నాదుకోపమన్
గాకలమ్రగ్గవే? యుగపత్ప్రాణంబులురాలవె? నేఁడుచూచెదం

గాక యెవండు నన్ను నరికట్టఁగఁజాలునొ? నీముఖఖడ్గముఁ
గైకొనినేవధించెదను కాకులు గ్రద్దలు సంతసింపగన్
(అని ఖడ్గముఁగైకొనఁ బోవును.)

చంద్రికే—(చాణక్యునిపాదములపైఁబడి) నేను బ్రాహ్మణు నకు నమస్కరించెదను. రాజాజ్ఞఁ బాలించెదను.

చాణ—కాత్యాయనా! వధింపుము.

కాత్యా—(ఖడ్గమెత్తును.)

చంద్రికే—కాత్యాయనా! రాజాజ్ఞ యమోఘము.

కాత్యా—(ఖడ్గముదింపును.)

చాణ—కాత్యాయనా! నీవు నాయాజ్ఞఁ బాలింపవలెను. ఎవఁడు చంద్రగుప్తుని సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టెనో యీ బ్రాహ్మణుఁడు తిరుగ చంద్రగుప్తుని పదచ్యుతునిఁ జేయఁగలఁడు. కాత్యాయనా! చూచుచుంటివేమి? వధింపుము.

కాత్యా—(ఖడ్గమెత్తును)

చంద్రికే—కాత్యాయనా! రాజాజ్ఞ యమోఘమని యెఱుంగవా? బ్రహ్మహత్యకైన వెనుదీయక రాజాజ్ఞఁ బాలించి తీరెదను. త్రిమూర్తులనైన నెదిరించి నావిధి నేనొనర్చెదను.

(అంత శీఘ్రగమనమున మురప్రవేశించి) బ్రహ్మహత్యకుఁ దోడు స్త్రీహత్యయు సంభవించును. కాత్యాయనా! వధింపుము.

చంద్రికే—(కంపించుచు) తల్లీ!

ముర—అవును. రాజాజ్ఞకు మించినది నాయాజ్ఞ. వధింపక తప్పదు.

చంద్రికే—తల్లీ! నందుని క్షమింపవలెను.

ముర—(వ్యంగ్యహాసముతో) క్షమయా? అసంభవము. క్షే-

ద్రోహిక్షమయెఱుంగదు. క్షమ బ్రాహ్మణధర్మము. బ్రాహ్మణేతరులకు క్షమయనునది లేదు.

చంద్రకే—క్షమ మానుషధర్మము. ఒక బ్రాహ్మణునకేగాదు. క్షమవహించుట యపారసుఖము. క్షమ సర్వత్ర యుండఁదగినది. ఈ క్షమ స్వర్గమునుండి ప్రవహించు భాగీరథి పవిత్రజలముఁ బోలి సంసారసాగరమున సంగమించుచున్నది. ఎల్లరు నాపవిత్రసాగర సంగమమున జలకమాడి పవిత్రులైయుండవలెను. పరమాత్ముని క్షమ యనేకవిధంబుల ననేకరూపములతో మర్త్యలోకమున నీన మగుచున్నది. రోగమునం దీక్షమయే యారోగ్యరూపిణియైవచ్చి మనల రక్షించుచున్నది. శోకమునందీక్షమ. విస్మృతిరూపిణియై మనలఁగాపాడుచున్నది. దారిద్ర్యమున నీక్షమయే, సహిష్ణుతారూపిణియై పరితృప్తిఁ గల్పించుచున్నది. శైశవమున, సంతతినెల్ల నీక్షమయే తల్లితోనేకీభవించి పెంచి పెద్దచేయుచున్నది. తల్లీ! క్షమింపుము.

(అని మురపాదములపైఁ బడును.)

చాణ—క్షమఁ గూర్చి యధికముగ నుపన్యసించితివి క్షమ గొప్పదియే యగుఁగాని క్షమించుటకుఁ దగినంతకారణ ముండ వలదా?

సీ. ధర్మమార్గము రాజు దప్పరాదనునీతి
బోధించుపెద్దల బాధబెట్టి
"అదియేమి? ధర్మమా" యనువారలంబట్టి
కారాగృహంబున గట్టికొట్టి
"ప్రజలీయఁజాలరు పన్నులహెచ్చింప
వలదను" నుద్యోగి విరులఁదిట్టి
"ఘోరశాసనముల కోరువఁజాలమో
యనికుందుస్త్రీలపై నతిచరించి;

గీ. బ్రాహ్మణద్వేషమెల్లెడఁ బాడుగొప్ప;
పాడిఁ జెప్పిన వధయించి ప్రజలతోడ
"మఱచిపోండు క్షమింపుఁడు మాన్యులార"
యనిన రాజమాత్రుండు క్షమార్హుఁడగునె?

ముర—చంద్రికేతూ! నేను క్షమింపఁజాలను. నందుని యీయవస్థలోఁ జూచితిని. ఈతని మ్లానాధోముఖముఁ గనులార వీక్షించితిని. నాకన్నీరు మాత్ర మతనిఁ జూడకుండఁ జేయుచున్నది. నందా! శూద్రాణిదుగ్ధములు క్షత్రియాణిదుగ్ధములకంటె నెంతమధురము గ నుండునో యెఱుంగుదువా? శూద్రాణిస్నేహము, క్షత్రియాణిస్నేహముకంటె నెంతశుద్ధమైనది. శూద్రాణిని, గణికను, నేనుక్షమింపఁజాలను. కాత్యాయనా! చూచుచుంటివేమి వధింపుము. ఊఁ— వధింపుము.

చంద్రికే—తల్లీ! వలనుపడదు. రాజాజ్ఞ.

ముర—ఎవఁడారాజు. నీరాజు చంద్రగుప్తుఁడు శూద్రాణికి కాదు—గణికకుఁబుట్టినవాఁడు. చంద్రగుప్తునియాజ్ఞ—గురుదేవుఁడు కా వానితల్లి కా— కాత్యాయనా! నాయాజ్ఞయైనది. వధింపుము.

చంద్రికే—నాకీతాపున పరాజయము గలిగినది—స్త్రీయెడ నేనర్భకుఁడనైతిని. (అనిమురపాదములపైఁ గరవాలముఁ బడవైచి) తల్లీ! నిన్ను వారింప నాకు సాధ్యముగాకున్నది.

చాణ—కాత్యాయనా! ప్రాణమున్నదా లేదా? చూచుచుంటివేమి? వధింపుము—ఊఁ—నీపుత్రులఁజంపినవానివధింపుము.

కాత్యా—నారాయణా. నారాయణా. (ఖడ్గమెత్తి నందుని శీర్షముఁ గనును.)

చాణ—(అట్టహాసముఁ జేయుచు) అహాహా! ప్రతిహింస సం

పూర్ణముగఁ గొనసాగినది. (అని నందుని రక్తము చేతులతో నద్ది, శిఖను బంధించి, నిష్క్రమించును.)

కాత్యా—నా సంతాన సప్తకమును వధించిన వానికిఁ బ్రతిక్రియ సల్పఁ ద్రించితిని. (అనంతరము చంద్రగుప్తుఁడు ప్రవేశించి) ఇది యేమి యీ ఘోరము?

ముర—ఈముఖమునకే పాలొసంగితిని. ఈశరీరము నే పెంచితిని. ఏమైన నేమి ? తుదకిట్లు పరిణమించినది.

చంద్రగు—వధించినవారెవరు?

కాత్యా—నేను.

చంద్రగు—ఎవనియాజ్ఞపై-

ముర—నాయాజ్ఞపై— గురుదేవుని యాజ్ఞపై- కాత్యాయనా! నీయందుదోషమేమున్నది.

చంద్రగు—కాత్యాయనా! రాజాజ్ఞఁ దిరస్కరించితివి.

కాత్యా—అవును.

చంద్రగు—బ్రాహ్మణుఁడవధ్యుండు. నీవు నారాజ్యమునుండి వెడలుము.

కాత్యా—మహారాజా!

చంద్రగు—ఏమియు వినఁదలంచుకొనలేదు. చలిచీమయు నాయాజ్ఞఁ బాలింపవలెను. ఊఁ—వెడలుము—వెడలుము.

కాత్యా—అట్లనా? మంచిది- (అని నిష్క్రమించును.)

చంద్రగు—చంద్రకేతూ!

చంద్రకే—మహారాజా! కోటివీరులెదురించినను రాజాజ్ఞఁబాలించి తీరెదను గాని స్త్రీసన్నిధిని మాత్రమట్లు చేయఁజాలను.

చంద్రగు—తల్లీ!

ముర.—కుమారా! నాయపరాధమును క్షమింపుము.

చంద్రగు—అమ్మా! తల్లియపరాధము పుత్త్రునిది. "జననీజన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ" యనిగదా పెద్దలవాక్యము. నిన్నేమనగలను. (అనినంతని శీర్షముఁబట్టుకొని కన్నీరు దుడుచుకొనుచు నిష్క్రమించును. అనంతరమెల్లరు నిష్క్రమింతురు.)

(యవనిక జారును)

తృతీయాంకము సంపూర్ణము.





# ప్రతిజ్ఞాచాణక్యము.

## చతుర్థాంకము.

ప్రథమదృశ్యము. స్థానము:—కుటీరము. కాలము:—సాయంకాలము.

చాణ—(ఏకాకియై ప్రవేశించి) ప్రతిహింస నెఱవేరినది—ఊఁ—అదియొకయున్మాదము. పూర్తియైనఁగాని నిద్రయుండదు. ఆహారము రుచింపదు. ఆహా! ఇప్పటికి నాహాహాకారము వినంబడుచున్నది. నాహృదయము సౌహార్దమునకుఁ దావీయదు. ఏమైననేమి? జరిగినదేమియో జరిగినది. ఓ రాక్షస! ఎంతపనిచేసితివి? ఊఁ— విచారించిన లాభమేమి? అరణ్యరోదనము—కంకాళముపైఁ గరాఘాతము (అని మెల్లగఁ బాదచారణముఁ జేయుచుండును.)

(గుప్తచరుఁడు ప్రవేశించి) గురుదేవునకు నమస్కారము.

చాణ—విశేషమేమి?

గుప్తచ—కాత్యాయనుఁడు శత్రువులగు యవనుల శిబిరమునందుండుట నిశ్చయము.

చాణ—నిజమా!

గుప్తచ—యవనులు సింధునదము దాటిరి.

చాణ—మంచిది. సైన్యమెంతియుండును?

గుప్తచ—నాలుగులక్షలకు మించియుండును.

చాణ—మంచిది—వెడలుము.

గుప్తచ—మహాప్రసాదము—(నిష్క్రమించును.)

చాణ—కాత్యాయనా! చిరకాల మొక విధముగ నుండదు. రాజ్యము నుండి తొలంగింపఁబడుట శాశ్వతమని యెంచి శత్రువులఁ జేరితివా ? కానిమ్ము—సెల్యూకస్! అతని ప్రోత్సాహమున దాడివెడలెదవా? కాత్యాయనా! నామంత్రిత్వమునకు నీసువహించి యుండుదువు మూర్ఖా !

(రెండవగుప్తచరుఁడు ప్రవేశించి) జయము. జయము.

చాణ—విశేష మేమి?

రెండ—విద్రోహులు గుమి గూడిరి. సంకేతస్థానము నేర్పఱిచిరి. మహారాజుగారి శయనగృహమున నిరువది యైదుగురు సొరంగమునందున్నారు.

చాణ—అవును. ఇంతకు పూర్వమే వినియున్నాను. నాయకుఁడెవఁడు ?

రెండ—వాచాలుఁడు.

చాణ—మంచిది. వెడలుము.

రెండ—మహాప్రసాదము (నిష్క్రమించును.)

చాణ—మూర్ఖా! వాచాలా ! ఊఁ—కానిమ్ము—(తెరవైపుఁ జూచి) వీరబలా !. —వీరబలా !

(వీరబలుఁడు ప్రవేశించి) ఏమియాజ్ఞ?

చాణ—నీవీక్షణమేపోయి, చంద్రగుప్తునిశయనగృహమున సొరంగముఁ బరీక్షించి, యిరువదియైదుగురఁబట్టి వధింపుము.

వీర — మహాప్రసాదము. (నిష్క్రమించును.)

చాణ — ఈప్రయత్నము చాల చమత్కారముగ నున్నది. ఏమిచౌర్యవృత్తి! చాణక్యుని మోసుటనా? రాముఁడు గుప్తచారులఁగలవాఁడట! తనమంచి చెడ్డలనువినుటకే యుపయోగించెను. నేను సర్వము నెఱింగి నశింపఁజేయుచున్నాను.

(అంత చంద్రకేతుఁడు ప్రవేశించి) నన్ను రప్పించిన విశేషమేమి ?

చాణ — చంద్రకేతూ ! చంద్రగుప్తుఁడు నేఁటిరాత్రి దాక్షిణాత్యమును జయించి వచ్చుచున్నట్లు విని యుంటివా?

చంద్రకే — ఎఱుంగుదును. మహోత్సవము సిద్ధముఁజేయ నాజ్ఞయైనది —

చాణ — సిద్ధమైనదా ?

చంద్రకే — అవును. నగరమంతయు నలంకరింప నాజ్ఞాపించితిని, మఱియు —

చాణ — (అసహ్యముగ) ఉత్సవము గిత్సవము వలనుపడదు. నగరాలంకరణము వ్యర్థము. ఏమట్లు చూచుచుంటివి? ఈక్షణమే యుత్సవము మాపుచేయుము.

చంద్రకే — అది యేమి గురుదేవా ?

చాణ — (కోపముతో) కారణమడుగరాదు. వెడలిపొమ్ము.

చంద్రకే — (మెల్లగ నిష్క్రమించును.)

చాణ — సరియే — బాగుగ నేయున్నది. నేనీమహాత్తర సామ్రాజ్యముఁబాసి యేస్థలమునకేగెదను! ఈరాజ్యశిఖరముఁజూచితిని. రాజ్యమంధకారమునందు నప్పుడు తిరుగ రావలసియుండెను నేఁవల రావలెను. ఓపిశాచీ! ఇఁక నన్ను విడువుము; పోయెదంగాక — ఎచ్చటికి?

ఎవ్వఁడునన్నుఁ గొంపోవఁగలఁడు. మిధ్య—వంచన—చౌర్యము—హత్య—ఛీ—ఛీ—ఎట్టకేలకు శాంతించినది. ఆఁ—శాంతించినది. శాంతించుఁగాక, ప్రస్తుతము—తంత్రమంతయు బాగుగనే యనుకూలించినది. (దీర్ఘ నిశ్వాసము వదలుచు) ఇప్పుడెంత వేళయైయుండును? చూచెదఁగాక (అనిగవాక్షము తెఱచి) ఇది యేమి—ఇంతకుఁ బూర్వమెన్నఁడుఁ జూడని యీ తెల్లని చీకటులునాకంటఁబడినవి. ఏమి సౌందర్యము?—ఏమి యానందము—ఆఁ! ఇది వెన్నెల—ఆకాశమునంగల లఘు శుక్ల మేఘఖండములపై నీవెన్నెలయెట్లు వ్యాపించినది? కంఠోయి వినుగదా? ఓహో! జ్యోత్స్నాతియగు నీభాగిరథి, కలకలధ్వనులతో నెట్లు గానముసేయుచున్నది? ఇంతటియానంద మీతెల్లనిపింతచీకటులయందున్నదా? ఓపతితపావని! భాగీరథీ! భగీరథుని సఫల మనోరథుని జేయు, స్వర్గమునుండి భూలోకమునకే తెంచితివి. ఈనా, మరుహృదయమున కట్టి భక్తి విశ్వాసము లొసంగుము. నేను నిన్ను తల్లీతల్లీ యని పలుకుచుండ నీవు తరంగరూపమున నటించుచుంటివి .........ఇది యేమి?.........(చాణక్యుఁడు మోహావశమున నధీరుఁడగు చున్నాఁడు.) ఏమిరా! చాణక్యా! వెంగలివై పలువరించుచుంటివి—లోనికేగుము. (అని గవాక్షమూయుచుండఁదెరలో సంగీతనినాదము వినఁబడును.)

చాణ—(తెరవైపుజూచి) ఎవరది? లోనికి రావచ్చును.

(అంత నొక బాలికతో నొక భిక్షుకుఁడు ప్రవేశించి) తండ్రీ! భిక్ష! భిక్ష!

చాణ—(బాలికఁజూచి భిక్షుకునితో) ఓయీ! ఇంతరాత్రి వేళనా భిక్షకు వచ్చుట?

భిక్షు—సాయంకాలమగునప్పటి కీనగరము బ్రవేశించితిని. మూఁడు దినములనుండియుఁ దిండిలేదు తండ్రీ!

బాలిక—తండ్రీ! ఆఁకలి. ఆఁకలి.

చాణ—(తనలో) ఈబాలికఁ జూచినంతనే మనోవికారముఁ గలిగిన దే? కారణము? (బాలికతో) తల్లీ! ఇటురమ్ము.

బాలి—(చాణక్యుని సమీపమున కేగును.)

చాణ—(బాలికఁ జేరఁదీసి) భిక్షుకా! ఈబాలిక నీ కూఁతురా?

భిక్షు— అవును. తండ్రీ!

చాణ—(నిట్టూర్పుతో) బాలికా! నీపేరు?

బాలి—మధు—

చాణ—మీయిల్లెచ్చట ?

బాలిక—చాల దూరము—లేదు. లేదు. మాకిల్లు లేదు.

చాణ—పాడఁగలవా ?

భిక్షు—బాగుగఁ బాడఁగలదు.

చాణ—ఇంచుక విశ్రమించి పాడుము.

భిక్షు—పాడుటవలన మాకేమి కష్టముండును? తల్లీ! పాడుము. (అని యిరువురుఁ బాడుచుందురు.)

చాణ—(తనలో) ఆనాఁడిట్టి వెన్నెలయే యుండెను. అప్పుడు చంద్రుఁడు మబ్బుమఱుంగున డాగియుండెను. చల్లనిగాలికి దీపమారిపోయెను. అహహా! తలంచినంత హృదయము వ్రీలుచున్నది. నాకుమారిక—నామోహదాయిని—ఇదియేమి చాణక్యా? మోహాంబుధిలోఁ గ్రుంకుచుంటివి—(ప్రకాశముగ) భిక్షుకా! ఇఁక పాటచాలింపుము. ఈధనముఁ గైకొనుము. శీఘ్రముగఁ బొండు. మఱి నిలువవలదు. వెడలుఁడు—ఊఁ—

(అని నిష్క్రమించును.)

(భిక్షుకుఁడు బాలికయు నాశ్చర్యముఁ జూపుచు నిష్క్రమింతురు.)

ద్వితీయదృశ్యము. స్థానము:—పాటలీపుత్రములో నొకసౌధము.
కాలము.—రాత్రి; మురయు చంద్రకేతువు ప్రవేశించుదురు

ముర—చంద్రకేతూ! నేడు చంద్రగుప్తుడు దాక్షిణాత్యము గెల్చివచ్చుచున్నట్లున్నది, పట్టణములో నుత్సవము లేకున్న దేమి?

చంద్రకే—మహామంత్రి నిషేధించెను. విశేష కారణముండవలెను.

ముర—చంద్రగుప్తుని విజయమున కీసువహించెనేమో?

చంద్రకే—అట్లుతలంపరాదు.

ముర—వాద్యధ్వని వినబడుచున్నది. చంద్రగుప్తుడు వచ్చుచున్నట్లున్నది పైనుండి వీక్షించెదను. (అని నిష్క్రమించును.)

చంద్రకే—నేడు నాకెంతటియానందము. చంద్రగుప్తా! గతజన్మంబున మనమిరువురము సోదరులమైయుండవలెను:

(తెరలో) శ్రీరాజాధిరాజ రాజమార్తాండ మగధభూపాలునకు జయము జయము. దిగ్విజయము.

చంద్రకే—ఆ—వచ్చుచున్నారు.

(అనంతరము రక్షకభటులతో చంద్రగుప్తుడు ప్రవేశించును.)

చంద్రకే—బంధూత్తమునకు సుస్వాగతము. (అని కౌగిలింపబోవును.)

చంద్రగు—(కోపముతో) చంద్రకేతూ! నాయాజ్ఞ బాలించితివా?

చంద్రకే—పాలింప బ్రయత్నించితిని. మహామంత్రి నిషేధించెను.

చంద్ర—అవును, నేననుమానించినట్లయినది. చంద్రకేతూ! మగధదేశాధీశ్వరుడు చాణక్యుడా, చంద్రగుప్తుడా?

చంద్రకే—బంధూత్తమా! శాంతించివినుము

చంద్రగు—ప్రత్యుత్తరము. మగధ దేశాధీశుఁడెవఁడు?

చంద్రకే—చంద్రగుప్తుఁడు.

చంద్రగు—మంచిది. మంత్రిఁబిలిపింపుము.

చంద్రకే—బంధూత్తమా! విశేషకార—

చంద్రగు—వినఁదలంచుకొనలేదు. నేనిప్పుడే యాతని యుద్యోగమునుండి తొలఁగించెదను.

చంద్రకే—అతఁడు చెప్పునది యేమన,

చంద్రగు—అతఁడు స్వయముగ వచ్చి చెప్పవలెను ఇప్పుడు నిశ్చయముగావలెను. మగధ దేశాధీశ్వరుఁడెవఁడు? చాణక్యుఁడా? చంద్రగుప్తుఁడా?

చంద్రకే—శాంతించివినుము

చంద్రగు—చంద్రకేతూ! నన్నుఁ దిరస్కరించెదవా? వెడలుము.

చంద్రకే—మంచిది. (అని నిష్క్రమించును.)

చంద్రగు—ఈబ్రాహ్మణుని దంభము, సంరంభము, నాధైర్యశిఖరము నతిక్రమించుచున్నది. నాపై నిర్వ్యవహించునా? ఆశ్చర్యము ఉద్యోగవిముక్తుఁ జేయకతప్పదు. తానాడినదేయాట, పాడినదే పాట. నేనెవండను? సేవకుఁడనా? ప్రభువునా?

(అనంతరము చంద్రకేతువు. చాణక్యుఁడు ప్రవేశించుదురు.)

చాణ—చంద్రగుప్త మహారాజుగారికి జయమగుఁగాక.

చంద్రగు—(నమస్కరించి) మంత్రివరా! నేనాజ్ఞాపించినది నిషేధింపఁగారణమేమి?

చాణ—అవును. నిషేధించితిని. కారణమున్నది. నీవడుగరాదు. నేఁజెప్పరాదు.

చంద్రగు—(ఇంచుకమాత్రపడి) నాకుఁగావలసినది కారణము.

చాణ——అవును. ఎఱుంగుదును. కారణమునకిదితరుణముగాదు చెప్పినప్రయోజనము లేదు. నేనాలోచించియే కార్యములఁ జేయుదును.

చంద్రగు——వెంటనే కారణముఁ దెలియఁజేయవలెను.

చాణ——కారణమెఱుంగుట కిదితరుణముగాదు. నేను చెప్పను.

చంద్రగు——మగధదేశాధిపతి యెవఁడు?

చాణ——(మందహాసముఁ జేసి మౌనముఁ బూసియుండును.)

చంద్రగు——మంత్రీ! ఈయౌద్ధత్యము సహింపఁజాలను. నేనిందుఁగూర్చి విచారింపవలసియుండును.

చాణ——చంద్రగుప్తా! అనవసరముగ నుత్తేజితుఁడవగుచున్నావు ప్రకృతికిరమ్ము. (అనిపోవుచుండ.)

చంద్రగు——మంత్రీ!

చాణ——ఎందుకు?

చంద్రగు——ఈరాజ్యమున కధిపతి యెవఁడో నిశ్చయముగావలెను.

చాణ——నిశ్చయించుట కేమున్నది. మహారాజు చంద్రగుప్తుఁడు.

చంద్రగు——ఎట్లగును? నిజగృహంబున భృత్యుఁడనై యున్నాను. మంత్రిచాణక్యుఁడు రాజాధిరాజై పాటలీపుత్రమును నిశ్చింతగఁ బాలించి రాజ్యభోగములనుభవించును. చంద్రగుప్తుఁడు మహారాజ నామమాత్రుఁడు. భారతవర్షమంతయుఁ జాణక్యునికీర్తించును. చంద్రగుప్తుఁడు కీలుబొమ్మయైయుండును. మహారాజగు చంద్రగుప్తుఁడు చాణక్యునిఁ బూజింపవలెను. చాణక్యుఁడు చంద్రగుప్తునాజ్ఞను పదాఘాతమునఁ దృణీకరించును. నేను సహింపఁజాలను. మన యిరువురకు నెట్టి సంబంధముండరాదు.

చాణ——శ్రీవారియాజ్ఞ. చాణక్యున కేలినవారి మంత్రిపదముతోఁ బనిలేదు.

చంద్రగు — మంత్రిపదచ్యుతుఁడ వైనట్లు పత్రమొసంగవలెను.

చాణ — పత్రము నొసంగవలనుపడదు. పత్రమూలమున నాకీయుద్యోగము లభింపలేదు. నేనీయుద్యోగ మభిలషింపలేదు.

చంద్రగు — (సైనికులఁజూచి కోపముతో) మూర్ఖులారా! చూచుచున్నా రేమి? చాణక్యుని బంధింపుఁడు.

(సైనికులు మౌనమువహించి చూచుచుందురు.)

చంద్రగు — చూచుచున్నా రేమి? ఊఁ —

(సైనికులు సమీపింపఁబోవుదురు)

చాణ — (సైనికులఁజూచి తాళుఁడని సంజ్ఞజేసి) శూద్రునకింత కోపమున నవసరము............ చంద్రగుప్తా! నీమంత్రిత్వముతోఁ బనిలేదు. (అని ముద్రికల నొసంగి) చాణక్యుఁడు విలాస పురుషుఁడని తలంపకుము. చాణక్యుఁడీ తుచ్ఛభోగముల నభిలషింపఁడు. ఆతని యాహారము తండులములు. శయనము మృగచర్మము. నీరాజ్యచింత చే, రాత్రులయందు నిద్రలేక. తీవ్రమస్తిష్కముతో కుటీరప్రాంగణమునఁ దిరుగుచుందును. నీవే యెఱుంగుదువు. నీరాజ్యముతో నాకుఁ బనిలేదు. నీరాజ్యము నీవే పాలించుకొనుము నేనుపోవుచున్నాను— (గమనోన్ముఖుఁడై తిరుగవచ్చి) ఇంచుక చెప్పవలసియున్నది. నందునివృద్ధమంత్రి తంత్రమూలమున, విద్రోహులు ప్రకాండయంత్రము నిర్మించిరి. నేటిరాత్రి యుత్సవసమయమున నగరము నాక్రమింపఁదలంచిరి. మఱియుఁ గొందఱు నీశయనగృహంబున, సొరంగముత్రవ్వి నిన్నువధింప నుద్యమించిరి. నేను సైనికులఁ బంపితిని. (అని పోవుచునుఁదిరుగవచ్చి) మఱియునించుక చెప్పవలసియున్నది—విజయశీలుఁడగు సెల్యూకసు, సింధునదమునతిక్రమించి సమీపించుచున్నాఁడు. శత్రువులు నలుగడల వ్యాపించుచున్నారు. అందుచే మహోత్సవమున కిదితరుణముగాదని నిషేధించితి—ఇఁక నీయిష్టము (అనిపోవుచుండ.)

చంద్ర—(చాణక్యుని పాదములపైఁబడి) గురుదేవా! క్షమింపుము.

చాణ.—ఉద్యోగముఁ ద్యజించినయనంతరముస్వీకరింపఁదగదు.

(అనినిష్క్రమించును.)

చంద్రకే—బంధూత్తమా! చాణక్యుని శాంతింపఁజేయుము.

చంద్రగు—చాణక్యుఁడు లేని స్థలమున రాజ్యపాలనము లేకున్నదా? నేఁడు నేను బంధవిముక్తుఁడనైతిని.అతనికింత యహంకారమా?

చంద్రకే—నామాటవినుము. బ్రతిమాలిశాంతింపఁజేయుము.

చంద్రగు—చంద్రకేతూ! నీవు నాకేమియుఁ జెప్పనక్కఱలేదు. అతనిపలుకుబడితో నాకుఁ బనిలేదు. సోదరునిఁగాపాడుటకునైన నాకుశక్తిలేదు. నామమాత్రమునకు రాచఱికముఁ గలవాఁడనైతిని. ఇంతకంటె సరళదాస్యము మేలుగదా?

చంద్రకే—గురుదేవుని కార్యాచరణము మంగళదాయకమగుఁగదా?

చంద్రగు—నాకు మేలగుననియే కాఁబోలు నాసోదరునిఁ జంపించెను

చంద్రకే—సింహాసనస్థుఁడవగు నీవతని ఋణస్థుఁడవు.

చంద్రగు—ఏమీ! ఋణస్థుఁడనా? అప్రియము లాడ నేర్చితివా?

చంద్రకే—అప్రియమైనను సత్యమాడుటయందధికారమున్నది. బంధుత్వము సమానభాగముపైనుండును. నియెడల నాకెట్టిస్పర్ధయులేదు. కొన్నికారణాంతరములచే నేనిప్పటికి సెలవుగైకొనుచున్నాను. ఇంచుక చెప్పవలసియున్నది.విపత్కాలమున నేను నీయాధికారమును వంచించి మెలఁగినవాఁడఁగాను. ఇఁక మునుమున్నెపుడైన మహారాజు నాసాయముఁగోరినఁ దోడ్పడవలసినవాఁడనని మాత్రము చెప్పి నేఁ బోవుచున్నాను— (అనినిష్క్రమించును.)

కాత్యా—భయపడవలదు. చంద్రగుప్తుని విపత్తులుకొందఱు న్నారు. వారు నిశ్చయముగఁ దోడ్పడుదురు.

సెల్యూ—అదెట్లు నిశ్చయింపవచ్చును ?

కాత్యా—నేను చారులవలన గ్రహించియే నిశ్చయించితిని. చంద్రకేతున్ర సైన్యము స్వదేశమున కేగెను. వారు సహితము మనకుఁ దోడ్పడినఁ దోడ్పడవచ్చును మనకిది మంచితరుణము.

(అంతసత్వరముగ హేలేనప్రవేశించి) ఛీ! బ్రాహ్మణాధమా! ఎల్లఱు నినుఁబోలువిశ్వాసఘాతుకులని విశ్వసింపకుము.

సెల్యూ—హేలేన ! నీవిపుడిచటికేల రావలెను ?

హేలే—నేనీసమీపముననే పఠించుచుంటిని. నడుమ నడుమ, నీబ్రాహ్మణుని నీచవాక్యములు నాకువినఁబడెను. కుతూహలమునఁ బుస్తకము విడిచి సర్వము వినుచుంటిని. ఈబ్రాహ్మణుఁడు కేవలము విశ్వాసఘాతుకుఁడు.

కాత్యా—ఆఁ—నేనా ? —విశ్వా

హేలే—అవును. నిశ్చయముగనీవే, రాజద్రోహివై, స్వజాతివినాశమునకుఁ బాల్పడి,యీ జన్మసిద్ధమగు స్నేహమును త్యజించి,యాతతాయివై, శాంతిక్షేత్రముపై రక్తము ప్రవహింపఁజేయఁదలంచితివి. నీవు నీజాతికి శత్రుఁడవు. లోకద్రోహివి. నియమశృంఖలము నుండి బాహ్యుఁడవై, ధర్మమునకు విరోధివై నాజనకుని జిగీషవహ్నిని వాయువుఁబోలి ప్రజ్వలింపఁజేయుచుంటివి. ద్వివిధప్రకాండసభ్యజాతులకు నడుమఁ బరిఖఁ ద్రవ్వుచుంటివి.

దేశద్రోహి—నీకు నరకమునందైన స్థానము లేదు.

కాత్యా—కాని పాణిని చెప్పునది యేమనఁగా,

హేలే— పాణిని వ్యాకరణము.

కాత్యా—అందు సహితము వేదాంతసారమున్నది.

హెలే— నీవు కేవలము మూర్ఖుఁడవు. దూరముగనుండుము. కర్మచండాలుఁడవు.

కాత్యా—ఆఁ—అంతమాట వద్దు. (అనినిష్క్రమించును.)

హెలే—తండ్రీ! నేనిబ్రాహ్మణుని తోడ్పాటున నించుకంత సంస్కృతమభ్యసించితిని. ఇతఁడింతటి పాపాత్ముఁడని తలంచియుండలేదు. అక్లైటెంగియున్నఁ దత్క్షణమే పొమ్మని చెప్పియుందును. ఏమాశ్చర్యము ఎంత ఘోరము—బ్రాహ్మణులయందు సహితము దేశద్రోహులున్నారు.

సెల్యూ—హెలేన! నిన్నుఁగన్నతల్లి సభ్యజాతి యవనస్త్రీయా, లేక బర్బర ?

హెలే—నాతల్లి మహాదేవి.

సెల్యూ—నీవామెకు పుత్రికవై యవనగౌరవము లాఘవముఁ జేయుదువా ?

హెలే—యవన గౌరవము విశృంఖలముగ నత్యాచారమునకుఁ బరిణమించునా? మనగౌరవమును స్థాపించిన—ఇరోపిడసు—పిడియసు—సఫోక్లెసు—ఇరోడోటాసు, మఱియుంగల మహానుభావులు గ్రంథకర్తలైయిరోపాఖండమున నక్షత్రములవలె వెలుంగుచున్నారు. వారలఁబోలి, భారతవర్షమునందు సహితమూర్ఖయుగమున నెందఱో మహానుభావులు ప్రకాశించిరి. గ్రీసు; భరతవర్షము, సంధ్యాసమయ సూర్యపూర్ణచంద్రులవలెఁ బ్రాచ్యప్రతీచ్యాకాశముల విభాగించినవి. వారిసంఘాతము ప్రళయమునకుఁ గారణము. ఇంతకు, యుద్ధపర్యవసానము కేవలము హత్యయేగదా ?

సెల్యూ—ఏమనుచుంటివి ? మిల్టియిడిసు, లియుండసు, వీరిరువురునిట్టిహత్యల కుద్యమించి యుండరా ?

హెలే—వారు స్వదేశరక్షణార్థమై హత్యలను బూనుకొని రి శాంతిని రక్షింపఁదలంచి, యట్లుద్యమించిరి.

సెల్యూ—నే నీమాట విశ్వసింపఁజాలను

హెలే—తండ్రీ! ఆత్మరక్షణార్థ మనివార్యమైన పోరాడవచ్చు గాక. శాంతిఁగా పాడుటకుమారు, శాంతిభంగమునకుఁ బోరాడరాదు. ఒకజాతి సుఖముగ శాంతికోరుచుయున నిద్రించుచుండ, వానిదరికు భంగముదలంపవచ్చునా? ఇది సభ్యజాతికుచితమైనదా? ఇంచుక యాలోచింపుము.

సెల్యూ—నేనుకన్యకా వాచాలత్వమువినఁగోరను. బాల్యమున నీపలుకులువిని సంతోషించితిఁగాని, యీవృద్ధత్వమున, నీపలుకులు నాకు రుచింపకున్నవి. "అరిష్టాటిలు" చెప్పునదియేమనఁగా,

హెలేన—ఓహో! అరిష్టాటిలు వాక్యసారము, పాశ్చాత్యాధ్యాత్మికవ్యాఖ్యయు సంగమించినవి శాంతిక్షేత్రమును దహింప నుద్యమించినవి.

సెల్యూ—హెలేనా! అట్లనుచుంటివేమి?

హెలే—నీయహంకారము, కాత్యాయనుని విద్రోహము, కలసి మెలసి, నదనదీపర్వతసముద్ర భూభాగముల విభజింప విజృంభించుచున్నవి.

సెల్యూ—పొమ్ము. నీమాటలవినరాను. (తెరవైపుఁజూచి) ధాత్రీ! నీవు నాకుమారి ననుసరించి యుండుము. హెలేనా! లోనికేగుము. (అనినిష్క్రమించును.)

హెలే—(చింతించుచు) హింసాసర్పము సహస్రఫణములతోఁ బరుగిడి వచ్చుచున్నది. అనివార్యము. గత్యంతరము లేదు.

(అని నిష్క్రమించును.)

చతుర్థదృశ్యము. స్థానము:- చంద్రగుప్తునిప్రాసాదము. కాలము:- రాత్రి.

(ఏకాకియై చంద్రగుప్తుఁడు ప్రవేశించును.)

చంద్రగు—తుదకు నాప్రజయు, సైన్యము, శత్రువులతోనే కీభవించినట్లున్నది. అంతట శత్రువులు నిండియుండరక్షణమెట్లుండును. హితముఁగోరువారిని రాజ్యమునుండి వెడలించితిని. ఇఁకచేయవలసినదే మున్నది. "హా చంద్రగుప్తా! నీవింతటికృతఘ్నుఁడవా? నీకాశ్రయ మొసంగి సైన్యమొసంగి నీకొఱకు ప్రాణములనైన నర్పింప సిద్ధముగ నుండిన వానిని నిన్నన్నివిధంబులఁ గాపాడి, సింహాసనముపైఁ గూర్చుం డఁ బెట్టిన గురుదేవునిఁదిరస్కరించెదవా? సామ్రాజ్యము నశించుఁగా క. నాకీ యుద్ధముతోఁ బనిలేదు. మగధసామ్రాజ్య మాకాశహర్మ్య ముఁబోలిశూన్యమైనది.

మ. కడఁ రీతిఘటిల్లె; భూవరుఁడనన్ గర్వంబుచే నేఁ గృత
ఘ్నుఁడనై చేసినచేఁతకున్ ఫలముచే కూరెన్; విచారాబ్ధిలోఁ
బడి దిక్కేమియుఁ గానకుంటి; గురుదేవా! చంద్రకేతూ! సఖా!
జనుఁడన్ ధూర్తుఁడఁ జంద్రగుప్తుఁడనుపశ్చాత్తాపసంతప్తుఁడన్"

(అంతనొక సైనికుఁడు ప్రవేశించి) జయము, జయము. మహారాజా! దుర్గ దక్షిణప్రాకారము భగ్నమగుచున్నది.

చంద్రగు—మంచిది. పొమ్ము. ఏమట్లు చూచుచుంటివి. పొమ్ము.

సైని—శత్రుసైన్యము దుర్గము భేదించి ప్రవేశించుచున్నది

చంద్రగు—సంతోషమే. పొమ్ము.

సైని—(నిష్క్రమించును.)

చంద్రగు—నాకు యుద్ధముతోఁబనిలేదు. నేఁగావించిన యప చారమునకుఁ బ్రతిక్రియయాత్మహత్యయే.

(అంతమఱియొకసైనికుఁడు ప్రవేశించి) మహారాజా!

చంద్రగు—ఎవఁడవురానీవు. వేగమేపొమ్ము.

సైని—శత్రు—

చంద్రగు—శత్రువెవఁడు; మిత్రుఁడెవఁడు? అందఱుశత్రువులే. అందఱు మిత్రులే. రానిమ్ము; పోనిమ్ము.

సైనికు—(తనలో) ఇదేమిగ్రహచారమురా ? (అనినిష్క్రమించును.)

చంద్రగు—సర్వము శత్రుమయము. ఈవిపన్నది నతిక్రమించుటెట్లు? కర్ణధారుఁడెవఁడు? ఈనదీతరంగము లుత్తుంగములై డోలాయమానములగుచున్నవి. ఇఁకపైఁబడును. మునుంగుటకు సిద్ధముగనున్నాను. చేయఁదగిన దేమున్నది?

(మఱియొక సైనికుఁడు ప్రవేశించి)మహారాజా!

చంద్ర—ఎవఁడామహారాజు. అట్టివాఁడెవఁడును లేఁడుపొమ్ము.

సైనికు — (తెచ్చెవడి)చిత్తము. (అనినిష్క్రమించును.)

(తెరలో కల కలధ్వని)

చంద్రగు—ఇది యేమి? తూర్యధ్వనియా? కాదు. కాదు. యుద్ధకోలాహలము. యుద్ధమా? ఎవరితో? ఓచంద్రగుప్తా ! నీవుజీవించియున్నావా? చచ్చితివా? నీవీధ్వని వినియు నిర్జీవప్రతిమఁబోలి గృహమునఁగూర్చుంటివేమి? నీసైన్యము నీకొఱకై పోరాడుచున్నవి. ప్రాణమర్పించుచున్నది. లెమ్ము. లెమ్ము. అగాధనైరాశ్యమహాంబుధిలోఁ బడిమునుంగనేల ? ఈశత్రుసేనా సమూహముపైఁ జెలరేగి పోరాడుము. ప్రళయమువచ్చిన వచ్చుఁగాక. మగధసామ్రాజ్యమునకు జయమగుఁగాక.

(అంత శీఘ్రముగ మురప్రవేశించి)చంద్రగుప్తా !

చంద్రగు—తల్లీ ! పోయెదను.

ముర—ఎచ్చటికి ?

చంద్రగు—యుద్ధమునకు. పోరాడిచచ్చెదంగానిమఱిబ్రదుకను

ముర—వత్సా! అంతవచ్చినహానియేమి? నీవువీరుఁడవు. పోరాడుము.

చంద్రగు—గత్యంతరము లేను. సర్వముశత్రుమయము.

ముర— అయినను—

చంద్రగు—మఱియేమియు లేదు. చావనిశ్చయించితిని. యుద్ధకోలాహల మెంత ఘోరముగనున్నది. (తెరవైపుజూచి) సైనికా!

సైనికు—(ప్రవేశించి) జయము. జయము.

చంద్రగు—నేనిప్పుడే యుద్ధమునకు వచ్చుచున్నానని తెలియఁజేయుము.

సైనికు—మహాప్రసాదము—(నిష్క్రమించును.)

(తెరలో) చంద్రగుప్తమహారాజునకు జయము జయము.

చంద్రగు—ఇదియేమి? జయమా? శత్రువుల వ్యంగ్యజయధ్వనియా? చంద్రగుప్తునకు జయమెట్లు లభించును! అభయమొసంగుటకు గురుదేవుఁడు లేఁడే? పోరాడఁగల మహావీరుఁడు చంద్రకేతువేడీ? అరెరే! ఆధ్వని సమీపించుచున్నదే? వినఁబడుచున్నదే? ఎవరిదీ కంఠస్వరము. పరిచితస్వనముఁ బోలియున్నదే? వీరెవరైయుందురు. నిరీక్షించెదఁగాక.

(అనంతరము రక్తవస్త్రములతో జంద్రకేతువు, ఛాయయుఁ, జాణక్యునితోఁ బ్రవేశించుదురు

ముర—(చాణక్యుని పాదములపైఁబడి) గురుదేవా! రక్షింపుము.

చాణ—భయమేమియును లేదు. లెమ్ము-చాణక్యుఁడు సర్వము నిర్వహింపఁగలఁడు చెప్పినమనుజునిమాత్రము బ్రతికింపఁజాలఁడు. చ

ద్రగుప్తా! నిరుత్సాహ మొందకుము. సర్వమనుకూలముగ నున్నది. ఇప్పుడే యుద్ధమున కగ్రేసరుఁడవై నిలువుము. యవనవిజయము చాణక్య తంత్రమహాగ్ని హోత్రమునకు భస్మమైనది.

చంద్రకేతు—బంధూత్తమా! ఏమట్లు చూచుచుంటివి? మన యిద్దరి వక్షములపైఁ బర్వతము బడినను చూర్ణమగును.

చంద్రగు—బంధూత్తమా! క్షమింపుము. (అని కౌఁగిలించుకొనును.)

చాణక్యు—విళంబమునకు వేళ లేదు. రండు. రండు.

(ఎల్లరును నిష్క్రమింతురు.)

పంచమదృశ్యము. స్థానము మగధదేశమునఁ జంద్రకేతువు మందిరము.

(కాలము—రాత్రి, చెలికత్తెలతో ఛాయ ప్రవేశించును.)

ఛాయ—ఆడుఁడు; పాడుఁడు నేఁడు; నేను సహితము మీతో నేకీభవించెదను. చంద్రగుప్తమహారాజు సెల్యూకసు జయించెను. ఏమానందము.

ప్రథ—సఖీ! నీవెవనిఁ గూర్చి జయగానముఁ బాడుచున్నావో యాతఁడు వినునా? ఆనందించునా?

ఛాయ—నా గానమునకు నేనె యానందింపఁగలను. ఎవరియానందము వారిది.

మ॥ వనభాగంబునఁ బంచమస్వరమునన్ వాసంతవేళన్ పికం
బనురక్తిన్ సహియించి పాడుఁ దనలో నానందముప్పొంగ; నె
వ్వని మోదంబునకై మరుచ్చలితమై వల్లీదళం బాడుఁ? దా
ననుకూలించి యొకర్చు కార్యమునఁ దా నానందమున్ బొందెడున్

ద్వితీయ—నీవాతనిఁ బ్రేమించుచుంటివిగదా? నీవాతనినుండి ప్రతిదానముఁ గోరుదువా?

ఛాయ—నా ప్రేమయే నాకు సంపత్తి. ప్రేమామృతమున స్నానమాడుచున్నాను.

ప్రథ—ఆతఁడు నన్నుఁ బ్రోచుచున్న నీవాతని ప్రాణంబుల రక్షించితివి. సంజీవనమును నీవు లక్షింపకుంటివి.

ఛాయ—చెలీ! ఎల్లప్పుడు నాతని చరణదాస్యమును సాహచర్యమభిలషించును. ఆతనికుపాయనంబుగ నొసంగఁదగిన దేమున్నదను విచారము నన్ను బాధించుచుండును.

ద్వితీ—పాపము. ఇచ్చుటకు నీకేమున్నదే?

ఛాయ—రూపము.

ప్రథమ—నీకు రూపము లేదనిన వారెవరు?

ఛాయ—నాకట్టిరూపమున్న నన్నతఁడు వీక్షింపకుండునా?

ద్వితీయ—రూపములో నేమున్నది? సర్వము మించిన నీయమూల్యహృదయము చాలదా?

ఛాయ—పురుషునకుఁ బ్రత్యక్షమగునది రూపమేగదా?

ప్రథ—పురుషులు కేవలము మూఢులు.

ఛాయ—(నిట్టూర్పువిడిచి) మీరు నన్ను దుఃఖింపఁ జేయుచున్నారు. లేదు, లేదు. నేఁడు మహోత్సవము. ఉత్సవమొనర్పుఁడు. ప్రత్యూషకాల భాస్కరుని తేజఃపుంజము మీ జాగ్రన్ముఖమండలములపైఁ బడకుండునప్పుడే, పక్షుల కలకలధ్వనులు, క్షీణించిన మీ కంఠస్వరముల ధిక్కరింపనప్పుడే, మీ గాననైపుణ్యముఁ జూపుఁడు.

ద్వితీ—చంద్రగుప్తుని వలచినదానవు నీవు. పాడవలసిన వారము మేము. (అంత మురళ ప్రవేశించి) ఛాయా! ఛాయా! ఉత్సవమున మునింగియున్నావు. (తనలో) ఆహా! చంద్రకేతువు రణరంగమున మృతుఁడైనట్లు లీమె యెఱుంగదు. నేనెట్లెఱింగింపఁగలను? (ప్రకాశ) ఛాయా!

ఛాయ—(చమత్కృతయై) ఎవరది? (మురఁజూచి, ఓహో!

ముర—ఛాయా! విశేషమున్నది.

ఛాయ—విశేషమా?

ముర—అవును. నేఁటికి నాజీవనము సార్థకమైనది. (అని కౌఁగిలించుకొని) నీవు నాకోడలవు. భరతవర్షమునకుఁ గాఁబోవు చక్రవర్తినివి.

ఛాయ—ఆఁ ............ఆఁ ............తగను. తగను. చంద్రగుప్తుని పత్నీత్వమునకు ఛాయతగదు. చంద్రగుప్తుఁడు చక్రవర్తి యగుఁగాక. నేఁతని చరణదాసినై యుందును.

ముర—ఛాయా! నేను పరిహాసించుచుంటినని యూహింపకుము! నేను నిశ్చయముగ నంశమునే తెలియఁజేసితిని.

ఛాయ—(స్వగతము) ఆఁ—నిశ్చయమా? స్వప్నగత సౌభాగ్యమా? ఆహా! ఎంతటియాకస్మికానందము, ప్రకాశ) అబద్ధము నేను విశ్వసింపఁజాలను, (అని మురవక్షముపైఁబడి దుఃఖించును)

ముర—ఛాయా! దుఃఖమున కిదితరుణమా?

ఛాయ—ఏమీ? నేను దుఃఖించుచున్నానా? పుష్పవృష్టి కురియుఁగాక. ఇదియేమి?ఆకాశము స్నిగ్ధముగఁ గానవచ్చుచున్నది. మఱియుగాఢముగ గంభీరముగ నున్నది! అఁ—ఆఁ ఆమఱియు నుజ్వలమగుచున్నది ఆహా! ఏమిసౌభాగ్యము? వసుంధరయు మందారసౌరభము గుప్పుచున్నది! వాయువు సహితమపూర్వ సంగీతనినాదసౌఖ్యమొసంగుచున్నది. ఇది భూలోకమా? స్వర్గమా? అహా! నాప్రాణాధికుఁడు చంద్రగుప్తుఁడు అవును. అవును. హా! ప్రాణేశ్వరా! (అని మోకరించి) ప్రాణేశ్వరా. మన్మథసామ్రాజ్య చక్రవర్తి!...............ఇదియేమి? స్వప్నమా? (అనిమురఁగౌఁగిలించుకొనును.)

(అంత చాణక్యుఁడు ప్రవేశించి) ఇదియేమి?

ముర—విజయోత్సవము.

ఛాణ—ఓహో! అట్లనా? (ఛాయను నిదానించి) కుమా! సంధియైనది సంధిపత్రముల క్రింద సంతకములు మాత్రము లేవు.

ముర—సంధి యేవిధముగ?

ఛాణ—చంద్రగుప్తమహారాజు సెల్యూకసునకు ౕ00 గజముల నిచ్చుటకు ప్రతిగ సెల్యూకసు హిందూకూషుపర్వతముల కుదక్షిణమునతూర్పునఁగల సమస్తరాజ్యము నొసంగుటకు నీన ధపత్రముఁగా వ్రాయుట కై, సెల్యూకసు తనపుత్రికను చంద్రగుప్తుఁ కొసఁగుటకు నిశ్చయమైనది.

ముర—ఇదియేమి? గురుదేవా! నేనా మెఁగోరను. ఛాయయే నాకోడలు.

చాణ—వలను పడదు. ఇది చాణక్యతంత్రము. రాజ్యకళ్యాణ నిమిత్తము; ఛాయ తనస్వార్థమును బలియొసంగుఁగాక. (అని నిష్క్రమించును.)

ముర—ఛాయా! ఇదియేమి? పాషాణప్రతిమఁబోలియున్న దానవు. నేను నిర్భాగ్యను (అని నిష్క్రమించును.)

ఛాయ—స్వార్థము తుచ్ఛము. బ్రాహ్మణుఁడా! నీవేమెఱుంగుదువు? పురుషుఁడెట్లు గ్రహించును. స్త్రీజీవనమట్టిది. ఈశ్వరా! నీసంకల్పమిట్లున్నదా? తుదకిట్లు పరిణమించెనా! ప్రేమయు, మృత్యువు, స్వర్గము, నరకము మిళితములైనవి. పృథ్వియంతయు భ్రమించుచున్నది. పోఁగాక (అని నిష్క్రమించును.)





# ప్రతిజ్ఞాచాణక్యము.

## పంచమాంకము.

ప్రథమదృశ్యము—స్థానము: నందునిపూర్వప్రమదోద్యానము.
కాలము రాత్రి. (హేలేనతో సెల్యూకసు ప్రవేశించును.)

సెల్యూ.—అసభ్యుఁడగుచంద్రగుప్తునకు సెల్యూకసు తనకూఁతునొసంగునా! నేనునీకుసంధికెంతమాత్రమొడంబడఁ జాలను.

హేలే.—తండ్రీ! గర్వముతో—దురభిమానముతోఁ బనిలేదు, నీభుజాగర్వమణంగినది. లజ్జింపఁదగినసమయమిది.

సెల్యూ.—లజ్జింపనేల? ఆక్రమించుటలో విఫలమైనది

హేలే.—ఆక్రమించువారెవరు. ఈయపరాధము చంద్రగుప్తునిపైనున్నదా? ఆతఁడుమనతోవిరోధించెనా? సింధునది కావల పాలించుచున్న నీకీకన్నెఱ్ఱయేల? సహింపఁజాలక నీవుఢీకొనునప్పుడు నేను నిషేధింపలేదా? వినకున్నందుకుఫలమిది. మంచిపనియైనది.

సెల్యూ.—పరజాతివిజయమున కుల్లాసముఁ జూపుచుంటివి.

హేలే.—అవును, ఎవరైననేమి? ధర్మమే జయము. ప్రతిష్ఠితరాజ్యమునకు శాంతిభంగముఁగూర్చువాఁడు పాపాత్ముఁడగును. తల్లి

రెండఱు పుత్త్రహీనలుగా లేదు. బాలిక లెందఱు పితృహీనలైరి. సతు లెందఱుపతిహీనలైరి. ? శోపద్రవముఁగలిగించి. విజయగౌరవార్థమై యుద్ధముఁ తిల్పించి యెంతటిపాపమునకుఁ బాలైతివో యాలోచింపుము.

సెలు:— నేనుపాపాత్ముఁడనగుదుంగాక!

హెలే— అందుచే ఫలమనుభవించితివి.

సెల్యూ— జయాపజయంబులు. స్వభావసిద్ధములు. తిరుగ విముక్తుఁడనై —

హెలే— విజయశీలుఁడు పరునిదయనాశించునా? నీప్రతిజ్ఞయేమైనది. జయమో, మత్యువోయనిగదా? లజ్జింపవలదా? అధఃపతనము.

సెల్యూ— (మూర్ఛనుపడి) హెలేనా! ఈనాదుర్గతినీవలన నేసంభవించినది. పెంచి పెద్దఁజేసినమాతృహీనబాలిక నాకుఁబ్రక్క బల్లెమైనది. పరాజయశల్యమును నాహృదయమునఁ గ్రుచ్చిబాధించుచున్నదానవు. ఛీ! ఛీ! ఎందుకునాకీజన్మము (అనిదుఃఖించును.)

హెలే— తండ్రీ! దుఃఖింపవలదు నావలనదోషమున్న క్షమింపుము.

సెల్యూ— నాదేదోషము. నన్నేక్షమింపుము

హెలే— విశేషదుఃఖకారణము నట్లుంటిని. తండ్రీ దుఃఖింపవలదు. విముక్తిఁ జెందినయనంతరము ప్రతిక్రియకుఁ బూనుకొనవేని, చంద్రగుప్తునిపవామాడి నిన్ను విముదలఁజేసెదను.

సెల్యూ— ఆఁ! ఎంతమాత్రమట్లువలనుపడదు. ఆజన్మాంత మిట్లుండెదఁగాని, యసభ్యుని బెండ్లాడవలదు.

చంద్రగుప్తుఁడు ప్రవేశించి) వీరవరా! నీవిముదలకు వివాహమునకు సంబాధములేదు. యవనసామ్రాజ్యమా! నీవు బంధవిముక్తుఁడవైతివి. నీ

కు నాపైఁ గ్రోధమున్న నాచాణక్యుని నాక్రమింప నుద్యమింపవలెనన్న మీయిరువురకు వెడలుఁడు; మీ యిష్టమువచ్చిన స్థలమున కేగుఁడు.

సెల్యూ—అదియేమి ?

చంద్ర—సార్వభౌమా! హైందవు లసభ్యులని తలంపరాదు. వారుసహితము పౌరవునివలె నార్యకోటిలోఁ జేరినవారు. మీరు మీ దేశమునకు నిరాఘాటముగఁ బోవచ్చును. (తెరవైపుఁ జూచి) ఎవఁడచ్చట!

భటుఁడు—(ప్రవేశించి) ఆజ్ఞ

చంద్ర—వీరల సగౌరవముగ విడువుము. (అనిపోవుచుండ)

సెల్యూ—(ఆశ్చర్యముతో) భారతసార్వభౌమా! చంద్రగుప్తా! నీవు మహాపురుషులలోఁ జేరఁదగినవాఁడవు. నీవొకవ్వుడు నా ప్రాణదాతవు. నేను మఱచియుండలేను. ప్రత్యుపకారనిస్స్పృహతో నన్నిపుడు విడిచితివి. ఇదియు నటులునను నేఁగోలుపోయిన సామ్రాజ్యమున క్రియున్న జయించెదఁగాక. నీవు హైందవుఁడనగుటచే నాకుమారిక నీయఁజాలను.

హేలే—హైందవులు యవనులవలె మనుజులలోఁ జేరరా?

సెల్యూ—(కుమారిఁ జూచును).

హేలే—(తలవంచుకొనును).

చంద్ర—రాజకుమారీ! ఎట్టులగుగాక నాయెడ నీకుఁగల సన్మానమునకు కృతజ్ఞుఁడను. (సెల్యూకసుఁ జూచి) వీరవరా! నేను నీభిక్ష గ్రహింప నసమర్థుఁడను. కుమారిని గాఁగల ప్రేమసూత్రమునకు బద్ధుఁడనైతిని తాత్కాలికమని తలంపరాదు. నేనేదినమున, బాలయౌవనసంధితరుణమున, సింధునదతటమున, సంధ్యాసమయమున, నీముఖచ్ఛవిఁ జూచితినో, యాదినమునుండియు నీముఖమండలము నా హృదయాసీమను ముద్రితమైనది. మఱియు— శీఘ్రముగ ఛాయ ప్రవేశించి సార్వభౌమునకు జయము! భరతఖండాధిపతికి హేలేనయే తగియుండు

ను. ఈఛాయనునీయనుగ్రహసన్మానమునకుఁదగదు. (హెలేనఁజూచి) నీవు విశేషసౌభాగ్యవతివి. నీయందు చంద్రగుప్తున కధికానురాగమున్నది. అతనికి నేనొసంగఁదలఁచిన యీనాహృదయనిధి, నీహృదయనిధితోఁ గలసిమెలసి చంద్రగుప్తునిఁజేరుఁగాక. (అని హెలేనకరములతో చంద్రగుప్తునికరముల సమ్మేళనముఁ జేసి) భారతవర్ష సార్వభౌమా! ఈయబలారత్నము నీహృదయసీమ నలంకరించుఁగాక. ఈతరుణము మాకు గౌరవకారణము. ఇదియే శుభముహూర్తము. ఓమ్ శాంతిశ్శాంతిశ్శాంతిః—(అనివస్త్రములతోఁగనులఁగప్పుకొని ఛాయనిష్క్రమించును)

చంద్ర—(నిశ్చేష్టుఁడై) ఇదికలయా? కాదు. కాదు. (తెర వైపుఁజూచి) ఛాయా! నిలువుము. నిలువుము—

ఉ. కోపము నేల బాల! నినుఁ గోరినవాఁడను జూడవేల? నా
తాపముఁ బాపవేల? నినుఁ దాళఁగఁజాల; విరాళిదూల నీ
ప్రాపును గోరువేళ నను బాసితొలంగెద వేల? చేల! మే
లా? పరిపూర్ణచంద్రవదనా! లలనా! తగనా పరుండనా?

(అని సెల్యూకసుఁజూచి) సార్వభౌమా! నీకుశుభమగుఁగాక.
(అని హెలేనపై దృష్టినిగిడ్చి శీఘ్రముగనిష్క్రమించును.)

సెల్యూ—ఇదియంతయునేమి హెలేనా?

హెలే—నాకేమియుఁ దెలియదు.

సెల్యూ—నీవు చంద్రగుప్తుని పెండ్లాడనిశ్చయించితివా యేమి?

హెలే—నీయనుజ్ఞకై వేచియున్నాను.

సెల్యూ—అనుమతించెదను—సర్వముస్వప్నము. నేననుమతించుటయు స్వప్నము. (అనినిష్క్రమించును)

హెలే—తండ్రీ! నేనేలవివాహమాడఁ దలచితినో నీవెఱుంగవు. ఇంతవఱ నేనెల్లకాలమిట్లుందునా?

గీ. ఎల్ల యుంగోరుస్త్రీరత్న । మెంత కాల
మిట్టులోంటిదై నుండునూ । హింపవలదే?
తరుణిలతయును సత్కవి । తాకుమారి
యులరుఁబుష్పించు. మెలఁగుఁ; స । దాశ్రయమున,
(అని నిష్క్రమించును.)

ద్వితీయదృశ్యము. స్థానము:-చాణక్యునిగృహము. కాలము:-ప్రభాతము
(చాణక్యుఁడే కాకిమై ప్రవేశించును.)

చాణ.—ఆహా! ఏమియీసముద్రము? ఎంతదూరము నిదానించినను, తరంగ హీనమై, శబ్దహీనమై, యనంతమై, మృత్యువువలెస్థిరమై, గోచరించుచున్నది. (మెల్లమెల్లగ నడుచుచుదీర్ఘ నిశ్వాసమువిడిచి) క్షమ—స్నేహము—లేకుండుటచే నోర్వఁశక్యముగాకున్నది. స్నేహశూన్యమైనహృదయమునఁదమమావరించియున్నది. తీవ్రవిచారమునకు మస్తిష్కము ద్రవీభూతమై బాష్పరూపమున వెడలుచున్నది. (స్థిర నేత్రములతో దృష్టినిగిడ్చి) ఆహా! ఈప్రభాతమెంత రమణీయముగనున్నది.

సీ. చదలఁజీఁకటి చెల్లఁ । చెదరైనయంతన
నలుదిక్కులనుఁగాలు । తెలివివలన,
సత్సంతతినశింప । సత్పథచ్యుతిఁబొంది
వెల్లఁబాఱిన రాజు । విభ్రమమున,
నరుణ రేఖలఁబ్రాచి । నల్లల్లన వెలుంగు
సంధ్యనుపకించు । సంభ్రమమున,
నతిమందమైవీచు । నట్టిప్రాతఃకాల
వాతూలశీతల । స్పర్శనము

గీ. మేదినీదేవి మెల్లగ । మేలుకొనఁగఁ
బక్షులొనరించు కలకల । ధ్వనులకలన

నుల్ల మానందవారిధి నోలలాడి
యతులమోహంబు స్నేహంబు నంకురించె॥

ఆశ్చర్యము !                వాయవస్థ తుదకిట్లు పరిణమించినది. చూడంజూడ గ్రమక్రముముగ నాహృదయము మోహామునకు లోన గుచున్నది—మనోవికారముదయించుచున్నది—ఔరా !

గీ. వజ్రిఖని, ద్రవీభూతమై ప్రస్రవించె,
గండశైలంబు చిగిరించె, గగనవీధి
చూడసొంపుగఁబుష్పించె, శూన్యమైన
కఠినమరుభూమిఁ బాటె గంగా స్రవంతి.

"రాజనీతి, రాజనీతి" యని దాంభికంబున సంచరించి, నేఁ జేసిన మహాకార్య మెట్టిది ?

గీ. శూద్రసహవాసముం జేసి క్షుద్రమైన
రాజకార్యభారముఁబూని రాజసమున
సంచరించితిఁ దొలఁగితి సాత్త్వికంబు;
జాతిమాత్రుండ నత్యల్ప చేతనుండ.

క్రోధాగ్ని చల్లారినది ఇది బ్రాహ్మణునకు నుచితముకాదు కాసిమ్ము అయినదేదో అయినది. తాపాగ్ని మితి మీరినది ఈపరితాపమెట్లుజనించినది. జనించుటకుఁ గారణమేమి ? హృదయమునఁ గలబాధ యిట్టిదని నిరూపింప శక్యముగాకున్నది.—ఎంతలో నెట్టిస్థితికి వచ్చితిని—(నిట్టూర్పువిడిచి)ఆహా—బాగుగ నేయున్నది. రాక్షసోన్మాదము నశించినది. మనోవికారపిశాచమావేశించినది.

సీ. అతిగభీరంబగుస్వాంతాంబునిధివికా
రార్వాఁ లజ్వాల లాక్రమించి

దుర్గమంబగునాదు । దుర్బుద్ధివనముఁ
దావాగ్నిహోత్రంబు । తాండవించె
దయలేనినాదుహృ । దయకోటరమునఁబ
శ్చాత్తాపవహ్నిప్ర । జ్వలితమయ్యె
నాయాసమొందిన । నాయంతరాత్మన
త్యాచారపాపాగ్ని । యలముకొనియె

గీ. నకటనాకుమస్తిష్కంబు । వికలమొందె
కరఁగికనులఁగన్నీరయి । కారుచుండె
నెచటికేగుదుఁబ్రోచువాఁ । డెవఁడుగలఁడు ?
ఈమహాపరితాపమిం । కెట్టులణఁగు.

అబ్బ! అబ్బ!.........ఉస్సు (నిట్టూర్పువిడిచి) చాణక్యా! ధృతింబూనుము (అని తెరవైపుఁజూచి) ఎవరోవచ్చుచున్నట్లున్నది ......... ఎవరువారు? (అంతఁగాత్యాయనునితో రక్షకభటులు ప్రవేశించుదురు.)

చాణ—బంధుసత్తమా! రమ్ము.

కాత్యా—వ్యంగ్యసంభాషణముతో నేమి ప్రయోజనము. నేను నీకు బద్ధుఁడనైతిని. అన్యాయముగఁ బ్రవర్తించితిని క్షమింపుము.

చాణ—భటులారా! ఆతని బంధ విముక్తునిజేయుఁడు.

(భటులట్లొనరింతురు.)

చాణ—ఇపుడు మన యిరువురకు భేదములేదు.

కాత్యా—నాకు నలుగడల శస్త్రసమేతులగు భటులుండగా భేదము లేకేమి ?

చాణ—(భటులఁజూచి) మీరిఁక పోవచ్చును.

(భటులు నిష్క్రమింతురు.)

చాణ — బంధూత్తమా! మనకిపుడు భేదమేమున్నది?

కాత్యా — లేకేమి? నీ యానతిచే నాజీవిత మంత మొందఁగల ను. మఱియు నీవి విశాల సామ్రాజ్యమునకు సర్వమయకర్తవు.

చాణ — అట్లనా? మంచిది. నీవీయధికారఖడ్గముఁ గైకొను ము. నావక్షమునఁ జొనిపి, నీమంత్రిత్వముఁ బరిష్కరించుకొనుము.

కాత్యా — చాణక్యా! నీయభిప్రాయ మేమి?

చాణ — నేను సామ్రాజ్యమను మహారణ్యమును పరిష్కరిం చితిని. ఒకయామరక్షేత్రమును సర్వసంపన్నముగాఁ జేసితిని. ఇపుడీ విశాలసామ్రాజ్యమున భయసమన్వితమైన శాంతి యొప్పుచున్నది. వహిర్భాగమున భయభ్రాంతులయి శత్రువులు మెలఁగుచున్నారు. అయినను పధికులు రాజమార్గమునఁ దమ సంపదలవిడిచి నిర్భయము గ నిద్రించుచున్నారు. ఈశాంతి, పర్వతమువలె స్థిరముగఁ గన్పట్టినను నిర్జీవమైయున్నది. ఇపుడు వ్యతిరిక్తము నేనేమియుఁ జేయఁజాలను. నీవి మంత్రిత్వమునకుఁ దగుదువు. నాయీమంత్రిత్వకార్యభారమును నీవు ధరింపుము. నేనీయుద్యోగముఁ ద్యజించెదను.

కాత్యా — నీవు కౌటిల్యుఁడవు. నీభావమెఱుంగ నసాధ్యము.

చాణ — ఈనాజన్మదినముల స్పృశించి, నిష్కపటముగాఁబల్కు చున్నాను. నేనీముహూర్తముననే మంత్రిత్వముఁ ద్యజించుచున్నాను. నీవు మూర్ఖుఁడవగుదువుగాక. నీకు హృదయమున్నది. నీవు తగుదువు. నేనుతగను.

కాత్యా — ఓహో! బ్రాహ్మణప్రభుత్వము క్షమతాశిఖరము నధిష్ఠించినది.

చాణ — సర్వము మిధ్య. భ్రమ. హృదయము నుపవసింపఁ జేసి శాసింపరాదు. నాకఠోర శాసనముచే, క్షమ, స్వప్నప్రాసాదము వలె, నభ్రభేదియై, క్రమక్రమముగ గగనంబున లీనమయ్యెనని బోధ

మయ్యెను. నేను నివసించునది యిల్లుగాదు. మహారణ్యము. బ్రాహ్మణునికిమగటించినను, మంత్రిబలమున, పురముద్ధరింపవచ్చును. గటించిన బ్రాహ్మణ్యము నుద్ధరింపఁజాలము. శూద్రునినమ్మించి నాశింపవచ్చుగాని వానిహృదయమున, శుష్కించిన, భక్తిరసము తిరుగఁ బ్రవహింపఁ జేయఁజాలము. ఛీ! ఛీ! రాక్షసీ! కుటిలా! నన్నెచ్చటికిఁ గొంపోవు దువు. నేనేమి చేసితిని?

కాత్యా—ఏమిచేసితివి ?

చాణ—కాత్యాయనా! బౌద్ధారణ్యముద్భవించినది. నేను రాఁబోవునది యెఱింగితిని.

కాత్యా—అది యేమి ?

చాణ—ఈయఖండసామ్రాజ్యముపైఁ దిరుగ ప్రేతభైరవనృత్యము గాననగును. అనంతర మొకమహాశక్తి యావిర్భవించి యీసామ్రాజ్యశవమాంసపిండములను నూతనశక్తితో నుజ్జీవింపఁ జేయును. ఆహాహా! భావికాలము. క్రమక్రమముగ భరతవర్షము నశించును. నశించును. అబ్బ-అబ్బ-నేనసహింపఁజాలను. బ్రాహ్మణునకధఃపతనము-అధఃపతనము-కాత్యాయనా! నాయీమంత్రిత్వము నీవు గైకొనుము.

కాత్యా—ఏమూల్యమునకు నీవీయుద్యోగము నాకువిక్రయించుచున్నావు?

చాణ—నీబంధుత్వమునకే.

కాత్యా—నీయభినయము బాగుగానున్నది.

చాణ—అభినయముకాదు బంధుసత్తమా! నన్ను విశ్వసింపుము. దీనుఁడను. నేను కౌటిల్యుఁడనగుదు. నేర్పరినౌదు.మఱియు విచక్షణుఁడనగుదు. వివిధజాతులవారు నహితమట్లనుచున్నారు. ఈశ్వరుఁడనువాఁడు గలఁడేని, చాణక్యునిమహాసృష్టిని ముగ్ధదృష్టితోఁజూ

డఁజాలును. సర్వము నెఱవేర్చితివి. ప్రాణప్రతిష్ఠకుమాత్రము శక్తిహీనుఁడనైతిని. నాబుద్ధికి సంతసింపకుము. నాయీహృదయముఁజీల్చి పరిశీలింపుము. ఈహృదయ మేమని తలంచితివి? ఒక శుష్కమరుభూమి. దయ లేదు. మోహము లేదు. స్నేహము లేదు. విశ్వాసము లేదు. అట్టి యీహృదయమిట్లు నూతనరూపమునకుఁ బరిణమించుచున్నది. పరితాపమధికముగ బాధించుచున్నది--(అని త్రొమ్ము బాదుకొనును).

కాత్యా—ఏమాశ్చర్యము చాణక్యా! అధీరుఁడవైతివి. నీవు ర్ధమ తేజము, నీయతులప్రతిభ, నీతీక్ష్ణబుద్ధి—

చాణ—బుద్ధి—బుద్ధి—బుద్ధి—వింటిని చెవులు చిల్లులువోవుచున్నవి. ఎక్కడఁజూచిన నీమాటయే ప్రతిధ్వనించుచున్నది—అబ్బ!—చాణక్యున కెంతబుద్ధియున్నదని సమస్తప్రపంచము నిర్నిమేషవిస్మయమున నన్నుఁజూచుచున్నది. లోకభయముతో ధూమకేతువుఁజూచునట్లు నన్నుఁజూచును. ఛీ! ఛీ! ఇది మంచిది కాదు. అభిశాపము—అభిశాపము. ఈభయంకర కుటిలరాక్షసిఁ ద్యజించి శాంతించుట భావ్యము.

కాత్యా—చాణక్యా! నీవింతవిరక్తిఁ బొందితి వేమి?

చాణ—(కొంతదనుక మౌనము వహించి)......ఆహా! ఏమి యీప్రభాతము! భూదేవి వివాహకన్యకవలెఁ గన్పట్టుచున్నది. తన్ముఖమున సూర్యునిస్వర్ణకిరణములు పరమేశ్వరుని యాశీర్వాదములో యనఁదోఁచెడు. ఈసృష్టివైచిత్ర్యమును, ద్వారస్థభిక్షుకునిఁబోలి నిదానించి చూచుచుండెద.

కాత్యా—చాణక్యా...చాణక్యా...

చాణ—(వినిపించుకొనకయే) ఆహా! ఏమి యీప్రపంచసౌభాగ్యము. నేనెంతవాఁడను? నేనుకండనే హద్దులేని యీప్రపంచ సౌందర్యరాజ్యమునుండి నిర్వాసితుఁడనైతిని. అమృతసమయమగు నీ

ప్రపంచము ననుభవింపఁజాలక, శూన్యహృదయుండనై యెక్కువ బాధనొందుచున్నాను-తపోవన ప్రాంతమునఁగల పల్లాలపంకమున దొర్లాడు సూకరముఁ బోలియున్నాను.

కాత్యా——ఆశ్చర్యము. ఈతని నీవిధముగ నెన్నఁడుఁ జూచియుండలేదు-

చాణ——ఒకదినమునమాత్రము............

(దూరమున సంగీతము వినఁబడును.)

చాణ——ఎవరిదీసంగీతము... ... ..ఊఁ...ఊ......ఒకదినము సంప్రాప్తించెను. ఆనాఁడు సంసారముత్సన మందిరమని బోధమయ్యెను. సృష్టిసౌందర్య మనిర్వాచ్యముగఁ దోఁచెను. ఆనాఁడాకాశమింద్రధనుర్వర్ణములతో రంజితమైనట్లు గోచరించెను. పిమ్మట..

(సంగీతనినాదముసమీపించును).

చాణ——(బాగుగా వినుట నభినయించి) ఆఁ..-ఆఁ--ఆస్వరమే. అవును. అవును. ఆస్వరమే. కాత్యాయనా! బంధూత్తమా! పిలుచుకొనిరమ్ము.

కాత్యా——ఎవరిని ?

చాణ——ఆభిక్షుకుని... వానిబాలికను.

కాత్యా——వానితో నీకేమిపనియున్నది ?

చాణ——(బ్రతిమాలుచు) అన్నా ! దయయుంచిపొమ్ము.

(కాత్యాయనుఁడు నిష్క్రమించును).

చాణ——కారణమేమైయుండును? ఈబాలికఁజూచినంతనే నా హృదయము వికారముఁబొంద హేతువేమైయుండును? (చెమటఁదుడుచుకొనుచు) అబ్బ! అబ్బ! ఏమియీతాపము. (అంతఁబాడుచు, భిక్షుకుఁడు బాలికయు, కాత్యాయనుఁడు ప్రవేశించుదురు.)

చాణ——ఆనందము. బ్రహ్మానందము. పాడుము. బాగుగా పాడుము.

భిక్షు—బాలిక—(పాడుదురు.)......

కాత్యా——ఇట్టి చార్వనికభిక్షుకుని నేనెన్నఁడుఁ జూచియుండను. "తత్పురుషః, సమానాధికరణపదః, కర్మధారయః" అని చెప్పినట్లున్నది. అర్థమేమనఁగా—ఆపురుషుఁడొక్కఁడే ప్రకృతిచే సమగుణాన్వితుఁడైన యెడల,—అనఁగా—జీవభావమున జన్మముగ్రహించినట్లయిన కర్మమునుభరించి, కార్యములఁబట్టి కర్మఫలము ననుభవించును"——ఓహో! భిక్షుకా! నీవు నిశ్చయముగఁ బాణినీయముఁబఠించియుందువు.

భిక్షు——లేదు బాబూ!

కాత్యా——నీగానమునందంతటఁ బాణినీయమే చూపట్టుచున్నది. ఈపాట యెచ్చోట నేర్చితివి?

భిక్షు——ఒక బ్రాహ్మణునియొద్ద..

కాత్యా——అయియుండును. అందుననే..

చాణ——(బాలికఁజూచి) తల్లీ! యిటురమ్ము.

(బాలిక పరుగిడి చాణక్యుని సమీపించును.)

చాణ——(ఆమెశిరముదువ్వుచు) అవును. అవును. (తనలో) చూడగా నదియే ముఖము. ఆకన్నులే. (ప్రకాశ) భిక్షుకా! నిన్ను నేను ప్రశ్నింపవలసియున్నది. ఈమె నీకుమార్తెయేనా? నిజముఁ జెప్పుము.

భిక్షు——మఱియెవరిదైయుండును?

చాణ——నిజముఁ జెప్పుము. నీకు విశేషధనమిచ్చెదను.

భిక్షు——అట్లయిన—తండ్రీ! నాకుమార్తె గాదు. మార్గమున లభించినది. చిన్ననాఁటినుండి పెంచుకొనుచున్నాను.

చాణ—(ఆతురతతో) ఎచ్చట? ఎచ్చట?

భిక్షు—భగవంతుఁడు ప్రసాదించినాఁడు. ఈగుడ్డివానికెట్టి పుణ్యముననో యీతల్లిలభించినది. తండ్రీ! చెప్పవేమి? ఒకప్పుడు దొంగనైజీవించితిని. ఆపాపమున నంధుఁడనైతిని.

చాణ—(మిక్కిలి యాతురతతో) ఆఁ......ఆఁ......ఒకప్పుడు దొంగవా? ఇప్పుడావృత్తిఁ ద్యజించితివేల?

భిక్షు—త్యజింపకతప్పునా? ఈచంద్రగుప్తునిరాజ్యములో చోరులకు నిలువనీడలేదు.

చాణ—నీకీబాలిక యెచ్చట లభించినది? నిజముఁజెప్పుము.

భిక్షు—అవంతీపురమున.

చాణ—(ఉత్తేజితుఁడై) ఆఁ...ఆఁ.....అవంతీపురముననా? ఏస్థలమున?

భిక్షు—మార్గమున—

చాణ—కాదు, కాదు. ఒకబ్రాహ్మణుని గృహమున దొంగిలించితివి. నిజము బలుకుము. నీకు భయమేమియు లేదు.

భిక్షు—నేనేమియు నెఱుఁగఁ దండ్రీ!

చాణ—నిన్నుఁ జంపించెదను. నిజముఁ జెప్పుము. దొంగిలించితివి.

భిక్షు—అవునుతండ్రీ!

చాణ—నదీసమీపమునఁగల గృహమున......

భిక్షు—అవును.

చాణ—(వక్షముపైఁ జేయివైచి) హృదయమా! ఉద్వేగమొందకుము. అపుడీమెప్రాయమెంత?

భిక్షు—నూఁడు లేక నాల్గువత్సరములుండును.

చాణ——పేరేమంగుదువా ?

భిక్షు——ఆత్రేరి,

చాణ——ఆత్రేయి. వింటివా కాత్యాయనా ? ఆత్రేయి... ఆత్రేయి... ఈమెతండ్రిపేరేమి ?

భిక్షు——చాణక్యుఁడు.

చాణ——(త్రుళ్ళిపడిలేచి) అబ్బ ! దొంగా ! లేదు. లేదు. నిన్నుఁ జంపను నీకేమియు భయములేదు. కాత్యాయనా !... నీతోఁ బనిలేదు. (తెరవైపుఁజూచి) ఎవఁడురా యచ్చట ?

భటుఁడు——(ప్రవేశించి) ఆజ్ఞ.

చాణ——పో. పో. నీతోఁబనిలేదు... భిక్షుకా! నేనే యాబ్రాహ్మణుఁడను. ఈబాలిక నాకుమార్తె.

(భటుఁడు నిష్క్రమించును)

భిక్షు——ఈబాలికఁగైకొనెదరా ? తండ్రీ ! నేనీమెవలన నింత యన్నముఁదిని బ్రదుకుచున్నాను. ముసలివాఁడను. గ్రుడ్డివాఁడను. నే నెచ్చటికిఁబోఁగలను ?

చాణ——నీకుఁ గావలసినయంత ధన మొసంగెదను. నన్నువిరాగిఁ జేసితివి. తిరుగ సార్వభౌమునిఁజేసితివి.నన్ను నరకకూపమునఁ బడవైచి, స్వర్గమునకునెత్తితివి. అవును. అవును. ఇదియానందమా, దుఃఖమా ? జీవించియున్నానా ? నేనెవండను. (అని నవ్వుచుండును).

కాత్యా——చాణక్యా ! చాణక్యా !

చాణ——కాత్యాయనా ! నీవు నానాడిఁజూడఁగలవా? చూడుము. (అనిచేయిచ్చి) నేను బ్రతికియున్నానా ? ఇది యిహలోకమా ? పరలోకమా ? ...ఇదిస్వప్నమా ?...సత్యమా? ... ఇదిప్రపంచమా? అంధకారవనసమూహమా? ఇది సృష్టిసంగీతమా?...ప్రళయకల్లోల

మా? హా! నాకుమార్తె! ప్రతిద్వారమునకేగి భిక్షయాచించునా? ఛీ! ఛీ! కాత్యాయనా! కాత్యాయనా! (అని యేడ్చును.)

కాత్యా—చాణక్యా! ఇది యేమి?

చాణ—అట్లుకాదు. అట్లు సంభవించియుండదు. ఇది యొక మిష. ఆఁ తెలిసినది. కాత్యాయనా! చూడగా—ఈకార్యము—నీ—కాదు. కాదు. (అని బాలికఁజూచి) ఆముఖమే. ఆనేత్రద్వయమే. ఆ తేఁ్రయీ! నాతల్లి! ఇంతవఱకు సంతానము మఱచితిని. అమ్మా! (అనిముద్దిడి) ప్రపంచమంతయు నానందమయము—సుఃఖమయము. కాత్యాయనా! కాత్యాయనా! నాశరీర మవశమగుచున్నది. స్వర్గము నరకమేకీభవించినట్లు సంతోషపరితాపమేకీభవించినది. అబ్బ! అబ్బ!

మ. భరియింపందరమౌనె? నాహృదయ సంప్రద్యోతతాపాగ్ని; నీ
జ్వరమేరీతిగ నంతరించు? నిదిపశ్చాత్తాపమో? పాపమో?
యెఱుఁగన్; బుద్ధిదహించుచున్నదకటా యెక్కాలమిట్లుండునే?
అరిమద్వర్గమహాగ్నికీలలను శాంతాంభోధి జల్లార్చెదన్.

(అని చాణక్యుఁడునిష్క్రమింప నెల్లరు నిష్క్రమించుదురు)

తృతీయదృశ్యము స్థానము:—మలయరాజప్రాసాదము

కాలము:ప్రభాతము.(మలయరాజకర్మచారియు, మగధ రాజదూతయుఁ బ్రవేశించుచున్నారు.

కర్మచారి—మామలయరాజ్యము భారతసామ్రాజ్యమునం దంతర్భూతమై స్వాధీనమైయున్నది. సార్వభౌముఁడైనను దీనిని విశేషముగ శాసించి చేఁజిక్కించుకొనలేదు.

దూత—మీరాజ్యమునకు శాసనకర్త మీరాజపుత్రియే గదా?

కర్మచా—అవును. రాజుగారి తనభార్యమరణానంతరము శాసనభారమువహించెను.

దూత—వివాహము కాలేదా?

కర్మచా—లేదు.

దూత—వివాహముఁ జేసికొనునా?

కర్మచా.—నేనెఱుంగను. ఆమె నిర్జనస్థలమున నొకర్తుకయే విహరించుచుండును. రాజకార్యములయందుఁ దక్క తదితరవిషయములయం దెవరితో మాటలాడదు.

దూత—సార్వభౌమునకుఁగూడ నిదియే యవస్థ. ఇపుడు వారి వివాహము కానున్నది.

కర్మ—(తెరపైపుజూచి) ఆశ్చర్యము. మహారాజ్ఞ వచ్చుచున్నది. (అంత ఛాయ ప్రవేశింప నుభయులు భయసంభ్రమములతోఁ దొలగించి నమస్కరించి నిల్చియుందురు.)

దూత—రాజ్ఞికి జయమగుఁగాక.

ఛాయ—విశేషమేమి?

దూత—నేను మగధనుండి శుభపత్రముఁ గైకొని వచ్చిన దూతను. (అని పత్రమునొసంగును.)

ఛాయ—(కంపితహస్తముచేఁ బత్రముఁ గైకొనిచదివి, దూరముగఁ బడవైచి) ఆసామ్రాజ్ఞి యెవరు? ఊఁ...ఎవరైననేమి? (కొంత దనుకఁ జింతించి) లేదు......నేఁబోయి తిలకించెదంగాక. (కర్మచారిఁ జూచి) భాండారమునఁగల మహార్ఘరత్నముల నెల్లఁ గూర్చి మనోహరకంఠహారమును శీఘ్రముగఁ జేయింపుము.

కర్మచారి—ఆజ్ఞ.

ఛాయ—మఱియు మా మగధయాత్రకు సర్వము సిద్ధము జేయుము.

కర్మచారి—ఆజ్ఞ.

ఛాయ—ఈరాజదూతను విశ్రామగృహంబునకుఁగొంపోయి సత్కరింపుము. నీవికపొమ్ము.

కర్మచారి— మహాప్రసాదము.

(దూతతోఁ గర్మచారి నిష్క్రమించును.)

ఛాయ—(తిరుగ పత్రము నెత్తి విప్పి, మాటిమాటికిముద్దిడి) హా! నాజీవనానందమా! నాసర్వస్వమా! నన్నువిడనాడి మఱియొకర్తుకఁ గాంక్షించితివా? లేదు... లేదు......నిన్ను నేనే స్వహస్తములతో గ్రీకు రాజకన్యకకు సమర్పించితిని......అట్లయినహృదయము సహింపదేల? హృదయము వ్రక్కలగుచున్న దేల? ఆహా! చూడఁజూడఁ బృథివి శూన్యమగుచున్నదే? చంద్రగుప్తా! చంద్రగుప్తా! కాదు. కాదు. ఛాయా! నీవు రాజ్ఞివి. దృఢచిత్తురాలవుగమ్ము. నిర్మమకారముతో నీప్రవృత్తిని నిరోధింపుము. నీధైర్యమునకు, నీహృదయము లోహావరణమగుఁగాక. ఛాయా! ఛాయా! తప్తబాష్పముల రానీయకుము. మనమా! అసూయఁ బొందకుము. దుఃఖమెందుకు? ఓర్వఁజాలవా? ప్రేమనణంచుకొమ్ము. అతఁడు సుఖించుఁగాక. ప్రియతమా! నీవు సుఖించెదవుగాక. అదియే నాజీవనమునకు సాధనమౌఁగాక.

(అని నిష్క్రమించును.)

చతుర్థదృశ్యము సెల్యూకసుశిబిరము కాలము ప్రభాతము

(సెల్యూకసు ప్రవేశించును.

సెల్యూ—చంద్రగుప్తుని హెలేన వివాహమాడునా? ఈనగరమున, నీవివాహమహోత్సవ కోలాహలము గ్రీకులకుసిగ్గులేదనిచాటుచున్నది. హెలేన యింతవఱకు రాకుండుటకు హేతువేమి? ఇ

మ్మహోత్సవమునకు మైమఱచినది. ఇప్పుడీ ముదుసలితండ్రిఁ దలఁచునా? ఎదురుగనున్నఁ జూచి ముద్దులఁగులుకును. వెనుకకుఁ దిరిగిన నేనెవండనో? పుత్త్రికకు విద్య చెప్పించినయనంతరము, కుమార్తెకు వివాహముఁ జేసిమ్మట, తండ్రి యే సుఖముఁ గోరి జీవించునో యెఱుంగరాదు. తల్లిదండ్రుల యగాధస్నేహమునకు ప్రతిదానము లేదు. (తెరవైపుజూచి) హెలేన వచ్చుచున్నట్లున్నది.

(హెలేన ప్రవేశించును.)

సెల్యూ—హెలేనా! నీకొఱకే యిచ్చట నిరీక్షించుచున్నాను.

హెలే—నిన్ను స్వయముగ రాజసభకుఁ గొంపోవుటకు వచ్చితిని. రావలయుఁదండ్రీ!

సెల్యూ—నేను రాఁజాలను. వారు నిన్ను బంపిరా?

హెలే—నిన్ను స్వయముగఁ గొంపోవుటకు నేనే వచ్చితిని

సెల్యూ—అట్లనా? మంచిది. నేను రాను.

హెలే—హేతువేమియు లేకుండ రానని ధర్మమా? ఇంతకు నీకుమార్తె వివాహమునకు నీవు రాకున్న నెట్లగును?

సెల్యూ—లేదు తల్లీ! నేనీస్థలమునుండియే మఱలుదును.

హెలే—అట్లనా? ఎఱుంగుదు. మరలుటయు నుండుటయు మీచిత్తముపై నున్నది. నేను నిన్ను బలాత్కరింపఁజాలఁగదా?

సెల్యూ—హెలేనా! ఇఁక తండ్రిపై నీకనురాగముండరాదు.

హెలే—నీపైఁ గాక మఱియెవనిపైనుండును! పోనిమ్ము: నీ యిష్టము! దయయుంచుము; పోయివచ్చెద.

సెల్యూ—ఇంతశీఘ్రముగా నే! ముహూర్తకాలము పర్యంతము విళయము సహింపరాదా? ఆహా! తండ్రి యెంతటి మూఢుఁడు! ఇంతస్నేహముతో, నింతయత్నముతో, నింతయాదరముతోఁ బెరిగిననీకుమార్తె నిన్ను విడచిపోవుచున్నది. నీకిఁక గత్యంతరము లేదు.

హా! హేలేనా! నాతల్లీ! నినుఁ గన్నతండ్రిని. మఱియు—మఱియు నీవు పుట్టిననాఁడే తల్లిలేనిబిడ్డవని ముద్దారఁ బెంచితిని.

(కన్నీరువిడుచును.)

హేలే.—తండ్రీ! క్షమింపుము. పాపాత్మురాలను. నీనేత్రములు బాష్పపూరితములై యుండఁ జూడఁజాలను. ఇదియే, నాతుది చూపని భావించితివా? తండ్రీ!

(అని మోకరించును.)

సెల్యూ—(హేలేనను లేవనెత్తి) తల్లీ! నీయపరాధమేమియు లేదు. అపరాధము నాయందున్నది. నీజనకుని యపారదుఃఖవేదన నీవేమెఱుంగుదువు. కని, పెంచి, పెద్దఁజేసిన, కుమార్తెను దూరదేశమున విడిచిపోవు జనకుని దుఃఖము నీవేమెఱుంగుదువు. తల్లీ! పుత్రికాపుత్రులు, తండ్రి నొక్కమారయినఁ జూడ నభిలషింపరు. ఈ యపరాధమెవరిపై నారోపింపఁగలను? స్వభావసిద్ధముగ నన్ను నియమము, ఇట్లెఱింగియు నగాధస్నేహమోహములకు లోనై యధిక దుఃఖమును బొందుచున్నాను.

హేలే—వియోగదుఃఖ మొకతండ్రికే యుండునా? ఇట్టిసమయమునఁ గుమార్తెహృదయమెట్లుండునో యూహింపవలదా? తండ్రిప్రేమించుటయుఁ గుమారిప్రేమింపకుండుటయు నుండునా? వియోగదుఃఖభయములకు సమానమేగదా?

సెల్యూ—(దుఃఖించుచు) తల్లీ! నీవు నన్నుఁ బ్రేమింతువా?

హేలే.—తండ్రీ! ప్రేమ స్త్రీరూపమున మూర్తీభవించునని యెఱుంగుము. స్త్రీజీవనము ప్రేమభూయిష్ఠమైనది. స్త్రీకిగల సంపదయెట్టిది? ఆదిఁ దల్లిదండ్రులు. అనంతరము భర్త, ఆపిమ్మట సంతతి. ఇట్లే క్షుద్రసంసారము పూర్ణమైయుండును. ఈసంతతియందే యామెదానికి నవలంబనము, నానందము, నైశ్వర్యముఁగనఁబడుఁగాని మరి

వేఱెదిక్కు గనంబడదు. పురుషుండు స్వర్గస్థుండైనంత స్త్రీ యేకాకినియై గృహమందున తన బిడ్డలఁ గాపాడుకొనుచుండును. స్త్రీవలనఁ గలుగు స్నేహము—ఆలస్యము—అవసరము, పురుషునకుఁ బ్రమోదము, ప్రహ్లాదము—చిత్తవినోదముఁ గలిగించును. అన్నివేళలందు, నన్నితలంపులందు, నన్నికార్యములందు, వేయేల ! జీవితమంతటను, స్త్రీస్నేహమత్యవసరము. జీవులకీ స్నేహముచేతనే, జన్మము, నివాసము, మృత్యువు సంభవించుచున్నది స్వర్గమనునది యీస్నేహమునకుఁ బరమావధి. ఆహారము, విహారము, శయనము, నిద్ర, స్వప్నము, వేయేల, సర్వము స్నేహమయము.

సెల్యూ—తల్లీ! నిజము, నిజము.

హెలే—తండ్రీ! నీయెడఁగల స్నేహముఁ బట్టియే నామాటిగోనను నిరాకరించితిని. నేఁడీ నగరమంతట వినంబడు మహోత్సవ కోలాహలము నాచెవుల కార్తనాదమువలెనున్నదని యెఱుంగుము. ఎల్లరు నవ్వుచున్నారు. సంతోషమున నీదులాడుచున్నారు. మహోత్సవమునఁ మునింగి మైమఱచియున్నారు. నాహృదయమెట్లుండవలెనో యట్లున్నది. ఒకవిధమైన వియోగవిలయాగ్నిహోత్రము ప్రజ్వలించుచున్నది.

సెల్యూ—హేతువేమి? నీవు చంద్రగుప్తునిఁ బ్రేమింపవా?

హెలే—నీ వెఱుంగవా? తండ్రీ! చెప్పవలెనా? ఇది వివాహముగాదు. మృత్యువు. నన్ను నేను బలియిచ్చుకొనుచున్నాను.

సెల్యూ—బలియెందుకు ?

హెలే—మానవుల హితముగోరి స్వయముగ బలియగుచున్నాను. సెల్యూకసుచంద్రగుప్తుల విద్వేషవహ్నిఁ జల్లార్చుటకు, మఱియు, యుద్ధాభిలాషులగు నీయిరుతెగలవారికి స్నేహముఁగూర్చుటకీవివాహము ప్రేరేపికమంగ సంభవించెడు.

సెల్యూ్యా—హే లేనా! నీవీ కార్యమున కేల పూనుకొంటివి? ఈ వివాహము, నాహృదయమర్మస్థానమును శూలముతో గ్రుచ్చినట్లున్నది. కాని యీవివాహము నిసుఖమునకైన సంగీకరింప వలసివచ్చినది. ఈవివాహమువలన నీవు సుఖించుచున్న, నీయానందముఁజూచి, దుఃఖము మఱచి హాయిగ నుండఁగలను.

హే లే—తండ్రీ! లోకహితమభిలషించి యాతని వరించితిఁగాని యాత్మసుఖమునకై వరింపలేదని యెఱుంగుము. ఈవివాహ కారణమున నొక భయంకర ప్రళయమణంగినది. ఈవివాహముచే, నార్యజాతులు రెండుఁ బరస్పరమాలింగనముఁ జేసుకొనుచున్నవి. ఈవివాహము మాయిరువురకుఁ గాదు; కర్మమోక్షములకు, చింతాకల్పనలకు, జరిగినదని యూహింపుము. ఈరెండు సభ్యజాతులకు, విద్వేషవహ్ని, యుదకప్రపాతరూపమున నున్నయీవివాహముచేఁజల్లారి సంబంధ బాంధవ్యముల గలిగి యేకీభవించుచున్నవి. ఇంతగొప్ప వివాహము పూర్వమెప్పుడైన జరిగియుండెనా ?

సెల్యూ్యా—నిజమే. జరిగియుండదుగాని—

హే లే—తండ్రీ! బాగుగా పరిశీలింపుము. మన "ప్లేటో" వారి కపిల మహర్షియు నొకరితో నొకరు గాన మొనర్చినట్లు, "సొలాన్" వారిమనువు పరస్పరము కంఠాలింగన మొనర్చుకొనినట్లు హోమరు మృదంగధ్వనులకు, వాల్మీకి మహర్షి వీణ మ్రోగుచున్నట్లు, హెరోడోటసు, వ్యాసుఁడు, సోక్రెటీసు, బుద్ధుఁడు; ఎకిలిసు, భీష్ముఁడు; మిత్రులైనట్లు మావివాహమువలన లోక మెఱుంగదా ? అది యానందదాయకముగాదా? ఈవివాహమునందు, పూర్వపశ్చిమములు, సముద్రగగనంబులు, స్వర్గమర్త్యములు, నిహలోక పరలోకములు, లీనములగుచున్నవి. తండ్రీ! మఱి నేనేమియు వచింపఁజాలను. నీయిష్టము.

సెల్యూ్యా—హే లేనా! అట్లనెద వేమి ?

హెలే—(కొంతదనుక నిశ్చేష్టయై యస్ఫుటస్వరముతో) ఏమి యులేదు. ఆశీర్వదింపుము.

సెల్యూ—అమ్మా! సుఖింపుము. ఏమ్చుచుంటివా ?

హెలే—లేదు. కర్తవ్యము నన్ను బలాత్కరించుచున్నది. నేఁ బోయివచ్చెద. (మోకరించి తండ్రి పాదధూళి, శిరమునధరించి) జీవనమున్నంతవఱకు నీయాచరణ స్పర్శస్మృతి నన్నుఁ గాపాడుఁగాక. తండ్రీ! నమస్కారము. ఓజగదీశా! నిను నేనొసంగుచున్న బలి గ్రహింపుము.

(అని శీఘ్రముగ నిష్క్రమించును.)

సెల్యూ—హెలేనా! హెలేనా! .........(అని తెరవైపుఁ జూచును.) ఇదియొక యపూర్వము. స్వర్గీయము. ఇంతగొప్పబలి పూర్వ మెన్నఁడు జగతిలో సంభవించి యుండదు. ......... బాగుగనే యున్నది. పోవుదునా నాదేశమునకు? ......... ఎందుకు? ఎవరు న్నారచ్చట? ......... అంతయు నంధకారమయము. మార్గము గానరాకున్నది. తల్లీ! నన్నంధునిఁ జేసి యెచ్చటికేగితివి? ఇఁక నాకేమిదిక్కు? హా! ఘోరము. మహాఘోరము.(అంత, ఆంటిగోనసు ప్రవేశించి) ఇది యెంత ఘోరము. వెలుంగని నీఘోరమేమున్నది.నీవు చేయని ఘోరమేమున్నది. రహస్యముగ వివాహమాడి సహధర్మచారిణి యని యంగీకరింగి, సంతానము గలిగినతోడనే యామెనుత్యజించి, యాపుట్టినవానిని, జారజుఁడని దూషించుట కంటె నిది యధికఘోరమా? సర్వము నీకెఱుంగించి నాహృదయు పరితాప మణంచుకొనుటకై వచ్చితిని.

సెల్యూ—ఎవఁడవు నీవు?

ఆంటిగో—నేనెవఁడనా? ఎఱుంగవా? జారజుఁడను.

సెల్యూ—(ఆశ్చర్యముతో) ఆంటిగోనస్ !

ఆంటి—ఆశ్చర్య మొందుచుంటివా సార్వభౌమా !

సెల్యూ—నాపరాజయమునకుఁ బరిహాసముఁ జేయ వచ్చితివా? బాగుగానున్నది.

ఆంటి—సార్వభౌమా! అట్లు తలంపవలదు.

సెల్యూ—అట్లయిన ?

ఆంటి—నాజనకుని సమాచార మెఱింగివచ్చితిని.

సెల్యూ—ప్రయోజనము లేదు.

ఆంటి—ప్రయోజనము లేకేమి? ప్రయోజనముండుటఁబట్టియే గ్రీకుదేశమునకు స్తుత్తునివలెఁ బరుగిడి, తల్లివలన సర్వమెఱింగి, హృదయపరితాప మించుక యణచుకొని, తిరుగ భరతఖండమునకు నేతెంచితిని.

సెల్యూ—సరియే. బాగుగ నేయున్నదిగాని—వింటివా? నేఁడు హెలేన చంద్రగుప్తుని పట్టమహిషియైనది.

ఆంటి—అవును. ఎఱుంగుదును. రాజసభకుఁబోయి రాజదంపతుల నాశీర్వదించెదను.

సెల్యూ—వ్యంగ్యమా.

ఆంటి—కాదు. కాదు. నిశ్చయము. హెలేన నాకు సోదరి యగును.

సెల్యూ—నీవాక్యముల కర్థము తెలియకున్నది.

ఆంటి—ఎట్లు తెలియును. (అని సెల్యూకసుఁ దేఱి చూచును.)

సెల్యూ—అట్లు నిదానించి చూచుటేమి? ఎవఁడవునీవు.

ఆంటి—నేనెవండనా? నీవనినట్లు జారజుండఁగాను. నాతండ్రి నాతల్లిని ధర్మశాస్త్రపద్ధతిని వివాహమాడగా జన్మించిన వాఁడను. పాపము నేనెవండనో యెఱుంగవా?

గీ. కోపకీలాకలాపప్రకే తాపమునను
పుడమితడబడ గడగడనె వడఁకఁ జేసి
శేషమేమియు లేకున్కి రోషముడిగి
నాదు క్రోధాగ్ని చల్లారె నరవరేణ్య.

ఇచ్చట నే నుండి చేయవలసిన కార్యమేమియు లేదు. దయయుంచుము

చంద్రి—గురుదేవా! నాయందపరాధమున్న దనియా నన్నెడ బాయుచున్నారు?

చాణ—వత్సా! నీయందెట్టి యపరాధము లేదు. నేఁజేసిన కార్య మత్యన్భుతమైనను బ్రాహ్మణునకుఁ దగినది. దర్పము, క్రోధము, ప్రతిహింస, మొదలగు నివి బ్రాహ్మణుని యుచిత ప్రవృత్తుల లోఁ జేరవు. క్షమ, తితిక్ష, త్యాగము మొదలగునవి బ్రాహ్మణధర్మములు. నాక్రోధోన్మాద మణంగినది. జ్ఞాననేత్రమించుక వికసించుచున్నది నే వెడలెదఁగాక. నిర్మాణించిన యీసామ్రాజ్యమును, మంత్రికాత్యాయనుని తోడ్పాటునఁ బరిపాలింపుము,

కాత్యా—మఱినీవు—

చాణ—నాకీరాజకార్యములతోఁ బనిలేదు. నాతల్లి నాకు లభించినది—ఈమోహబలఁబునకు నాహృదయపాషాణము కరఁగి ద్రవించుచున్నది. శుష్క తరువు చిగిర్చినది. మరుభూమిసుధాసముద్రము చేఁ దరంగితమైనది. మీకు శుభమగుఁగాక. దయఁగలిగియుండుఁడు.

హేలే—చంద్రి—(సింహాసనముండి దిగి నమస్కరింతురు)

చాణ—శుభమగుఁగాక ...(ఆతేయిత్ర సమక్రమించును.)

చంద్రి—ఆశ్చర్యముగనున్నది. ... నేఁడేమియు నుత్సాహము లేదు. గురుదేవుఁడు వెడలుటఁబట్టియు, బంధూత్తముండగు చంద్రకేతువు మరణించుటఁబట్టియు జయజయధ్వని రోదనధ్వనివలెఁ దోఁచుచున్నది.

హెలే—ఆతనికోపము నావలనఁ బూర్తిగాకుండునా?

చంద్రి—నాకన్నివిధముల నుపకారమొనర్చి, తనసర్వస్వము నాకై వినియోగించి, నిష్కారణకోపము సహించి, తుదకు నాకిచ్చుటకై తన ప్రాణములర్పించెను. వాని నేనెట్లు మఱువఁగలను? (అంత ఆంటిగోనసు ప్రవేశించి) హెలేనా!

హెలే—(చమత్కృతయై) ఓహో! ఆంటిగోనస్!

ఆంటి—సోదరీ! నేను గ్రీసుదేశమునుండి నీవివాహమునకుఁ గానుకఁ గొనివచ్చితిని. భ్రాతృస్నేహోత్పాదముఁ బహూకరింపుము. సార్వభౌమా! చంద్రగుప్తమహారాజా! కానుకగ నేనొసంగు మహాద్భుతమణిబద్ధమగు ఖడ్గముఁ గొని వినియోగింపుము. (అని చంద్రగుప్తుని పదసమీపమునఁ బడవేయును.)

చంద్రి—సైనికా! నీవెవఁడవు.

ఆంటి—పోల్చుకొనలేదా! ఎవనిఖడ్గఘాతముచే నాఖడ్గము కరచ్యుతమైనదో, యెవనివలన పితృహత్యాపాతకముతప్పినదో, యట్టి వానిని నేనుమాత్రము మఱువను.

చంద్రి—నిన్ను పితృహత్యాపాతకమునుండి తప్పించితినా? నీ తండ్రియెవఁడు?

ఆంటి—గ్రీకుసార్వభౌముఁడగు సెల్యూకసు.

హెలే—(తుళ్లిపడి) ఆఁ...ఆఁ...ఏమనుచున్నావు?

ఆంటి—అవును హెలేనా! నేను నీసోదరుఁడను. నీవు నాప్రేమ నిరాకరించితివి. మంచిపనిచేసితివి.

హెలే—ఆంటిగోనస్! నీవు నాయన్నవా? నిజమా?

ఆంటి—అవును సోదరీ!

హెలే—అన్నా! నాహృదయమునుండి మహాపర్వతభారము తొలఁగించితివి. క్షమింపుము. (అని యాతని పాదములఁబడును.)

ఆంటి——(లేవనెత్తి) సార్వభౌమా! నీకీరత్నము నుద్ధరింపుము. ఇట్టిరత్నము మఱిలభింపనేరదు. అనిర్వర్ణనీయసౌందర్యముగల యీమె బాహ్యముకనస్వరసయ్యె. యంతరము చెడిపోయియుండును— ఉదారమగు నీమనఃకరణమునకీమె సాధర్మ్యము తుల్యముగానేరదు. నేఁ బోయి వచ్చెద. రాజదంపతులకు శుభమగుఁగాక.

(అని నిష్క్రమించును.)

(అంతఛాయ నవరత్నహారముతో ప్రవేశించి, దూరమునుండి హేలేనను చంద్రగుప్తుఁ డీక్షించి,) ఓహో! ఏమిసౌభాగ్య [illegible]ప్రదయమా! దుఃఖప్రదము. అబ్బ... అబ్బ... అసూయాప్రభావము శరీరమునశమగుచున్నది—— (హృదయమును నుద్దేశించి)

మ. అనసూయన్వహియించియోర్పుఁగనుమా! ఽయాకంపితాంగంబు నన్
వసటన్నొందగనేల? తాల్మివలదే? ఽ పాదాబ్జముల్ తొట్రిలన్
కనుదోయిన్మిఱుమీటఁ బొంగిపొరలెన్ ఽ గన్నీరు [illegible]గా
మనమా! యీర్ష్యవహింపఁబోలదుసుమా, ఽ మన్నించి శాంతింపుమా

(అని రెండడుగులువైచి) సహింపఁదరమగునా! అయ్యది స్వభావసిద్ధముగదా? విరక్తిఁ జెందవలసిన సమయమిది. ఆహా...

మ. వనభూభాగములన్ధరాధరములన్ ఽ వ్యాఘ్రాదిసత్త్వోత్కరం
బనజీవించు వనుండు భూజనులపై ఽ నాధిక్యమున్ గల్గియుం
డిఁ మాత్రంబున నిప్పుఁ బానలచునే ఽ నీకేలయీభ్రాంతి? యో
మనమా! యీర్ష్యవహింపఁబోలదుసుమా ఽ మన్నించి శాంతింపుమా

మ. కనకాంగిన్కులకంఠకంఠిని గనెన్ ఽ గాంక్షించి మోహించె నిన్
గనెనో నీవొకరాచకన్నెవనిసిన్ ఽ గామించి ప్రేమించెనో
నిదుఁ బెండ్లాడునె? యింతవంతదగునే ఽ నీకేల యీశోకమో
మనమా యీర్ష్యవహింపఁబోలదుసుమా ఽ మన్నించి శాంతింపుమా

(అనిమెల్లగనడచి) ప్రకృతిజన్యమైన అనురాగముఁ బడయ నెంతటియు

చంద్ర—చద్రకేతు ప్ర స్వర్గస్థుఁడగుటచాలదా? నీవుసహితము నన్నువిడనాడఁదగునా?

హేలే—(సమీపించి స్నేహభావమున ఛాయచేతులఁబట్టు కొని) ఛాయా! తలవంచుకొని దుఃఖింపనేల? రమ్ము...ఏకసముద్రము న రెండునదులు సంగమింపరాదా? ఒక్కయాకాశమునఁ జంద్రసూర్యులుదయింపకుండిరా? ఏకవృక్షంబున రెండులతలాశ్రయించి పుష్పించకున్నవా? నాసౌభాగ్యములో సగము నీకు పంచియిచ్చెదను. ఇంతవిచారమేల?

ఛాయ—హేలేనా! నేను సహింపఁగలను. సహింపకున్న స్త్రీజన్మమువలన లాభమేమి? రమ్ము.—హేలేనా! నాచేతులతో నవరత్నహారము, నీకంఠమున నలంకరించెదను. (అని హేలేన చేతులఁ బట్టుకొని) ఈముఖము—ఈసౌందర్యము—ఈయుదారహృదయము—అనిర్వర్ణనీయములు. నీవు నాచంద్రగుప్తుని సుఖింపఁజేయఁ గలవు.

(అని చేనున్న రత్నహారము నలంకరింపఁబోవును)

హేలే—(ఛాయచేతులనుఁబట్టుకొని) అట్లుకాదు. ఈహారము నీవలంకరింపఁదగిన స్థలముఁ జూపెదరమ్ము. (అనిచంద్రగుప్తునికంఠము న నలంకరింపఁజేసి, యామెచేతులఁ దనకంఠమునకు చుట్టబెట్టుకొని) ఆ హారమునకు విలువయున్నది గాని యీహారమునకు విలువలేదు. (అని ఛాయఁగౌఁగిలించుకొని) ఛాయా! నీవు నాచెల్లెలవు.

(యవనికజారును.)

పంచమాంకముసంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 9 | సతిఁ గావింపకుండ | [illegible] |
| 4 | 10 | రేఁకలననంచి | రేఁకలనెంచి |
| 5 | 9 | జ్యోత్స్నప్రవాహము | జ్యోత్స్నాప్రవాహము |
| 6 | 19 | మఱగించుఁదనము | [illegible] |
| 7 | 14 | శతు్రసేనాసంఘము | శత్రుసేనాసంఘము |
| 7 | 17 | హత్యవలెక గాశైప | హత్యవలె [illegible] |
| 9 | 16 | ఖండార్ధభాగము | [illegible] |
| 12 | 30 | ప్రతిదినముప్రాతఃకాలము | ప్రతిదినముప్రాతఃకాలము |
| 23 | 25 | భార్యసహోదరుఁడను | భార్యకుసహోదరుఁడను |
| 26 | 7 | వేయఁ చేతులవాని | వేయిచేతులవాని |
| 26 | 9 | వేయఁకన్నులవాని | వేయికన్నులవాని |
| 34 | 9 | మన్నించుచుండును | మన్నించుచుండును |
| 35 | 15 | లభింపవచ్చును। సౌఖ్యమింతికి | లభింపవచ్చు [illegible] |
| 36 | 25 | సతుదర్శనథమున | సముద్రమథనమున |
| 37 | 7 | స్థయిర్యమువహించెను | స్థైర్యమువహించెను |
| 40 | 21 | బహుపాండములఁదుందు | బహుభాండములయందు |
| 43 | 10 | కేవలముభావ్యము | కేవలముభాగ్యము |
| 48 | 11 | మనసారవలసిన | మనసారవలచిన |
| 49 | 1 | మఱిమొకవాడిచ్చెద | మఱియొకవాడిచ్చెద |
| 49 | 19 | వీనికింతటియాద్ధత్యయా ॥? | వీనికింతటియౌద్ధత్యమా |
| [illegible]3 | [illegible]8 | సంధిఁగూర్చి ప్రసంగించెదరు | సంధిఁగూర్చిప్రసంగించెదరు |
| [illegible]9 | 19 | జారుఁడనిపలికి | జారజుఁడనిపలికి |
| 61 | 12 | లోఁగిడించినన్ | లోఁగిడెంచినన్ |
| 64 | 15 | వధిపఁబడినది | వధింపఁబడినది |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 70 | 22 | పరిహేళికాపరిశ్నముంలె | పరిహేళికాపరిశ్నలవలె |
| 71 | 24 | జీవవధాత్రి | జీవనధాత్రి |
| 72 | 21 | నీరాజనంబుకా | నీరాజనంబులు |
| 83 | 12 | శ రేశ తాంత్సమాచరేత్ | శ రేశాత్యంసమాచరేత్ |
| 88 | 23 | కందరదనఁగని | కుందరదనుఁగని |
| 93 | 17 | గాంచెనీవిపుడ | గాంచెదీవిపుడ |
| 94 | 5 | కుండగఁగూలిన | కుండగఁగూలిచి |
| 95 | 25 | నిష్పంద, ిరి | నిష్పంద, నిర్ని |
| 104 | 22 | వీరబలా | వీరబలా |
| 106 | 9 | జ్యోత్స్నతయగు | జ్యోత్స్నస్నాతయగు |
| 107 | 10 | మాకిల్లులేదు | మాకిల్లులేదు |
| 108 | 1 | ద్వితీయద్యశ్యము | ద్వితీయదృశ్యము |
| 114 | 19 | జిగీపవహ్ని | జిగీషావహ్ని |
| 115 | 12 | నీవాంమెకుమారితివి | నీవ మెకుమారికవు |
| 115 | 13 | జేయుదునా ? | జేయుదువాం ? |
| 116 | 22 | సహస్రఘణములతో | సహస్రఘణలతో |
| 122 | 17 | ఆఁ—ఆఁ—అమతీయు | ఆఁ—ఆఁ—మతీయు |
| 124 | 4 | నేం నీకుసంధి | నేనీకుసంధి |
| 124 | 6 | లజ్ఞింపఁదగినసమయుమిది | లజ్ఞింపఁదగినసమయమిది |
| 125 | 3 | (తిల్పించి | (గల్పించి |
| 129 | 1 | నోలలాడి | నోలలాడె |
| 129 | 7 | గనవవీధి | గగనవీథి |
| 129 | 23 | లాక్రమించి | లాక్రమించె |
| 133 | 1 | సెంచివేర్చితివి | సర్వము సెంచివేర్చితిని |
| 133 | 12 | లోకభయముతో | లోకము భయముతో |
| 135 | 8 | కర్మమును భరించి కార్యములఁబట్టి కర్మఫలము ననుభవించును | కార్యములఁబట్టి కర్మఫలము ననుభవించును |
| [illegible]8 | 22 | హృదయము | హృదయము |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 138 | 10 | సంతోషపరతాపమేకీభవించినది | సంతోషపరితాపములేకీభవించినవి |
| 139 | 1 | తనభ్రాతృమరణాంతరము | తనభ్రాతృమరణానంతరము |
| 139 | 12 | భయసంభ్రమములతోఁదొలగించి | భయసంభ్రమములతోఁదొలఁగి |
| 139 | 22 | మహోర్ఘ్యరత్నములు | మహానర్ఘ్యరత్నములు |
| 140 | 20 | ప్రభావము | ప్రభాతము |
| 141 | 23 | విళయముసహింపరాదా | విళంబము సహింపరాదా |
| 142 | 13 | స్వభాపసిద్ధముగనన్నునియ ముము, | ఇది స్వభావసిద్ధముగనున్ననియమము |
| 142 | 18 | వియోగదుఃఖభయములకు సమానమేగదా ? | వియోగదుఃఖభయము లిరువురకు సమానములేగదా ? |
| 145 | 17 | వెలుంగని నీఘోరమేమున్నది | నీవెఱుంగని ఘోరమేమున్నది |
| 145 | 19 | యంగీంరించి | యంగీకరించి |
| 148 | 9 | బ్రాహ్మణునకఃదగినది | బ్రాహ్మణునకుఁదగనిది |
| 150 | 12 | తోటిప్రిలన్ | తోటిప్రెలన్ |
| 151 | 6 | జూడఁగల | జూడదల |

ఆంటిగోనస్ — ఆంటియోకస్ — ఈరెండు నామములు నొకపాత్రకుఁ జెందినవని యెఱుంగవలెను —



# ఇదివరకు ప్రకటింపబడిన గ్రంథములు.

| | | చందాదారులకు | | | ఇతరులకు. | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | ఉషఃకాలము | 1 | 0 | 0 | 1 | 8 | 0 |
| 2 | వాండేవీడు | 1 | 0 | 0 | 1 | 4 | 0 |
| 3 | ప్రేమము | 0 | 8 | 0 | 0 | 12 | 0 |
| 4 | సువర్ణలత | 0 | 12 | 0 | 1 | 0 | 0 |
| 5 | పద్మినీపరిణయము | (ప్రతులు లేవు) | | | | | |
| 6 | విలాసార్జునము | 0 | 8 | 0 | 0 | 12 | 0 |
| 7 | సగుణ (మొదటిభాగము) | 1 | 4 | 0 | 1 | 8 | 0 |
| 8 | ,, (రెండవభాగము) | 0 | 10 | 0 | 0 | 12 | 0 |
| 9 | ,, (మూడవభాగము) | 0 | 10 | 0 | 0 | 12 | 0 |
| 10 | క్రౌర్యవ్యాఘ్ర | (ప్రతులు లేవు) | | | | | |
| 11 | వేంకటరావు | 1 | 0 | 0 | 1 | 8 | 0 |
| 12 | నేనే. (వాండేవీడునకు 2 వ భా॥) | 1 | 0 | 0 | 1 | 6 | 0 |
| 13 | † కోటీశుతనయ(నిరూపకనవల) | 1 | 0 | 0 | 1 | 4 | 0 |
| 14 | ‡ కాలూరాయి "నేనే" తరువాయి | 1 | 4 | 0 | 1 | 8 | 0 |

† 1922 సం॥మున బహుమాన పరీక్షా పఠనీయ గ్రంథముగా నేర్పడి పరీక్ష నొసర్చి, నూటపదార్లు, అర్ధనూటపదార్లు, పావు నూటపదార్లు బహుమానము లొసంగిన గ్రంథమిది.

‡ 1923 సం॥రమున బహుమాన పరీక్షా పఠనీయ గ్రంథముగా నేర్పడి నూర్లు, పబములు, పదులు బహుమానము లొసంగుదుమని ప్రకటించినది.

VEGU-JUKKA OFFICE,
BERHAMPORE,
15 th April 1923.

**D. V. KRISHNARAO,**
*Secretary.*